


జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

గృహలక్ష్మి

## జయంతి మహోత్సవము

ఆకాశంలో పిల్ల తెమ్మెరలమధ్య నాట్యాలాడే రంగురంగుల జండాలు, తీర్చి దిద్ది కట్టిన మామిడితోరణాలు, వలయాకారంగా ఇరువైపులా అమర్చబడిన కుర్చీపంక్తులు, వాటినడుమ చదునుగా పరుపబడిన కంబళీలు, ఎదురుగా గృహలక్ష్మి జయంతి మహోత్సవ కార్యక్రమం జరుగడానికి వినూత్నాలంకారాలతో ఏర్పాటుచేయబడిన రంగ వేదిక— సాయం సమయపుశోభలో, పరిమళద్రవ్యాల మధుర సువాసనలలో, నూతనోత్సాహ వాతావరణంలో గృహలక్ష్మి 14వ జయంతి మహోత్సవం ప్రారంభమయింది—

సాయంకాలం 4 గంటలనుండీ ఒకరొకరుగా వచ్చే పురంధ్రీమణులను, పురుష మాన[illegible]ను గృహలక్ష్మి పత్రికాప్రచురణకర్తలు శ్రీ శేషగిరిరావుగారు ఎదురేగి ఆహ్వాని[illegible]ండగా, ఆహ్వానింపబడినవారికి సంపాదకులు మాన్యశ్రీ కేసరిగారు వందనపురస్సరంగా లోనికితోడ్కొనివచ్చి, ఉచితాసనములపై ఆసీనులనుచేసి, చందన తాంబూలాలతో

సత్కారముచేయుచుండగా—కార్యక్రమమును అత్యంత హృదయారవిందముగాను, నేత్రానందకరముగాను నడిపించడానికి శ్రీమతి దుర్గాబాయమ్మగారు సర్వసన్నాహాలు, ఏర్పాట్లు చేస్తూవుండగా సుమారు 5 గంటలకు జయంతిమహోత్సవ కార్యక్రమం "తెలుగు తల్లి" ప్రార్థనతో ప్రారంభమయింది—

జయంతి మహోత్సవాన్నీ, సంఘసేవాధురీణమైన ఒక ఆంధ్రమహిళామణికి సత్కారం జరిగే ఆశుభసమయాన్నీ కనులారా గాంచడానికి ఉవ్విళ్లూరుతూ మార్చి మొదటితేదీ శనివారంకోసం ఎదురుచూస్తూవున్న సర్వులను సంతృప్తిపరచడానికి అత్యంత జయప్రదంగా జయంతి మహోత్సవం ప్రారంభమయింది—

చెన్నపురి ఆంధ్రమహాసభ బాలికలు—గులాబీగుత్తులతో హారతులుపడుతూ ఆమె రుచిరకీర్తికి జోహారులు చేస్తూ, ఆమె మృదుమధుర ప్రత్యేకతని స్తుతిస్తూ "తెలుగు తల్లికి" ప్రార్థనలు అర్పించారు.

ప్రార్థనానంతరం వేదికమీద అలంకరింపబడిన ఆసనాలపై సభాధ్యక్షురాలు, 1940 గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీతలు 'కవికలహంసి' శ్రీమతి చేబ్రోలు సరస్వతీ దేవిగారు—1941 వ గృహలక్ష్మి స్వర్ణకంకణము నందుకొననున్న, రాజమండ్రి ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాలాధ్యక్షిణులును, 'సంఘసేవాధురీణ' బిరుదాంకితురాలును అగు శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారును, కరతాళధ్వనులు మిన్నుముట్టుచుండగా ఆసీనులయ్యారు. వెంటనే అధ్యక్షురాలును, కంకణగృహీతలును పుష్పమాలలచే అలంకృతులయ్యారు.

చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖ కార్యదర్శినియు, జయంతి కార్యక్రమ నిర్వాహకురాలును అయిన శ్రీమతి దుర్గాబాయమ్మగారు సభను ప్రారంభిస్తూ కంకణగృహీత శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారియొక్క సంఘ సేవాసక్తిని, దేశసేవాపరాయణతను విపులంగా వివరిస్తూ, వారి కంకణస్వీకరణమునకు ఎందుకు అర్హులయ్యారో నిరూపిస్తూ విపులంగా ఈలా ఉపన్యసించారు :

గృహలక్ష్మి స్వర్ణకంకణోత్సవం ఆంధ్రస్త్రీలకి పెద్ద పండగవంటిది. ఏ డెనిమిది సంవత్సరాలుగా గృహలక్ష్మి పాఠకులు యీ పండుగను వైభవంగా జరుపుతున్నా యీ మహోత్సవంలో పాలొనడానికి నాకు నిరుటివరకూ అవకాశం చిక్కలేదు. ఈ [illegible]వం చూస్తోంటే కవులనూ, గాయకులనూ, తదితరసంఘ నిర్మాతలనీ పూర్వపురాజులు

## ★ స్వర్ణకంకణం విజ్ఞానచిహ్నం. సేవ అనే పదంలో సకల విజ్ఞానం యిమిడివుంది ★

—దుర్గాబాయమ్మ

రించిన దినాలు జ్ఞాపకం వస్తాయి. దానితోబాటు మన దేశంయొక్క పూర్వ ఔన్నత్యం కూడా జ్ఞాపకంవస్తుంది. ఈ సదాచారాన్ని తిరిగి "గృహలక్ష్మి" పునరుద్ధరించిందని చెప్పాలి. దీనికి మనం—స్త్రీలు ముఖ్యంగా శ్రీ డాక్టరు కేసరిగారికి ధన్యవాదాలు యివ్వాలి.

స్వర్ణకంకణం విజ్ఞానచిహ్నం. విజ్ఞానం అంటే వాఙ్మయంలో పేరెన్నిక గనడమే కాదు. సేవ అనేపదంలో సకల విజ్ఞానం యిమిడివుంది. సంఘమునకుసేవ కొంతమంది కవులుగా చేయవచ్చు, మరి కొంతమంది గాయకులుగానూ, చిత్రలేఖకులుగానూ రాజకీయ వేత్తలుగానూ చేయవచ్చు. అంటే సేవ అనేక రూపాలను దాలుస్తుంది. ఇట్టి సేవచేసేవారే సంఘముయొక్క కృతజ్ఞతకు అర్హత పొందుతారు. సంఘం సజీవంగా వుండాలీ అంటే యీ ఆదర్శసేవకుల్ని అది యెప్పుడూ గుర్తిస్తూ పూజిస్తూవుండాలి. యెప్పుడైతే సంఘం తన అన్యక్తమైన యీ ధర్మాన్ని మరచిపోతుందో అప్పుడే దాని అంతు చూస్తుంది.

కామాక్షమ్మగారు అట్టి సంఘసేవకులలో అగ్రగణ్యురాలు. వీరిని గౌరవించడానికి అంటే ఆమెచేసినసేవకు మన కృతజ్ఞత చెప్పుకోమికిని మనం యిక్కడకూడాము. గృహలక్ష్మి పాఠకుల హయాన్ని, ఆంధ్రస్త్రీలతరపున మనం ఆమెకు స్వర్ణకంకణం బహూకరించడానికి సభచేశాము.

కామాక్షమ్మగారు ఆంధ్రస్త్రీలకు తెలియనివారుకారు. సంస్కృతాంధ్ర భాషలలో అసామాన్యమైన ప్రజ్ఞను గడించిన విదుషీమణి.

ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలను స్థాపించి, అస్తమించుచున్న ఆదిభాష సంస్కృతమును పునరుద్ధరించిన భాషా సేవకురాలు కామాక్షమ్మగారు.

వైశ్యసేవాసదనమును నిర్మించి అనేకమంది ఆంధ్రస్త్రీలకు విద్యాదానము చేయుటేగాక అక్షరజ్ఞానమునకే కరువుగాతోచు అనాథ బాలికలకు సదనములో ఆశ్రయ

మిచ్చి మాతృదృష్టితో వారిని పెంచి వారికి విద్యావ్యాసంగము నిచ్చుచున్న సంఘోప కారి కామాక్షమ్మగారు.

వారు నా కన్నపెద్దలు. మాతృభావంతో వారికి నమస్కరించి, యిట్టి సంఘ సేవ యింకను ఏండ్లకొలది చేయపీలగునట్లు భగవంతుడామెకు ఆయురారోగ్యములీయ ప్రార్థించుచున్నాను.

తదనంతరము సంపాదకులగు శ్రీ కేసరిగారు గృహలక్ష్మి స్వర్ణకంకణమును శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికి బహూకరిస్తూ యిట్లు ప్రసంగించారు—

నేడు మన అందరి సమక్షమునను యీ స్వర్ణకంకణమును స్వీకరించుచున్న శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారిని గురించి శ్రీమతి దుర్గాబాయమ్మగారు విపులముగా చెప్పియున్నారు. కనుక ఇక ఆ విషయమునుగూర్చి నేను ప్రసంగించ నవసరములేదని భావించుచున్నాను. మీరు కంకణమును స్వీకరించువారినిగూర్చి తెలిసికొన్నారుగాని, కంకణమును బహూకరించుచున్నవారిని గురించి తెలిసికొనలేదు. బహుశః యీ విషయము మీలో చాలమందికి తెలియదు—అది నాస్వవిషయము. నేడు మీ సమక్ష మున కామాక్షమ్మగారికి నేనీ కంకణమును ఎందుకు బహూకరించుచున్నానో ఆ కారణ మును—అనగా నా స్వవిషయమును మీకు మనవిచేసికొను చున్నాను. నేను నిరుపేద బ్రాహ్మణ కుటుంబమునకు చెందినవాడను. భుక్తికి జరుగక భిక్షాపాత్రచేబూని, యీ చెన్నపురి వచ్చినప్పుడు నా భిక్షాపాత్రను ఆదరించి అక్షయపాత్రగా చేసినవారు స్త్రీలు అందు ముఖ్యముగ వైశ్యస్త్రీలు. ఇది మొదటి కారణము—

రెండవకారణము—నేడు యీసభ నలంకరించియున్న శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారి కులదేవత యీ ఊరియందుగూడ నున్నది. ఆమెయే శ్రీ కన్యకాపరమేశ్వరి. ఆదేవి యనుగ్రహమున 'శ్రీ కన్యకాపరమేశ్వరి - ధర్మ వైద్యశాలలో'లో నేను మొదట ఉద్యోగమునకై ప్రవేశించినాను. నాటినుండియు యీ వైశ్య మహిళామణుల అభిమాన ప్రోత్సాహములవలన నేను వృద్ధిలోనికి వచ్చియున్నాను. నా కృతజ్ఞతను తెల్పుకొనుటకై ఆమెకీసత్కార మొనర్చెదమన్న ఆ కన్యకాపరమేశ్వరి ఇచటకు రాదు. ఆమె దేవాలయ ములో బ్రాహ్మణులచే అష్టదిగ్బంధనముచేసి యుంచబడినది. ఆదేవియే యీ కామాక్షమ్మ గారి రూపమున యిచ్చటికి విచ్చేసి నా యాతిథ్యము నంగీకరించి నన్నానందింపజేయు చున్నదని నేను భావించుచున్నాను.



జయంతి మహోత్సవంలో పాల్గొన్న స్త్రీలు - పురుషులూ —

మరియొక కారణముకూడ గలదు.—

మొదట యీయూరు వచ్చినప్పుడు వారములు చేసి చదువుకొనుచుండెడి వాడను. అప్పుడు నన్నాదరించి అన్నముపెట్టినవే యీ పవిత్రమైన హస్తములు.

నాల్గవ కారణము—స్త్రీల ఆరోగ్యమునకై నేను తయారుచేసిన ఔషధరాజము విక్రయించి ఆ సంపాదనతో జీవయాత్ర సల్పుచున్నాను. ఇది స్త్రీ ధనము. యీ స్త్రీ విత్తము పురుషులకు అంత సులభముగ జీర్ణమునకు రాదను భావముతో కొంతవరకైనను వారికుపయోగించి ధన్యతకాంచవలెనని నా అభిప్రాయము.

నాకు భిక్షముపెట్టి, అన్నముపెట్టి ఆదరించిన ఆ గాజుల చేతులు ఇప్పటికిని నాకు కన్పడుచునే యున్నవి.

ఆ యీ కారణములవలన, నా కృతజ్ఞత తెల్పుకొనుటకును,- యీ సమయమున నా స్వీయవృత్తాంతమును కొంత చెప్పికొనుటకును అవకాశము లభించినందుకు సంతోషించుచు, యీ వైశ్యకులపావనియగు శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికి యీ స్వర్ణ కంకణమును బహూకరించుచున్నాను.

నా యాహ్వానమును అంగీకరించి, దూరభారములకు వెనుదీయక యీ పెద్ద తనములో యిచ్చటకు విచ్చేసి యీ స్వర్ణకంకణమును మీ యందరిసమక్షమున స్వీకరించుచున్నందులకు నేనెంతయు ఆనందించుచు నా కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

ప్రసంగానంతరం డా॥ కేసరిగారు గృహలక్ష్మి స్వర్ణకంకణాన్ని శ్రీమతి బత్తుల కామాక్షమ్మ గారి హస్తాన్ని స్వయంగా అలంకరించారు. వెంటనే ఉత్సాహోద్రేకాలు పెనవేసుకొనియున్న ప్రేక్షక సముదాయంలో కరతాళధ్వనులు మిన్నుముట్టాయి—

స్వర్ణకంకణమును స్వీకరించి, తమ కృతజ్ఞతను తెలుపుచు శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు ఇట్లు ఉపన్యసించారు :

సోదరీమణులారా! సోదరులారా!!

ఈనాటి స్వర్ణకంకణ ప్రతిగ్రహమునకును నా యర్హతకును గల యౌచిత్యముం జూడ నాకే నవ్వు పుట్టించుచున్నది. అయినను మీ యందఱి దర్శన భాగ్యము నంది మీ మీసుభాషితములను గర్ణపేయములుగా నాకర్ణించి స్వయంపూతనగుటకే నా యీరాకయని మీ కెల్లరకును సవినయముగ మనవిచేయుచున్నదాన.

పూర్వకాలమున మదకరీంద్రముల నెక్కించుకొని, స్వయముగ కవిగండ పెండేరములను గాలికిఁ దొడిగి, పెక్కింటి యగ్రహారముల నరణములుగ నొసంగి యాదరించిన వదాన్యులెందఱో కవులపాలిటఁ గల్పద్రుమములై యుండిరని మన చరిత్రలెల్లఁ దెల్లము చేయుచున్నవి. ఆ ప్రాచీన పంథనే శ్రీయుతులగు మన కేసరిగారును నిరంతరాయముగ ననుసరించుచుండిరని నేనింతవఱకుఁ దలంచియుంటిని. కాని యీ నాఁటి సమ్మానమునకు నన్నాహ్వానించుటఁ జూడ నా తలంపును దిద్దుకొనవలసి వచ్చుచున్నది. నేనొక కవయిత్రినిగాను, ప్రవక్త నంతకంటెఁగాను. అయినను నీవేదికను నిల్చిన ప్రభావముననో మఱెందుచేతనోగాని యొక నూతనధైర్యము నన్ను మాటాడించుటకుఁ బురికొల్పుచున్నది; తప్పులను మన్నింతురుగాక—

గృహలక్ష్ములకుఁ గావలసినది గృహలక్ష్మి తప్ప వేఱొండులేదని యెల్లరకును దెలిసిన విషయమే. మున్ను శకున్తల నత్తవారింటికిఁ బంపుసమయమునఁ గణ్వమహర్షి సయితమామెను గృహలక్ష్మిగ వెలయుమనియే బుద్ధులగఱపి పంపించెను. మఱియుఁ బెక్కండ్రు తలిదండ్రులు తమ తనయలు గృహలక్ష్ములుగావలెననియుఁ, దన్మూలమున వారు పేరు ప్రతిష్ఠలఁ జెందవలెననియు వాంఛించుచుందురు. 'దశపూర్వేషాం దశాపరేషా' మను సూక్తి సయితము గృహలక్ష్ముల ప్రభావమునే ప్రకటింపఁ జాలియున్నది.

కరచరణాద్యవయవములకెల్లను శరీరము గృహము. శరీరధారులకు నివాసస్థానము గృహము. ఇట్టిగృహము రాణించునది కేవలము స్త్రీ మూలముననే యని యాదికాలమునుండియు మనవారందఱు నంగీకరించుచునే యున్నారు. పై విధముగ స్త్రీ యాజమాన్యమునఁ బ్రవర్తిల్లు గృహమే కీర్తిని గణించుకొనఁగల్గును. గృహమునకుఁ గీర్తియనఁగా గృహమున నివసించువారి కెల్లరకును బేరుప్రతిష్ఠలు కల్గుటని యర్థము. పూర్వకాలమునఁ గూడ సీత, సావిత్రి, ద్రౌపది, దమయంతి మున్నగాఁగల లోకమాతలు తమతమ ప్రభావము వలననే తమ భర్తలకును బందుగులకును బ్రజలకునుగూడ శాశ్వత సుఖములఁ గల్పించి చిరస్మరణీయులై యుండిరి. పురాణదృష్టితో నొక్క గృహస్థాశ్రమమును దిలకింపుఁడు. గృహలక్ష్మిలేని గృహస్థు కొమ్మలులేని దిసిమ్రాను. కల్యాణదాయకమగు నే కార్యమునకైనను నాతఁడనర్హుఁడు. దీనింబట్టి యాతని సర్వస్వమున కంతకు నాధిపత్యము వహించునది స్త్రీయని వ్యక్తమగుట లేదా? కాఁగా నిట్టి మహత్తరమగు నాధిపత్యము స్త్రీల కనాదిసిద్ధముగ లబ్ధమైయుండిన నేమి ప్రయోజనము? అద్దానిని నిలువఁబెట్టుకొనఁగల సామర్థ్యముకూడ స్త్రీలకలవడి యుండవలెను. అనఁగా విదుషీమణులగు యువతీమణులు మాత్రమే తమ తమ బాధ్యతలను సమగ్రముగ గుర్తింపఁ జాలియుందురు.

ఈ నాఁటి యువతీలోకము వైదుష్యమునెడఁ జాల వెనుకఁబడి యున్నదనుట నిర్వివాదము. మన దేశమునకుఁ బ్రస్తుతకాలమునఁ గలిగిన దుస్థితి కిదియే ప్రధానకారణ మని కూడ నా నిశ్చితాభిప్రాయము. కావున దేశకల్యాణమును వాంఛించు నారీమణు లెల్లరు చక్కని విద్యా వైదుష్యమును గడింప ముందడుగు వేయవలెను. ఒకనాఁటి మన భారతనారీమణులను మనము జ్ఞప్తికిఁ దెచ్చుకొన్నచో నియ్యది యలభ్యమనుటకు వలనుపడదు.

★ గృహలక్ష్మిలేని గృహస్థు
కొమ్మలు లేని దిసిమ్రాను ★

—బత్తుల కామాక్షమ్మ

వైదుష్యమును గడించుటనఁగా నమరకోశము వల్లించవలెనని కాని, రఘువంశ కుమార సంభవముల బట్టీ పట్టవలెనని కాని, మనుచరిత్ర వసుచరిత్రలను దలక్రిందుగా నప్పగించవలెనని కాని, హూణభాషలోనే చొరఁబడవలెనని కాని నా యుద్దేశము కాదు. విద్యయనఁగా జ్ఞానము నిచ్చునది. ఏ యజ్ఞానముచే మన మావరింపఁబడి దిక్కులుగానక యంధప్రాయముగ నుండి దేశమునకు దుస్థితిని గల్పించుచుంటిమో యట్టి యజ్ఞాన తిమిరమును సమూలముగ బారద్రోలఁజాలు విద్య నాలోచించి యభ్యసింపవలెను. అట్టి విద్యయే యిహపర సుఖదాయకమగును. అర్థములేని యనుకరణ మనర్థహేతువగును. తమతమ స్వీయశక్తుల నంతరమెఱింగి ప్రవర్తించెడివారే యాదర్శక పథము నలంకరింపఁ గలరు. సత్యబద్ధమగు దీక్షతోఁ బనిచేసినవారికిఁ బరాజయము దూరమున నుండును. ఇఁక నలభ్యమగున దేముండును? ఈర్ష్యాసూయలకు లోనుగాక, స్వార్థ పిశాచమునకుఁ దావీయక, నీతి బాహ్యములగు ప్రవర్తనల కలవాటుపడక, సంఘశ్రేయమే తమశ్రేయమని పాటుపడు నాదర్శక యువతులెందఱో మన దేశమునఁగలరు. కైతనల్లుటందును, శిల్పమును బ్రదర్శించుటందును, మృదుమధురముగ నుపన్యసించుటందును, సమయోచితములగు సాహస శౌర్యముల నావిష్కరించుటందును నారితేరిన వారెందఱో కలరు. అట్టి సనాతనాధునాతన సతీమణుల నాదర్శకముగ నిడికొని యువతీలోకము తమ కర్తవ్యమును జయప్రదముగ సాధించుటకై గడంగవలెనని నా ప్రార్థన.

ఈ నాఁటి యువతీమణుల నందఱను గృహలక్ష్మి పత్రికా మూలమున సార్థక గృహలక్ష్ములనుగాఁ దయారుచేయుటకై తమ సర్వస్వమును ధారపోయుచున్న శ్రీయుతులు కేసరిగారెంతయు వందనీయులు.

ఈ గృహలక్ష్మి పత్త్రిక చిరస్థాయినియై విరాజిల్లవలెననియు నిట్టివే మఱికొన్ని పత్రికలు మహిళామణుల కుపకారకములుగ వెలయవలెననియుఁ దన్మూలమున దేశ కల్యాణము చేకూరవలెననియుఁ బరమేశ్వరునిఁ బ్రార్థించుచు నింతటితో విరమించుచున్నదాన.

తదనంతరం శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు కంకణ బహూకరణంలోవున్న మహత్తర భావాన్ని, అందుకు స్త్రీ లోకం నడుచుకొనవలసిన రీతిని విశదీకరిస్తూ, డా|| కేసరిగారికి స్త్రీ లోకమునకు వారుచేయుచున్న అపారమైన సేవకు కృతజ్ఞతను వెలిబుచ్చుతూ యీ విధంగా ఉపన్యసించారు:

సోదర సోదరీమణులారా!

నేటి సభకు విజ్ఞానధన్యు లెందఱోయుండ, తత్త్వవేత్తలుండ, విద్యావతులుండ, అగ్రాసనాధిపత్య భాగ్యము నాకు లభించుట పురాకృత పుణ్యవిశేషమేకాని మఱొండుకాదని తలంచుచు నా కృతజ్ఞతను వెల్లడించుచున్నాను.

నేడు గృహలక్ష్మి స్వర్ణకంకణ మహోత్సవ పుణ్యసందర్భము. అయ్యది కేసరిగారి మహోదార గుణాతిశయభాగ్యశ్రీలచే లభ్యము. భాషా ప్రపంచమున నెందరెందఱో కవితా నారీశిరోమణులు దేశసేవకై, మాతృసేవకై, సంఘాభివృద్ధికై ప్రాణ మర్పించు పుణ్యాంగన లెందఱోకలరు. భారతదేశసౌభాగ్య భాగ్యవైభవము భారతస్త్రీలపైననే నిలచియున్నదనియు, యట్టి తల్లులను పోషించుట భారతమాతను బూజించుటేయనియు గ్రహింపగల్గిన ధీశాలి, గుణరత్నాకరుఁడు, నిండు మనంబుగలవాడు ఒక్క కేసరియే. వారు మనపాలిట తండ్రియై మన కన్నింట చేయూతనిచ్చి భాషాసేవకును, సంఘోద్ధారణమునకును తగినంత ప్రోత్సాహమిచ్చు జనకుఁడు. జనకునివలె తత్త్వవేది. కనుకనే అటనటగల నారీమణులను, ప్రజ్ఞానిధియగుటచే, సేకరించి ఒకచోటకుఁజేర్చి తన గృహలక్ష్మి పత్రికారత్నమున కండగాఁజేర్చుకొని, పత్రికారూపమున యశోలక్ష్మినిఁ జేబట్టి, దిగంత విశ్రాంతకీర్తి నార్జించుచున్న కేసరిగారి దయాఋణ మేనాటికిని తీరనిది. కవితా రసాస్వాదనతత్పరతయు, గానకళాప్రియత్వమును, లలితకళా సౌందర్య మెఱింగిన లోకజ్ఞానియు నగుటచే కవులకు, గాయకులకు, చిత్రకారులకు కళా ప్రపంచమున నున్నతస్థానము కలుగుచున్నది.

సేవా పరిణామమెట్టిదైనను భాషాశ్రీ రూపమును దాల్చవలసినదే. అప్పుడుగాని శాశ్వతముగా వెలుగొందదు.

"స్త్రీలు పురుషుల కెందును దీసిపోరు" అను రహస్యమెఱింగినవారు కేసరిగారు గనుక మన కాధారభూతులగుచున్నారు. అందుచే మనకు లభించుచున్న గొప్ప అవకాశమును జారవిడువక, యేకీభావమున మన మందఱముగలసి భాషాదేవిని, వివిధపుష్పములచే బూజించి ఆనందింపజేయుట మన ముఖ్యకర్తవ్యము. ఏ తత్కార్యములయందే కాలము తిన్నగా గడుపుకోగలిగిననాడు మనకుండు సంతోషము వర్ణనాతీతము. నిజమగు సౌఖ్యము మన మాచరించు సత్కార్యములయందే దాగుకొనియుండును. ఫలవంతమగు పుష్పమునందే కదా శోభస్కరమును, మనోహరమునునగు చిత్రవిచిత్రములగు వర్ణము లుదయించుట! ఇది ప్రకృతి లక్షణమే. ఈ మానవప్రకృతినే Ruskin మహాకవి యిట్లు వ్రాసెను.

"If men are rightly occupied their amusement grows out of their work as the colour petals out of a fruitful flower."

చ॥ మురిపెపు వృత్తియందు దినముల్ గడుపంగల భాగ్యరేఖ యె
వ్వరికి లభించు వారల కపారితహర్షము నందె పుట్టు, సుం
దరవరవర్ణశోభ ఫలదంబగు పుష్పదళంబునందునే
తిరముగఁ బుట్టుచుండుటలు దీనికి మేటి నిదర్శనంబగున్ ॥

కనుక, గృహలక్ష్మి కంకణ శ్రీ భాగ్యములను బొందుచు, గృహలక్ష్మి పోషక కార్య కర్మలం దాసక్తికలిగి యిదియే మనకు తగిన సేవయని తలచిననాఁడు భారత దేశాభివృద్ధికి మన మాధారమగు కీర్తి సంపాదించుకో గలిగినవారల మగుదుము.

నేటిసభలో, బత్తుల కామాక్షమ్మగారికి, వారుచేసిన దేశసేవకు, చేయుచున్న సంఘసేవాధురీణతకు, పొందిన యుభయ భాషాప్రవీణతకు, స్థాపించిన సంస్కృతాంధ్ర కళాశాలా విఖ్యాతచరిత్రకు స్వర్ణకంకణము కానుకగానీయబడుట మోదావహము. ఈ మన సోదరీమణికి భగవానుడింకను భారతదేశ సేవకుగాను దీర్ఘాయురారోగ్యమును కటాక్షించి ప్రసాదించుగాక. ఇట్టి యవకాశము గలిగించి పోషించుచున్న కేసరిగారును గృహలక్ష్మితో చిరాయుర్భాగ్యములనుగాంచి వర్ధిల్లుదురుగాక.

భారతదేశాభివృద్ధి నారీరత్నములపై నాధారపడి యుండుటచే మనము మాత్ర సేవ చేయుటయేగాక మన పుత్రపుత్రికారత్నములకు చిరుప్రాయమునుండి భక్తి, నీతి, జ్ఞానోదయములగు భారతవీరగాధల నుగ్గుపాలనాటనుండియు నలవడజేయుట ముఖ్య కార్యధర్మమని గుర్తెఱుంగవలెను. ఇంతకంటె పరమపవిత్రమగు కార్యము మనకులేదు. దీనికి మనకు మార్గదర్శకులు మనసోదరి దుర్గాబాయమ్మగారు. వీరిభాషాసేవ, సంఘసేవ,

దేశసేవ, కార్యదీక్ష మనకందరికి సువిదితము. వీరిని ఒరవడిగాఁజేసుకొని మన మీకార్యరంగమున నొక్కటిగాఁజేరి ఏకీభావంబుతో కృషిచేసినయెడల విజయము నిశ్చయము. ఆంధ్రమాత గర్భమున బుట్టగలుగు భాగ్యము మనకు గలిగినందులకు మనచరిత్ర ఈ రీతిగా శోభిల్లవలెనని నాయాశయము.

శా॥ పాతివ్రత్య మహాగుణమ్మున సతీభావానఁ జెల్వారు వి
స్ఫీతప్రాభవమందు సీతయనఁగాఁ బెంపొందు, భాగ్యంబునన్
శ్రీ తన్వీ మణితోడ నీడుపడు నా శ్రీ గారితో సాటియా
నీ తన్వంగియటన్న కీర్తిఁగొనుటెంతే నొప్పు స్త్రీజాతికిన్

ఉ॥ పావన మాతలందఱును బశ్చిమ మార్గము లుజ్జగించి సం
భావిత ధర్మమెల్లఁ జిఱుప్రాయమునందుపదేశమిచ్చుచో
జీవితమందు బిడ్డలకుఁ జేరదు దైన్యమొకింతయైన నీ
భూవలయంబునందు నతిపూజ్యులకీ సుకృతంబుఁ గల్గెడిన్

ఉ॥ భారత గాథలెల్లఁ బసివారికిఁ జిత్తముపల్లవింపఁగా
నేరుపు మీరఁజెప్పునెడ నీతికి దూరముగాక నెమ్మదిన్
ధీరత గాంచి జీవితము నెట్టగఁ జూచెద రాంధ్రభూమికిన్
గీరితిఁ దెచ్చుకొన బరికింపఁదగున్ సతులిట్టిపద్ధతుల్.

మహిళామణుల మహితోక్తులతో ఇంతవరకు జరిగిన కార్యక్రమం—తదుపరి చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖ సభ్యులచే కావింపబడిన నృత్య, గాన ప్రదర్శనాలతో అత్యంత మాధుర్యవంతమైంది.

ప్రప్రథమంలో "రంగపూజ" నృత్యం కావింపబడింది. చక్కనిపణితి, దానికితగిన భావంతో బాలికల యీ ప్రదర్శనం ప్రేక్షకులను ఆనందడోలికలనుంచి ఊచింది.

తరువాత కవితిలక, కవితావిశారద, విద్వాన్, శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు కంకణ ప్రదానమును గురించి ముచ్చటించుచు, శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికి "విద్యాప్రదాయిని" అను బిరుదమును, గృహలక్ష్మిపత్రిక తరపున ప్రసాదించుచు ఇట్లు ప్రసంగించారు :

**నారీమణులారా! ఆర్యులారా!!**

ఉ॥ స్త్రీలను బాగుసేయుటది దేశమునంతయు బాగుసేయుటే
శీలము ధర్మమున్ బలము చేడెలకయ్యవి నిల్పుకున్న నె
క్కాలము నార్యసంతతికి గల్గును సేమము లాభమింతకున్
మూలము స్త్రీలు వారి పరిపూర్ణత పూర్ణత జాతికంతయున్.

అని డాక్టరు కేసరిగారు గ్రహించియే నేటికి 14 ఏండ్లనుండి గృహలక్ష్మి పత్రికను స్త్రీల కొఱకు స్థాపించి మానినీమణులకు వలయు నాదర్శముల నందుమూలమున నాంధ్రలోకమునకు ప్రకటించుచున్నారు. మగవారిని, యాడువారినికూడ కనువారు, పెంచువారు స్త్రీలే కదా! శివాజి తల్లిమూలమున నట్టి మహావీరుడయ్యెను. విశ్వామిత్రు నంతవాడు చిన్ని శ్రీరామమూర్తిని గాంచి "కౌసల్యా సుప్రజ" అని మురిసిపోయెను. శిశువుల పాలనయందును, వారి మనఃపరిణామములను మంచికి మార్చుటయందును, దల్లికిగలయవకాశము, నధికారము దండ్రికిలేదు. తల్లియే శిశువుల కున్న తాశయబీజముల వారిలో నిక్షేపించవలెను. తల్లులకు దేశమందు, విజ్ఞానమందు శ్రద్ధలేకపోయిన జాతియంతయు భ్రష్టమైపోవును. స్త్రీల వలననే జాతిమత భాషాధర్మములు నిలుచును.

శ్రీ కేసరిగారు పత్రికతో దృప్తినొందక నారీరత్నములగు విద్యావతుల, కవయిత్రీమణుల, సంఘసేవాధురీణల, గాయకీమణుల, జిత్రకళానిపుణల నేరితెచ్చి గృహలక్ష్మి కంకణములచే మాతృమూర్తుల బూజించి ప్రోత్సహించుచున్నారు.

చ॥ వెదకినగానరాడు పృథివీపతియొక్కడు సత్కవీంద్రులన్
వెదకి యొసంగనూరయిన, వెంటబడంగఁబడంగ నెట్టులో
వదలుచుకోగడంగు నృపవర్యుఁడొకండెటనుండునో కదా
ముదితల సత్కవిత్వగుణముంగని పూజలొనర్ప సాధ్యమే!

క॥ భూసురుఁడు వైద్యవిద్యా భాసురుఁడు త్రిలింగభూమి ఫలభూతుం
డగ్రేసరుఁడు దానముల నీ కేసరి కీసరికి సాటికిఁగలరెయొరుల్!

స్త్రీలు పూజ్యులు, అని గ్రహించి వారి పూజయే భాషాసేవ, దేశసేవ, లోకపూజ యని శ్రీ కేసరిగారు స్త్రీలను ఇన్ని విధముల ప్రోత్సాహపరచుట ఏల? మహనీయులను దేశభక్తులను, భక్తరాండ్రను తయారుచేయు భారము స్త్రీల మీాద నున్నదను సూత్రమును నమ్మినవారగుటచే మాతృపూజ చేయు

★

"సేవ భాషా శ్రీ
స్వరూపము"

—చేబ్రోలు సరస్వతీదేవి

★

చున్నారు. శ్రీ పరమేశ్వరుఁడు శ్రీ కేసరిగారికి ఆయురారోగ్యైశ్వర్యాదుల నితోధికముగ నిచ్చి వారి యారంభముల ఫలవంతములుగఁ జేయుగాత!

కం॥ కామాక్షికృపన్ బత్తుల కామాక్షమకబ్బె నాంధ్రకాంతామణులన్
ధీమతులఁజేయు సుకృతము సామాన్యమె యిదియుఁ బూర్వజన్మఫలంబే.

గీ॥ ఆంధ్రయువతీ కళాశాల నాదరించు
నిన్ను బూజించి గృహలక్ష్మి సన్నుతిఁగనె
వేడ్క 'విద్యాప్రదాయిని' బిరుదునొసఁగె
సంఘసేవాధురీణవై సాటిలేని
యశముగాంచు కామాక్షి శ్రీ హరికృప నిల!

బిరుదప్రదానానంతరం కుమారి కల్పకం అను ఆరేండ్లబాలిక మువ్వ గోపాలపదమును పాడుతూ అభినయించింది. ఆ లేత తేనెపలుకులు, కాళ్లకుకట్టిన చిరుగంటల మ్రోతలు, బాలిక కనపరచిన హావభావ విన్యాసాలు-సభ్యుల దృష్టిపథాన్నుంచి మరి పోలేవు. ఈ అభినయ ప్రదర్శనంచేసి ఉత్సాహంతో అందరిని ఊగులాడించిన కుమారి కల్పకం ధన్యురాలు. ఈ బాలికకు యీ నృత్యమునుగరపిన శ్రీమతి రంగనాయకమ్మగారు మిక్కిలి ప్రశంసా పాత్రురాలు—

తర్వాత రాజమండ్రి ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలలో సంస్కృతాంధ్రాధ్యాపకురాలును, కొవ్వూరు మహిళామండలి కార్యదర్శినియైన శ్రీమతి వేదవల్లి తాయారమ్మగారు "స్త్రీలు-ఉద్యోగాలు" అనే విషయముపై గంభీరంగా ఇట్లు ఉపన్యసించారు:

స్త్రీ యన నొక సర్వశక్తి సంపన్నయగు వ్యక్తి, ఆమెకు సృష్టిలోఁ బ్రధానస్థానమే గాదు, మూలాధారమే యామె. ప్రకృతిలేనిచోఁ బురుషుఁడెంత సామర్థ్యవంతుఁడయ్యు నశక్తుఁడగును. కాననే మూల పురుషులుగూడ నొకరు వదనమందిడుకొనియు, నొకరు వక్షమున ధరించియు నొకరు శిరసావహించియు నీ ప్రకృతిని బూజించుచున్నారు. వేదకాలమునుండియు స్త్రీల కన్నివిషయములందును ప్రాధాన్యమిచ్చిరి. "యత్రనార్యస్తు పూజ్యన్తే తత్ర రమన్తే దేవతాః"అని స్త్రీలకుఁ బూజార్హతనిచ్చిరి. "మాతృదేవోభవ" "పితృదేవోభవ" అనుటలోఁ బ్రథమమున మాతృదేవతను స్మరించి తరువాత పితృదేవునిఁ బేర్కొనిరి. ఋగ్వేదకాలమున స్త్రీలకుపనయనాది సంస్కారములును, బ్రహ్మచర్యాద్యాశ్రమ స్వీకారము మున్నగున వన్నియు నున్నట్లు శ్రుతిప్రమాణములుగలవు. గార్గి, మైత్రేయి అదితి, అపాలా మున్నగు విదుషీమణులు బ్రహ్మవాదినులై వేదములలోఁ గొన్ని ఋక్కులనుగూడ రచించినట్లును, మంత్రద్రష్టలై కొన్ని మంత్రములను గనుఁగొనినట్లును జరిత్ర చెప్పుచున్నది. పురుషప్రపంచము గంభీరగుణ శోభితము. నారీ ప్రపంచము లలితగుణ రంజితము. విద్యలలోఁగూడఁ గొన్ని కేవలము పురుషులే సాధింపఁదగినవి గలవు. అట్లయ్యును గర్కశములగు గణిత జ్యోతిశ్శాస్త్రముల నభ్యసించి లీలావతీ, ఖానాదేవులు చిరయశము నార్జించిరి.



గృహలక్ష్మి జయంతి మహోత్సవం — శ్రీమతి దుర్గాబాయిగారు ప్రారంభోపన్యాసం యిస్తున్నారు



"జయంతి మహోత్సవం". అధ్యక్షురాలు సరస్వతీదేవిగారు, కంకణగృహీత కామాక్షమ్మగారు,
పూర్వపు కంకణ గృహీతలూ, తదితర విదుషీమణులు

మధ్యకాలమున రాజ్యము లేలిన రమణీమణులుగలరు. కత్తిచేఁబట్టి కదనరంగమునకురికి శాత్రవులఁ జించి చెండాడిన చండికలున్నారు. కాకతీయ సామ్రాజ్యమును జతురతతో నేలిన రుద్రమదేవి, బ్రహ్మనాయు నంత వానిని గజగజలాడించిన నాయకురాలు నాగమ్మ మొదలైన వీరనారీమణులఁ దలఁచుకొని జోహారు లొనర్పనివారుందురా? కాననే "కరణేషుమంత్రీ" అని గృహ రాజ్యమునకు స్త్రీ నమాత్యునిగా నొనర్చిరి. అట్టి రాచకార్యములే నిపుణతతో నిర్వహించినవారికి జిన్నచిన్న యుద్యోగములుచేయుటేమి లెక్క?

> "స్థిర చిత్తముగల స్త్రీ లెందఱు ఖలులనడుమ నున్నను వారి సచ్ఛీలరత్న ప్రదీపము చల్లారనేరదు"
>
> —వేదవల్లి తాయారమ్మ

కాలక్రమమున "చెట్టు చెడుకాలమునకు కుక్కమూతి పిందెలన్నట్లు" నిస్సారమగు స్త్రీ జాతి దేశమున వ్యాపించినది. వారి సంతానమును నశక్తమైయుంటచేతనో; కాలమునఁ గలిగిన మార్పులవల్లనో, దేశ దౌర్భాగ్యమువల్లనో, మఱెందువల్లనోగాని స్త్రీయన నొక యాటవస్తువైపోయినది. పిల్లలను దీయునొక యంత్రమై నిస్తేజస్కమగు దుర్బల సంతానముతో దేశమును నింపివేయుచున్నది. విద్యాగంధ మిసుమంతైనను లేక మూర్ఖత తలమున్కలుగాఁగ తనకుఁగల సర్వశక్తులను హక్కులను బోఁగొట్టుకొనినది. సృష్టికి మూలకారణమగు నీజాతి యింతటి దుస్థితియందుండుటచేతనే దేశ మధోగతికివచ్చినదనిన నేరనుగాదనఁజాలరు. పాశ్చాత్యుల నొకపరి పారఁజూడుడు! ఆ దేశములందు స్త్రీలు సుమారు నూటికిఁ దొంబదిమంది విద్యావతులే. వారు చాలవరకు బరులపై నాధారపడక సొంతమునకై సొమ్ము సంపాదించుకొని తాము జీవించుచు నితరులకు సాహాయ్య మొనర్చుచున్నారు. పరోపకారము, సహనము, త్యాగము, మొదలగు సుగుణములతో నిండియుందురనుటకు వారు మన దేశమున స్థాపించిన వైద్యశాలలు, విద్యాలయములే నిదర్శనములు. అట్లని మనము పూర్తిగా వారి ననుకరింపవలెననిగాదు. "పురాణమిత్యేవ నసాధుసర్వం । నచాపికావ్యం నవమిత్యవద్యం । సన్తః పరీక్ష్యాన్యతరద్భజన్తే । మూఢః పరప్రత్యయనేయబుద్ధిః" అని శ్రీ కాళిదాస మహాకవి చెప్పినట్లు పూర్వాపర సందర్భములను జక్కఁగా విమర్శించి యాచరణ యోగ్యములగు మంచి పద్ధతుల నవలంబింపవలెనుగాని యంధానుకరణము సరిగాదు. కాన మన దేశపుటాచార వ్యవహారములకుఁ దగునట్లు మన స్త్రీలకు మరల మంచి నాగరకతను గలిగించి విద్యా వివేకములను బెంపొందించినఁగాని దేశ సౌభాగ్యము గలుగనేరదు.

మఱియు స్త్రీకి స్వయంపోషకమగు శక్తినిఁగూడ గలిగించవలెను. ఎందఱో నారీమణులు నిరాధారలై జీవితములను దుర్భరము లొనర్చుకొనుచున్నారు. గృహిణికి గృహరాజ్యభారము నిర్వహింపవలసిన బాధ్యతయుండుటచే బయటి రాచకార్యములు చూచుకొనుటను బురుషులకు విధించి గృహపోషణభారము వారిపై నుంచిరి. అందువలన "ఉద్యోగం పురుషలక్షణమ్" అను నార్యోక్తి ప్రబలినది. స్త్రీ లెట్టి పనికినిఁ బనికిరాక యొక్క వంటయింటియందే యణగిపోయి, వారి మానసిక శక్తులన్నియు నడుగంటిపోవలెనని

కొందఱు మహనీయుల సంకుచితాభిప్రాయము. కాని విశాలదృష్టితో నీ విశ్వమును దిలకించినచో స్వాభావము మార్చుకొనక తప్పదు. పైఁజెప్పిన యార్యోక్తి సామాన్య సూత్రము లోకమునఁ బ్రసిద్ధములగు సామాన్య సూత్రముల కన్నిఁటికి విశేషసూత్రములుండును. అట్లే యుద్యోగమునకుఁ బనికివచ్చు స్త్రీలకుఁ గూడ నుద్యోగపు టర్హతగలదను నొక విశేషసూత్రము రచించు టావశ్యకము. ఓరిమితోను బట్టుదలతోను బనులు చేయుట స్త్రీలకు సహజము. కాన నెట్టి యుద్యోగమునైనను నిర్వహింపగలరనిన సాహసోక్తిగా నేరదు. ఈ యాచారము నేడు క్రొత్తగా వచ్చినదిగాదు. పైనిఁ జేర్కొనిన మన యాంధ్రరమణీమణులే మన కాదర్శము.

అధునాతన కాలమునగూడ శ్రీ విజయలక్ష్మి పండిట్, శ్రీ సరోజినీనాయుఁడు మున్నగు నల్ప సంఖ్యాక మహిళామణులు పురుషులకెందును దీసిపోని ప్రతిభతో రాచకార్యముల నడుపుట మనము చూచుచునేయున్నాము. మఱియుఁ బ్రధాన న్యాయస్థానములందు న్యాయవాదినులుగను, నుపాధ్యాయినులుగను, వైద్యురాండ్రుగనుగూడఁ గొందఱున్నారు. రెవెన్యూ డిపార్టుమెంటు, సివిల్ యిలాకా, జిల్లాబోర్డు, ముద్రణాలయములు, వ్యవసాయశాఖ మొదలగు నన్నిశాఖలందును (ఏవో కొన్నిశాఖలు తప్ప) స్త్రీలుద్యోగములు చేయఁగలరు. పాశ్చాత్యదేశములందు స్త్రీలు చేయఁజాలని పనులే లేవు. వాయువిమానములనుగూడ నడుపఁగలరు. కావున స్త్రీల నబలలనియుఁ బురుషులతోఁబాటన్నిశాఖలందును బాల్గొనిన వారి శీలమునకు భంగము వాటిల్లుననియు ననరాదు. ఎందువల్లనన "స్థిరాశైలీ గుణవతాం। ఖలబుద్ధ్యానబాధ్యతే। రత్నదీపస్యహిశిఖా। వాత్యయాఽపినవార్యతే" అనినట్లు స్థిరచిత్తముగల స్త్రీలెందఱు ఖలులనడుమ నున్నను వారి సచ్ఛీలరత్న ప్రదీపము చల్లారనేరదు. అట్టియెడ వారిశీలము సానలఁదీరిన జాతిరత్నమువలె నిబ్బడిగఁ బ్రకాశింపఁగలదు.

కాని 'నిరుద్యోగులచే నిండిన యీకాలమున స్త్రీలుగూడ నుద్యోగముల కెగఁబ్రాకిన దేశము మఱింత క్షోభము నొందదా?' యని కొందఱు ప్రశ్నింపవచ్చును. మఱియు గృహిణీధర్మము నెరవేర్చువారు లేక భవనములు వనములై దాసీజనులచే నిండి శిశుపోషణ సక్రమముగా జరుగక దేశమిప్పటికంటె హీనస్థితికిఁ బాల్పడుననియు నందురు. విద్యావిషయమున నల్పసంఖ్యాకులుగల మనదేశమున నింతలో స్త్రీలకు నిరుద్యోగపు విప్లవము రాఁజాలదు. గృహిణుల విషయముమాత్రము విమర్శనీయము. గృహిణిగానుండి యుద్యోగముచేయు స్త్రీల జీవితము మాత్రము "శ్లేష్మములోఁబడిన యీగ"వలెఁ గడుశోచనీయము. గృహస్థులైనవారు సత్సంతానమును తయారుచేసి యింటనుండియే యమూల్యమగు దేశోపకారము చేయవచ్చును.

ఇఁక వితంతులై, యనాథలై, కన్యలై కాలము గడుపవలసినవారెల్లరు నేదే నొకవృత్తి నవలంబించి జీవితమును సౌఖ్యవంతముగఁ జేసికొంట మంచిది. ఎటులున్నను గాలము గడచుటలేదా! యన, వ్యర్థకాలక్షేపమునకంటె వేతనము తీసికొనుచున్నను, న్యాయబుద్ధితోఁ జేయు నుద్యోగమే యిహపరసాధనము. "ఆడుదాని కుద్యోగమేమి"టని యీసడించుకొను నీర్ష్యాళువులను లెక్కింపక నడచుకొను నుత్తమ స్త్రీరత్నములు భారతదేశమునకంతకు వన్నెఁదెచ్చుటయే గాక యితరదేశములవారికిఁగూడ మార్గదర్శకులయ్యెదరు. అట్టి నారీమణులు బయలుదేరిననాఁడే యైహికముగ, నాముష్మికముగ, రాజకీయముగ, నార్థికముగ, సాంఘిక

ముగ స్త్రీజాతి యభివృద్ధిఁ గాంచఁగలుగును. ఈ చెప్పిన విషయములన్నియు నించుమించుగా కొన్ని యాచరణమందున్నను, విరివిగాఁ బ్రచారములోనికి వచ్చినఁగాని యన్నివిషయములలో దేశము ముందునకు రాఁజాలదు. కాన విద్యాధికులెల్లరు నిందునుగుఱించి తగు ప్రయత్నము లొనరింతురుగాక!—

ఉపన్యాసానంతరం చెన్నపురి ఆంధ్రమహాసభ బాలికలు "రాసలీల" నృత్యమును ప్రదర్శించారు. కృష్ణుడు, గోపికలూను—యమునా తరంగిణి సైకతస్థలాల్లో చిన్ని కృష్ణునికోసం గోపికలు వెతుక్కుంటూ రావడం—కృష్ణుడు వారికోసం వెతుక్కుంటూ రావడం—చివరకు ఒకరినొకరు తెలుసుకుని ఆనందపరవశులై ఒకరి ప్రేమాలింగనాల్లో ఒకరు ఐక్యమవడం—చక్కని పాటతో అత్యంత రమణీయంగా బాలికలు వివిధ వర్ణములుగలిగిన దుస్తులతో యీనృత్యం చేస్తూవున్నంతసేపూ ప్రేక్షకవర్గంలో ఆనందోద్రేకాలు ఉప్పొంగిపోయాయి.

"రంగపూజ" "రాసలీల"—రెండు నృత్యాలు యీ బాలికలకు సుప్రసిద్ధ నాట్యాచార్యులైన శ్రీ శ్రీనివాస కుల్‌కర్ణిగారిచే గరుపబడ్డాయి. భావాన్ని ద్విగుణీకృతంచేసే అభినయం—అభినయానికి అనుగుణ్యమైన నృత్యం—నృత్యానికి ఉచితమైన కీర్తన—వాటి నన్నిటిని సరిగా మేళవింపుజేసి ఒకేఒక ధారలో ప్రేక్షకులను అవ్యక్తమైన నూతన వాతావరణంలో విహరింపజేయగల నూతనపక్కిలో దాన్ని నేర్పిన శ్రీ శ్రీనివాస కుల్‌కర్ణిగారు ఎంతయు అభినందనీయులు.

తర్వాత గృహలక్ష్మి సహాయ సంపాదకులగు శ్రీ ఏడిద కామేశ్వరరావుగారు యీక్రింది సందేశాలను సభవారికి చదివి వినిపించుచు ఇలా ప్రసంగించారు—

సోదర సోదరీమణులారా!

జయంతి మహోత్సవాహ్వానములను అందుకొని కారణాంతరాలచే రాలేక జయంతిని జయప్రదంగా జరగాలనికోరుతూ పలువురు మాకు సందేశాలను పంపించారు. వారి ఆదరాభిమానమునకు మా కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

కాకినాడ వాస్తవ్యులును, 'దానకర్ణ' బిరుదాంకితులును, రాజమండ్రి ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల స్థాపకులును అను శ్రీ నాళం రామలింగయ్యగారు యీ రోజున యీ విధంగా తంతినిచ్చారు—

**COCANADA, 1—16, DR. KESARI, ROYAPETTAH, MADRAS.**

**"CONVEY CONGRATULATIONS TO KAMAKSHAMMA. HIGHLY APPRECIATE YOUR SERVICES TO ANDHRA WOMANHOOD."**

— *Ramalingiah.*

మైసూరు మాతృమండలి నిర్వాహకురాలును, సుప్రశిద్ధ దేశసేవకురాలును అగు శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మ గారు యీ దిగువ సందేశాన్ని పంపించారు.—

మహాశయా,

గృహలక్ష్మి స్వర్ణకంకణము ఈ సంవత్సరము శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికి సమర్పింపబడునని చదివి చాల ఆనందించుచున్నాను. ఆమె చాలా కష్టములకోర్చి నిందలను భరించి రాజమహేంద్రవరమున సేవాసదనమును స్థాపించి, దానిని సంస్కృత కళాశాలగా లేవదీసిన ధీరవనిత. ఆమె ఉత్సాహము, కార్యదీక్ష ఈ సంస్థయొక్క వృద్ధికి కారణములు. ఈ ఉత్సవములో పాల్గొనవలెనని నాకు చాలా అభిలాష ఉన్నప్పటికీ కారణాంతరములచే రాలేక ఈ ఉత్సవము జయప్రదముగా నెరవేరునట్లు కోరుచున్నాను. ఈ సందర్భములో స్వర్ణకంకణమును పొందుచున్న కామాక్షమ్మగారికి, కంకణ బహుమానమును నిచ్చి స్త్రీలను గౌరవించుచున్నందులకు శ్రీ డాక్టరు కె. ఎన్. కేసరిగారికిని నా హృత్పూర్వక వందనములు.

—ఇట్లు, కామేశ్వరమ్మ

విశాఖపట్టణ వాస్తవ్యలును, సుప్రసిద్ధ రచయిత్రీమణులును అయిన శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ గారు యిలా ఆశీర్వదించారు.

నెలకొననేఁడు కేసరి మనీషి హృదంతరసీమ నాంధ్రభూ
తలపతి కృష్ణరాయతయు, తంజపురాధిపమౌళి, సాహితీ
విలసిత చక్రవర్తి, సుకవిత్వరహస్య కళావిశారదుం
డల రఘునాథరాయత; మహోళియరామ విభుత్వతాదులన్.

ఇది పురంధ్రీ జనమ్ముల హృత్కవాట
ముల్ దెరచినపాడి హారతుల్ బూను వేళ
ఇది తెలుగుతల్లి గర్వించిముదముమీఱ
త్రొమ్మువిరువంగ సభము మ్రొక్కెగు వేళ.

గరిబె నమృతమ్ము చిలికించు కాంతలార!
కలముఁగొని కైతలల్లంగఁ గడగినారు.
కనక కంకణా రవఘుళం ఘుళలు చెలఁగ
నెందఱెందఱో గృహలక్ష్మి బంధులగుచు.

భువనవిజయాఖ్య రసమయ భవనసీమ
విందు గుడిచిన నూపురానందమృదుల
మధుర నినదమ్ము నేటికి మారుమ్రోగె
నాంధ్రగృహలక్ష్మి మందిరాభ్యంతరాళి.

నీరసము శాకపాకమ్ము సారసమ్ము
చేసి లసదలంకార విశేషవితతి
వెలసె సుకవికుమారికా కులము నేడు
మూడుభువనాలు కాలాలు మోకరింప.

—స్థానాపతి రుక్మిణమ్మ.

రాజమండ్రి వాస్తవ్యురాలును, 1937 గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీతలును అగు కవితిలక శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు ఇట్లు వ్రాశారు.

ఆర్యవర్యా!

చిన్నతనముననే వైధవ్యమందినను దిగులుచెందక ఉభయభాషాప్రవీణయై ఆంధ్రదేశమునకు తలమానికమునుబోలు యుత్కృష్ట సేవాసదనమును స్థాపింపజేసి యనేక మంది వితంతువులజీవనోపాధికి మార్గదర్శియై యఖిలాంధ్ర మహాజనుల మన్ననకు బాత్రమైన మా బత్తుల కామక్షమ్మగారిని యీవత్సరము గృహలక్ష్మి కంకణభూషితురాలిగా నొనర్ప తమరు యూహించుచున్నారని గృహలక్ష్మి పత్రికాముఖమున జదివి నిర్భరానందముతో నాహృదయము నిబిడీకృతమైనది. ఆశుభ సంతోష సమయమున ది 1—3—1941 తేది నాడు నేనుకూడ పాల్గొని యానందించుటకు చంటిబిడ్డతల్లినగు కతమున వీలులేమికి మిక్కిలి చింతిలుచు నా హృదయపూర్వకవందనముల నామెకు తెలుపవలసినదిగా మిమ్ముల కోరుచున్నాను. పరమేశ్వరుడా యమ్మకు ఆయుష్యము, నారోగ్యము నొసంగి కాపాడుగాక. లోకబాంధవియై యా స్త్రీ రత్నము చిరకాలము మనుడుగాక.

—పులవర్తి కమలావతీదేవి.

బాపట్ల వాస్తవ్యులైన శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారు ఇట్లా సందేశమంపారు.—

శ్రీ రమ్యాకృతిచే, మనోహరకథా స్వీకారభావంబుచే
నారీమండల ధన్యవాదములచే, నవ్యంపు వ్యాసాళిచే
ధారాదత్త సువర్ణకంకణ ఋణత్కారాది సౌభాగ్యముల్
మీరక్ పెంపగుచుండుగాత గృహలక్ష్మి నిత్యకళ్యాణముల్.

పూతప్రతివ్రతా తిలకము ల్గమనించెదు తెన్నుజూపి, వి
ఖ్యాతములైన హైందవ మహత్తర నాగరక ప్రసిద్ధమా
నీతికథా ప్రసంగముల నేర్పి, సుధామృత లాంధ్ర కౌషధీ
వ్రాత మొసంగి, స్త్రీల సురపాదపమై గృహలక్ష్మి భాసిలున్.
మూలలడాగి నైజ కళపోయిన చానల మేటి శేముషీ
జ్వాల రవుల్కొనందగిన పద్ధతితో గృహలక్ష్మి వీవనల్
చాలగవీచి మానినుల సంతసము న్బొదలించి వారికిన్
మేలొనడ గూర్పగాగలిగె మిక్కిలి యక్కజమైన రీతులన్.
ముదితల మానసంబుల ప్రమోదముగొల్పి, జయప్రదంబుగా
బొదలెదు నీ మహోత్సవ మపూర్వ మనోహర వైభవంబుగా
నదనున స్వర్ణకంకణ మహాబహుమాన పురస్సరంబుగా
చదువులవేల్పుచాన మనసా గని హర్షము నొందునట్టుగాన్.
వాసియు వన్నెగూర్చి నడుపన్ గృహలక్ష్మి చెలంగుఁ దాసము
ల్లాసముతోడ నే బుధకళా విదుపోషణ నట్టి మాననీ
యాసమ కీర్తి వైభవవిహారి వదాన్యగుణోత్తరుండు శ్రీ
కేసరి నోముగా తనర కేసరిదివ్యకటాక్ష వీక్షణన్.

—దేశిరాజు భారతీదేవి

**రాజమండ్రి వాస్తవ్యులైన శ్రీమతి అచంట సత్యవతమ్మగారు ఈవిధంగా వ్రాశారు.**

శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు మాకు చిరపరిచితురాలు. ఆమె గృహిణీత్వకాలము నేనెరుగకున్నను దేశభాషాసేవలలో మాత్ర మందినచేయి యని యెరుగుదును. పలుచోట్ల నంద్యాల, రాజమండ్రి మొదలగు మహిళాసమాజోత్సవ సందర్భములలో నధ్యక్షపీఠ మలంకరించిన ధన్యురాలు. సెనేటు సభ్యత్వ మందిన అగ్రగణ్య. నిరంతర పరమేశ్వర సేవార్చనాది భక్తజీవి. స్త్రీల సంస్కృత కళాశాల ప్రిన్సిపాలుగా నియమింపబడిన విజ్ఞాన విదుషీరత్నము.

ఇట్టి ఆంధ్ర నారీతిలకమును తగురీతిని సత్కరించుచున్న మా జనకుడు "గృహలక్ష్మి" కంకణ బహూకరణ సమయంబుకు రమ్మని పంపిన శుభలేఖ నందికొనియు, అట్టి శుభసమయ మీక్షింప నవకాశము లేని నాబోటి లంపట గృహిణీత్వ జీవితమునకు వగచుచుంటిని; కాని ఆంధ్రభూమియంతయు మనదే కాని, అందులో మా రాజమహేంద్రపుర వాసినియగు శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు, స్వర్ణకంకణ బహుమాన మందుకొనుటచే కొంచెము గర్వించుచుంటిని. అది మాతృస్థాన మహిమ. అందులో, యెరుకగల సోదరీతిలక మగుట మా పురస్త్రీల తరఫున, నీరజనేత్రంబులతో వీక్షించు పుణ్యము లభింపకపోయనను, నీరీతిగా నామెకు మా ధన్యవాదముల నర్పించుకొనియైన తృప్తిగాంచదలచి, నీ కాగిత మర్పించుకొంటిమి. సోదరీ! ధన్యురాలవు!

ఏటేట, నిట్లుగా స్త్రీ హితైషిణిగా స్త్రీల ఆయురారోగ్య విజ్ఞానాభివృద్ధిగా పాటుపడుచుండి, వారి ననేకరీతుల ప్రోత్సాహమిచ్చి సత్కరించుచుండిన, శ్రీయుత డాక్టరు కె. యన్. కేసరి జనకుల కనేక కృతజ్ఞతా నమస్కృతు లర్పించుచుంటిమి.

—ఆచంట సత్యవతమ్మ.

కొల్లాపుర సంస్థాన పండితులును, స్నేహలతాకవితా సంఘాధ్యక్షులును, సుప్రసిద్ధ కవిపండితులును అగు శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుడు బి. ఎ. గారు ఇట్లు ఆశీర్వదించారు.—

క॥ నీకుఁ గేసరి జనకుఁడు
ప్రాకటకీర్తిఁ గొనిన సరస్వతి చెలిక
త్తె కడు ముదమిచ్చుఁగద
యే కొఱఁతయునైనఁ గల్గునే! గృహలక్ష్మీ!

ఉ॥ నీవిడు కంకణంబు ధరణీతలమం దసమానమంచు, మో
దావహమంచుఁ బల్వురకు నంచిత మార్గము జూపునంచు దీ
క్షావృత భక్తి పెంపున సమస్తము లోకమెఱుంగునట్లుగాఁ
జేవఁగలట్టి వ్యాసములచేత సరస్వతి చాటి చెప్పదే!

క॥ నీవును గోడలుశ్రీమై
శ్రీవిభవం బెసఁగనుంటఁ దిరముగనుండున్
బావనమైన యశంబిల
లావణ్యశ్రీలును గృహలక్ష్మి తనయా!

క॥ వృషవత్సర గృహలక్ష్మికి
భాషా శ్రీశోభితాంగి వరకృపచే సం
తోషము గల్గుఁ గవితా
పోషితవర్గము పొగడఁగ బూజ్యులుమెచ్చన్।

—వి. రామసుబ్బారాయుఁడు.

మద్రాసు క్రిస్టియన్ కళాశాల ఆంధ్రాధ్యాపకులును, సుప్రసిద్ధ పండితమాన్యులును అగు శ్రీ దోమా వేంకటస్వామిగుప్తగారు యీరీతిగా ప్రస్తుతించారు.—

క॥ కామాక్షమాంబ యెంతయు, వామాక్షుల కెల్లమేటి భాగ్యంబగుచున్
దామాక్షి కాభిసూక్తిని। భూమిఁదగుటఁ బైఁడివలయముం జెందనగున్॥

మ॥ గృహలక్ష్మి మణులందయూరు పఱుపన్ హృత్కంజ విస్ఫూర్తిన
న్వహమున్ యత్నముసేయు మేల్గరిత కామాక్షమ్మ పేర్గాంచి యీ।
గృహలక్ష్మి కరకంకణం బొరయుటెంతేవర్ణ నీయంబదే।
గృహలక్ష్మి కరహస్త మద్ది విడునే యేనాఁటికేనిన్ గనన్॥

—దోమా వేంకటస్వామిగుప్త.

తర్వాత గృహలక్ష్మి పాఠకులతరఫున కృతజ్ఞతను వెలిబుచ్చుతూ శ్రీ ఏడిద కామేశ్వరరావుగారు,

గృహలక్ష్మి జయంతి మహోత్సవాహ్వానాన్ని అందుకుని మీరందరు విచ్చేసి, నేటి కార్యక్రమాన్ని అత్యంత జయప్రదంగా నెరవేరునట్లు చేసినందుకు గృహలక్ష్మి పాఠకులతరఫున నా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

గృహలక్ష్మి పత్రికనుస్థాపించి, స్త్రీలోకమునకు అమూల్యమైన సేవచేస్తూవున్న డా॥ కె. యన్. కేసరిగారికిని, నేటి సభాధ్యక్షతవహించిన శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారికిని, కంకణ బహుమానమందిన శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికిని, సభలో నృత్య, గీత ప్రదర్శనాలిప్పించి కార్యక్రమమును అత్యంత మాధుర్యవంతముగను, జయప్రదముగను కావించి, మా కెంతగనో తోడ్పడిన శ్రీమతి దుర్గాబాయమ్మగారికిని, వారి స్త్రీశాఖసభ్యులకును, గృహలక్ష్మి పాఠకులతరఫున నా కృతజ్ఞతాభి వందనములను సమర్పిస్తున్నాను"

అని ప్రసంగిస్తూ సభాసదులకు కృతజ్ఞతను తెలిపారు.

తదనంతరము చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖ సభ్యురాండ్రచే జంత్రవాయిద్య ప్రదర్శనములు జరిగినవి. వీణ, ఫిడేల్, సితార్, హార్మోనియం, జలతరంగిణి మొదలైన వాద్యములతో కృతులను, కీర్తనలను అత్యంత రమణీయంగాను, హృదయానందకరంగాను వాయించారు.

తర్వాత శ్రీమతి దుర్గాబాయమ్మగారు అఖిలాంధ్రమహిళామణుల తరఫున స్త్రీలోకమునకు శ్రీ కేసరిగారు చేయుచున్న మహత్తరమైన సేవకు కృజ్ఞతను తెలిపారు.

శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు, తమకు ఇట్టి సత్కారాన్నిచ్చి గౌరవించిన డా॥ కేసరిగారికి కృతజ్ఞతాభివందనముల నర్పించారు.

మాధుర్యవంతంగాను హృదయంగమంగాను, నడచుచువచ్చిన జయంతి కార్యక్రమం చెన్నపురి ఆంధ్రమహాసభ-స్త్రీలశాఖ సభ్యుల మంగళగీతికతో అత్యంత జయప్రదముగ సమాప్తినందినది.

సభకువిచ్చేసిన పలువురు పెద్దలకు, మహిళామణులకు, గృహలక్ష్మి స్వగృహముగు కేసరికుటీరమున విందు భోజనములతో గృహలక్ష్మి జయంతి మహోత్సవము, గృహలక్ష్మి స్వర్ణకంకణ బహూకరణోత్సము సుమారు రాత్రి 9-30 గంటలకు అత్యంత మంగళ ప్రదంగా ముగిసినది.

## గృహలక్ష్మి జయంతి మహోత్సవ కార్యక్రమ విజయకారిణి



శ్రీమతి

దుర్గాబాయి

చెన్నపురి ఆంధ్రమహాసభ స్త్రీలశాఖ సభ్యులతో నృత్య, గీత, వాయిద్య ప్రదర్శనముల గావించి జయంతి మహోత్సవమును అత్యంత మాధుర్యవంత మొనర్చిరి.



శ్రీమతి

కనుపర్తి వరలక్ష్మమ్మ

1934



శ్రీమతి

చిల్కపాటి సీతాంబ

1935



కవితిలక, కవితావిశారద

శ్రీమతి కాంచనపల్లి కనకాంబ

1936



కవితిలక

శ్రీమతి పులవర్తి కమలావతీదేవి

1937



చిత్రకళావిశారద

శ్రీమతి రత్నాల కమలాబాయి

1939



సతి

శ్రీమతి బాలాంత్రపు శేషమ్మ

1939



కవికలహంసి

శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

1940



కవికోకిల

శ్రీమతి వి. రాధామణి

(తమిళ సాహిత్య సేవకు)

1940

చేయక ఆంధ్రవాఙ్మయము జదువుటతోను, తీర్థాటములతోను, దైవభక్తితోను వెళ్లించినది. రాజమండ్రి శ్రీ వీరేశలింగముగారి పుస్తక భాండాగార మీమెకు ప్రోత్సాహమిచ్చినది. అదియే నేటి గౌతమీ గ్రంథాలయమను నామమున గణన కెక్కినది. ఆసేతు శీతశైల పర్యంతము యాత్రసాగించిన యాత్రాచణశీలి. 1923 సం॥ నాటికి బదరికాశ్రమయాత్రను 750 మైళ్లు కాలినడకను బూర్తిచేసిన కాంతామణి. దేశాటనము చేయునపుడే యీయమయున్నత విద్య సంపాదింపవలెననియు, దేశసేవ చేయవలెననియు సద్భావములకు బీజారోపణము కలిగినది.

కొంత కాలమునకు 1920 సం॥న రాజమహేంద్రవరమున దానకర్ణ శ్రీ నాళము రామలింగయ్యగారు "వైశ్య సేవాసదనము"ను స్థాపించుటకు నీమె సదుద్దేశములు, జాతీయభావములే కొంతవఱకు కారణములయ్యెను. ఆ సంస్థకీమె యొకపునాదిరాయి. విశాలభావములుగల యీమె దాని పోషకులలో నొకరగుటచే దాని "వైశ్య"యను సంకుచితత్వమును బోగొట్టి విశ్వవ్యాప్తి నొందించుటకై విశ్వవిద్యాలయపు పరీక్షలకు కొందఱు బాలికలను చదివింప నారంభించినది. అదివఱ కామెయందంత దీనముగా నణగియున్న జాతీయ బీజములీ సేవాసదనపు సేవాదోహదమున మొలకలెత్తి విద్యావతులగు విద్యార్థినుల వాగమృత సేచనములచే నా వృక్షము పెరిగి పెద్దదై "ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల"యను నమృతఫలము నొసగు మహావృక్షమైనది.

ఆ చంద్రార్కముగా నా ఫలము నాంధ్రరమణీమణు లనుభవించుటకు తగు శాశ్వతమగుసేవ జేయుచున్నదీ తల్లి.

స్వార్థత్యాగి, నిరాడంబరజీవి; ఉత్సాహపూరిత; ప్రేమ స్వరూపిణి; నిగర్వచూడామణి; చక్కని సంస్కారి. బ్రహ్మముహూర్తమున లేచినదిమొదలు రాత్రి పరుండువఱకు నేదో యొక యుపయోగకరమగు పనిని చేయుచునేయుండును; మధ్యాహ్నము పదినిముసములు విశ్రాంతితప్ప. ఈమె కార్యరంగమున కాలూదినదిమొదలు, విసుకు, విరామములు లేక పనులుచేయుచు నపజయమనునది యెరుగదు. పట్టినదల్లా బంగారమే. ఈమె నిత్యకృత్యములలో పావనగౌతమీ స్నానమొకటి. ఈత యీదుటలో నంజవేసినచేయి. ఉత్సాహయుతలగు పెక్కుమంది స్త్రీలకీమె యీత గురువు. అఖండగౌతమిలో నతిస్వేచ్ఛగాపరుండి పద్మాసనము వేసి పరతత్వమును ధ్యానించుచు బయనముచేయుటచూచిన యే మహాయోగీశ్వరియో యనిపించును. నడకలో నీమెతో బాలికలు పరుగులిడవలసినదే. ఆహార విషయమున అదునుకు దొరికిన దందిపుచ్చుకొని యాకలినణచుకొనును. కొంతకాలమీమె కేవలము పండ్లనే యాహారముగాఁ జేసికొనినది. మితాహారవిహారము లీమెచేయు సేవకు మరింత చేయూతనిచ్చినవి, ఎంత పరిశ్రమచేసినను ఆ ముఖములో అలసట అనునది యుండదు. ఇతరులకు సలహాలనిచ్చుటలో నీమెకే న్యాయవాదులు సరిరారు. ఎవరి పురోభివృద్ధికితగినట్లు వారికి చెప్పుటయే గాక చేతనైన సాహాయ్యమునుకూడ చేయును. ఇది ఈమెలో నొక గొప్పశక్తి. ఆ శక్తియే విపులమై విజృంభించి స్వీయపదోన్నతికి సోపానము లమర్చినది. తనకు న్యాయమనితోచిన విషయమున గురువుతోగూడ గ్రుద్దులాడుటకు జంకదు. సంతతిలేదను చింతలేక విశ్వసంతానమునే తన సొంతముగాభావించి పెంచుచున్న మాతృస్వరూపిణి. సనాతనాధునాతన భావముల సమ్మేళనమొనర్చి సకలవ్యవహారముల నడపుచున్నగడుసరి.

1924 సం॥ గుంటూరులో జరిగిన 'ఆర్యవైశ్య మహిళాసభ'కు అధ్యక్షతవహించి కార్యక్రమమును సమర్థతతో నిర్వహించినది. అమితోత్సాహముతో సంఘసేవచేయుచునే "విద్వాన్" పరీక్షాగ్రంథముల

చదివినది. 1927 సం|| "అఖిలాంధ్రరాష్ట్ర మహిళాసభ" యొక్క కార్యనిర్వాహకవర్గమున సభ్యురాలుగా నెన్నుకొబడి నాటనుండి నేటివఱకట్లు సభ్యత్వమునువీడక సాంఘిక, రాజకీయ, వైజ్ఞానికశాఖలందు మహిళాభ్యుదయమునకై శక్తివంచనలేని ప్రచారము సలుపుచునేయున్నది. 1929 సం|| బెజవాడలో జరిగిన పట్టప్రధానోత్సవమున వైశ్యస్త్రీలలో నద్వితీయరాలుగను ఆంధ్ర విశ్వవిద్యాలయమున ప్రాచ్యబిరుదములబడసిన యువతులలో ద్వితీయురాలుగను 'ఉభయభాషాప్రవీణ' పట్టము నందినది. ఆయొక్కపట్టమే నేడు నూరు పట్టముల పుట్టించుటకు పుట్టినిల్లైనది. ఆవత్సరమే పెద్దాపురమున జరిగిన ఆర్యవైశ్యమహాసభవారీమె చేయు యథార్థమగు సంఘసేవకుదగునట్లు "సంఘసేవాధురీణ" అను సార్థక బిరుదమునిచ్చిరి. ఆ బిరుదమీమెకు నేతిబీరకాయవంటిదికాదు. జీవితమందు స్వార్థమెరుగని సేవాపరాయణురాలు. 1931 సం|| వచ్చుసరికి 'వైశ్య సేవాసదనము' "ఆంధ్రయువతీ సంస్కృతకళాశాల"గా పరిణామమునొందినది. శ్రీ కామాక్షమ్మగారి జాతక చక్రమునకు గురుడేకాదశస్థానమునకు వచ్చినాడు. నాటనుండియు నీమె కళాశాలకు గౌరవప్రిన్సిపాలుగను వసతిగృహమునకు గౌరవ కార్యాధికారిణిగనుండి స్త్రీజాతి కెంతేని యుపకార మొనర్చుచున్నది. "శాంతిలేని కషాయములే"నట్లు కామాక్షమ్మగారి పేరులేని సంస్థగాని, సమాజముగాని, సభగాని యీ యాంధ్రదేశమునందే లేదనినపుడు, రాజమండ్రీ 'గరల్సు హైస్కూలు' సలహాసంఘమున సభ్యురాలుగను, గౌతమీ గ్రంధాలయ కార్యనిర్వాహకవర్గమున సభ్యురాలుగను, అఖిలభారత స్త్రీల ఆటల సంఘమున కుపాధ్యక్షురాలుగను, పురపాలక సంఘమున సభ్యురాలుగను, రాజమండ్రీ గౌరవన్యాయాధికారిణిగను, లేడీస్ క్లబ్బునకు అధ్యక్షురాలుగను, వేయేల నన్నిసంఘములలో నీమెయొక భాగస్వామిగనే యుండును. ఆంధ్ర విశ్వవిద్యాలయమున సెనేటుసభను, ఎకడమిక్ కౌన్సిలు, బోర్డు ఆఫ్ స్టడీసు లందును మెంబరుగానుండిరి. స్త్రీవిద్యకత్యంతోప యుక్తమగు ఎంట్రన్సుపరీక్షను తిరిగి ప్రారంభింపవలెనను తీర్మానమును యూనివర్సిటీవారిచే నామోదింపజేసి యాచరణలో పెట్టుటకై మిగుల ప్రయత్నించి సఫలురాలైనది. 1936 సం|| భద్రాచలమున జరిగిన ఆంధ్రరాష్ట్రమహిళాసభ కధ్యక్షురాలుగను, 1940 సం||న నంద్యాలలోనైన ఆంధ్రరాష్ట్రమహాసభ వస్తుప్రదర్శన సభ కధ్యక్షురాలుగ నుండి సభల నత్యంతనేర్పుగా నిర్వహించిరి. ఏటేట జరుగు 'అఖిలభారత మహిళాసభ' కాంధ్రదేశ ప్రతినిధి యెవరనిన అగ్రతాంబూలమీమెదే. ఎట్టి పరిస్థితులనైన నీమె సహజస్వభావమగు యుక్తిచే దాటి పలువురలో మెప్పువడయగల భాగ్యశాలి.

అన్నిటికంటె కళాశాలవిషయమున నీమె చేయుచున్న పని యద్వితీయము. కళాశాలయే యీమెకొఱకు పుట్టెనో యీమెయే కళాశాలకొఱకు పుట్టినదో యనినట్లుండును. దానికీమె ఒక్క ప్రిన్సిపాలే గాదు, సర్వమూ తానే. అట్టి యవినాభావసంబంధముండుటచేతనే స్థాపకులగు శ్రీ రామలింగయ్యగారికంటె నధికకీర్తిని బడయుచున్నదని చెప్పనగును. 1935 సం|| ఆర్థికచిక్కులవలన శ్రీ రామలింగయ్యగారు కళాశాలను కట్టివేయుటకు బూనుకొనగా నీమె యితోధికమగు పూనికతో, యుక్తితో, శక్తితో నా యార్థికసమస్యను దీర్చి కార్యప్రణాళికను మరల సాగించినది. కళాశాల పాలకవర్గమువారు కళాశాల విషయములందు సంపాదించెడు తీర్మానముల నామోదించుటకుగాని త్రోసివేయుటకుగాని యీమె సర్వసమర్థురాలై యాచరణయోగ్యములగు పద్ధతులనే యవలంభించును. ఇప్పుడీ కళాశాలకు సాలునకు రు 1,650 లు ప్రభుత్వమువారి గ్రాంటు వచ్చుటకుగూడ కారణ మీమె నిరంతరసేవయే. కాలనిర్ణయపట్టికను తయారుచేయుటలో నీమెకు గల చాకచక్యము మెచ్చదగినది. ఎన్ని Subjects ఉన్నను విద్యార్థినులకు, నుపాధ్యాయులకు శ్రమలేకుండ

వానిని నిర్ణీతకాలమునం దిమిడ్చి కార్యక్రమమును నడుపగలదు. ఈమె యుద్బోధమువల్లనైననేమి, యాజమాన్యమునన్నైననేమి యిప్పటికి 'విద్వాన్' పరీక్షలం దుత్తీర్ణులైన స్త్రీలు సుమారిరువదిమందికి తక్కువ యుండరు.

ఎంత మారుమూలనున్నవారికైనను ప్రోత్సాహము, నుత్సాహము కల్పించి విద్యాప్రబోధము చేయుటలో నీమె కే మతగురువులు నీడురారు. ఈమె హితబోధలకు తలయొగ్గనివారరుదు. వసతిగృహ నివాసినులగు బాలికల కుత్సాహము గల్గించుటయన నీమెకు గడుప్రీతి. బెంగుళూరు మున్నగు దూరదేశాగతలైన బాలికలకుగూడ తలిదండ్రులను మరపింపజేయగల ప్రేమమూర్తి. ఏలాటి విరోధులైనను మరల దనకడకు వచ్చినచో సరళహృదయమున వారిని జేరదీయును. నూత్నపద్ధతులను కనుగొనుటకును వాని నాచరణమం దుంచుటకును నీమెకుగల యుత్సాహమే యువతులకు నుండదు. నూత్నసంస్కారములన్న నూరేండ్లు ముందుకు బోవును. అట్లని ప్రాతపద్ధతులను బాడుచేయదు. వానికి కొంగ్రొత్త మెరుగులుపెట్టి పైకితెచ్చుటలో ప్రోఢ.

కళాశాల విద్యార్థినుల నితర సంఘములందు జరుగు ఆటలు, ఉపన్యాసములు, వ్యాసరచనలు మున్నగు పోటీలకు బంపి వారల జయమును కనులారగాంచి మనసార నానందించును. విద్యార్థినులను కేవల ప్రాచ్యవిద్యలందే గాక చిత్రలేఖనము, కుట్టు, సంగీతము, హిందీ, ఇంగ్లీషు మొదలగు గవర్నమెంటువారి పరీక్షలకు బంపి కొండఱు స్త్రీల నుద్ధరించుచున్న దీ దేశోపకారిణి. ఆమె సామీప్యమునొందిన యేవ్యక్తిగాని విఫలతనొంది వెనుదిరుగలేదు. ఈమెకడ విద్య పూర్తిచేసికొని వెళ్లినవారందరు వారివారి కిష్టములగు వృత్తుల నవలంబించి స్వయంపోషకమగు జీవితములను గడపుట చూడ నీమె జీవితమెంత ధన్యమని తోచక మానదు. ఈమెకు దైవ నియుక్తి బాగుగా గలదు. దేహబలము, బుద్ధిబలము, దైవబలము కలిసి ప్రభు మంత్రోత్సాహ శక్తులవలె నీమెచేయు ప్రతికార్యమునకును సంపూర్ణవిజయము నిచ్చుచున్నవి. మానవ జీవితరహస్యమును గుర్తించి జీవితమును సార్థకపరచుకొనిన యీమె స్త్రీలోకమునకంతయు దలమానికము. ఈ వ్యక్తికి గల గొప్పదనమును గుర్తించి శ్రీ గృహలక్ష్మి స్వర్ణకంకణమును సత్పాత్రదానమొనరించుచున్న పూజ్యులైన శ్రీ కె. యన్. కేసరిగారెంతయు వందనీయులు.

—వేదవల్లి తాయారమ్మ.

★ మహాత్ముని ఆంధ్రదేశ హరిజనయాత్ర

ప్రతులకు: కార్యదర్శి, ఆంధ్రరాష్ట్ర హరిజనసేవక సంఘము, మైలాపూరు, మద్రాసు. వెల 8 అణాలు.

దరిద్రనారాయణుడు మహాత్ముడు దీనజనోద్ధరణనిధికై ఆంధ్రదేశంలో పర్యటన మొనర్చిన యాత్రా విశేషాలు సుమారు 25 చిత్రాలతో, ఒక కథలా ఆకర్షించేటట్టు యీ పుస్తకంలో విశదీకరింపబడింది. ప్రతివారు తప్పక చదువదగినది—

# ★ రాజమకుటం

రచయిత :
శ్రీ గోవింద వల్లభ పంతు

అనువాదకర్త :
శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి

## ముందు కథ

చిత్తోడు రాజమకుటంతో తన కుమారుడు వనవీరుని శిరాన్ని అలంకరింపచెయ్యాలని శీతలసేని, కుటిలసర్దారు రణజిత్తుతో కలసి మాయ ఉపన్ని, వనవీరుని ప్రోత్సహించి రాణాను హత్య చేయించింది. రాణా సోదరుడైన ఉదయుణ్ణి రక్షించడానికి పన్నా తన కుమారుడైన చందన్‌ను బలియిచ్చింది. ఉదయుడను కొని చందన్‌ను వనవీరుడు చంపివేశాడు. ఉదయుణ్ణితీసుకొని దేవలరాజు ఆశ్రయాన్ని సంపాదించుకొనేందుకు పన్నా వెళ్లిపోయింది.

## పాత్రలు

1. పన్నా ... ఉదయుని దాది
2. ఉదయసింహుడు ... విక్రముని తమ్ముడు
3. కర్మచందు ... ప్రధానమంత్రి
4. శీతలసేని ... వనవీరుని తల్లి
5. వనవీరుడు ... శీతలసేని పుత్రుడు
6. రణజిత్తు ... ఒక లోభి సర్దారు
7. ఈశకర్ణుడు ... డూంగరపురపురాజు
8. సేనాపతి ... ......సేనాపతి

ఇక చదవండి



## ద్వితీయాంకము

### ౧. దృశ్యము

[వనవీరుని మందిరం. విజయగర్విత శీతలసేని పాడుతూ ప్రవేశిస్తుంది.]

కమాచ్ - త్రితాళం

శీతలసేని :- మధురనాట్యము సలుపుమా!
క్రోధ-మహానల-చపల-కీలికా!
రక్తవర్ణినీ! వివిధభంగిమల
మధురనాట్యము సలుపుమా!

౧

ఉగ్రమూర్తివై మెరయుము రణమున,
బ్రహ్మాండంబుల, అణువణువున;
ప్రళయరుద్రునవు నుల్లాసముగా,
నా పరాభవము తాండవింపగా!

సంగ్రామసింహుని వంశం నిర్మూలంచేశాడు. ఎవరు? వనవీర్. వనవీరుడి కెవరు ఉపకరణం? నేను. నన్నెవ రీ విలయతాండవం చేయించింది? నా మనోరాజ్యవిహారి ఆకాంక్ష. ఆకాంక్షా? నీకు తృప్తికాలేదా? ఇంకా ఏమి కావాలి? మేవాడ్ రాజ్యమకుటం ఇచ్చాను; ఢిల్లీ సింహాసనంకూడా ఇస్తాను. (ఒకపక్కనుంచి నిష్క్రమిస్తుంది. మరొక పక్కనుంచి రణజిత్తు ప్రవేశిస్తాడు.)

రణజిత్తు :- పట్టాభిషేకోత్సవదినం చేరువౌతోన్న కొద్దీ శీతలసేని నాపట్ల విముఖత్వం చూపుతోంది. నాచేత పని అంతా చేయించుకుని, తీరా ప్రధానమంత్రి పదవి యివ్వకపోతే? అయినా భయమెందుకు? ఆమె స్వదస్తూరితో రాసియిచ్చిన పత్రం నాదగ్గర లేదూ! ఆమె రహస్యమంతా నా పిడికిలిలో ఉందికాదూ! (వస్తోన్న వనవీరుని చూచి) వనవీర్ మహారాణాకు జయము!

వనవీర్ :- వనవీర్ మహారాణాకు జయము! మొన్న మొన్నటివరకూ ఆ నీ పెదవులు విక్రమునికి జయశబ్దం పలికినై. ఇవాళ మేవాడ్ రాజ్యమంతా ఐక్యకంఠంలో పలుకుతోంది. 'వనవీర్ మహారాణాకు జై' యని. అందరి శీర్షములూ వినతములై నన్ను గౌరవిస్తున్నై. రణజిత్! నేనేకదూ మేవాడ్ మహారాణాను!

రణజిత్తు :- చిత్తం తమదోవలో ముండ్లన్నీ ఏరి పారవేయబడ్డట్టే. ఇక శత్రుభయమేమీలేదు. మేవాడ్ మహారాణా తమరే.

వనవీర్ :- ప్రజ లేమనుకుంటున్నా రేమిటి ఇందును గురించి?

రణజిత్తు :- ఈ సంవత్సరపు పంటమీద పన్ను తప్పినందుకు ప్రజల్లో ఆనందం వెల్లివిరిసింది. అందరూ తమకు జయపెడుతున్నారు. ఆ జయనాదాల్లో విక్రమ, ఉదయుల హత్యను గూర్చి విచారపడేవాళ్ళ ఆక్రందనం ఎక్కడ లీనమైపోయిందో తెలియటమేలేదు.

వనవీర్ :- రణజిత్! విక్రముని ఎవరుచంపారని ప్రజలనుకుంటున్నారు?

రణజిత్తు :- విక్రముని హత్య చాల గుప్తంగా దాగిపోయింది. అయినా, అసలు ప్రజలకు విక్రముడంటే మంచి యభిప్రాయం ఉంటేకదా ఆయన్ను ఎవరుచంపారనే ప్రశ్నవచ్చేది? వాళ్ళు తమర్ని రాజుగా పొంది సంతుష్టులై ఉన్నారు.

వనవీర్ :- కాని, రణజిత్! అబోధబాలకుడు ఉదయుని హత్యమాత్రం దాగజాలదు కదా! పన్నాకు అంతా తెలుసు.

రణజిత్తు :- దాన్నికూడా గుప్తంగా అణచిపెట్టగలం.

వనవీర్ :- నాటిరాత్రినుంచీ ఆమె కనిపించటంలేదు. తనపుత్రవాణ్ణి తీసుకుని ఎక్కడికివెళ్ళిందో తెలియదు.

రణజిత్తు :- అదీ చక్కబడుతుంది లెండి మహారాణా! మీరు నిశ్చింతగా ఉండండి. ప్రజలంతా మీకు అనుకూలులే.

(రోషంగా కర్మచందు ప్రవేశిస్తాడు)

కర్మచందు :- ఇతడు చెప్పే ప్రతియక్షరమూ అబద్ధం. రాజకర్మచారుల భయంవల్ల ప్రజలు వీధుల్లో, సందుల్లో కొత్త మహారాణాకు జయం పలుకుతూనేఉన్నారు, నిజమే. కాని ప్రతిరాత్రీ, ప్రతియింటా, ఈ రాక్షస హత్యా విషయిక చర్చ సాగుతోనే వుంది.

వనవీర్ :- రాక్షస - హత్య అంటే తమఅర్థం విక్రమ, ఉదయుల వధ అనుకుంటాను. అయితే ఆ హత్య ఎవరుచేశారని ప్రజలు చెప్పబోవటం?

కర్మచందు :-హత్యచేసినప్పుడు చూచినవాడెవడూ లేడు. కాబట్టి అనుమానపడుతున్నారు. కాని, అనుమానము సత్యానికి జన్మస్థానము కాదూ?

వనవీర్ :-తమ యుద్దేశ మేమిటి?

కర్మచందు :-ఆ ప్రశ్న అడగద్దు. వనవీర్! అడగద్దు. నీవు మరి ఉదయుని సంరక్షుడివి.

రణజిత్తు :-చిత్తోడు మహారాణా ముందు కాస్త ఆలోచించుకుని మరీ మాట్లాడండి సుమా!

కర్మచందు :-నోరుముయ్యి. ఇచ్చకాలపోతు! నీది వట్టి విషపూరితమైన వాక్కు. నీ కత్తినీడలో ఈ రక్తపూరాన్ని దాచలేవు.

వనవీర్ :-ఏమిరక్తం? ఎవరి హత్య?

కర్మచందు :-బధింపబడిన—నిద్రపోతోన్న—ఇద్దరు సోదరుల హత్య. అది నీ మేదస్సులో ముద్రాంకితమై ఉంది. నీళ్ళు, నిప్పులతో అది సమసిపోదు. బంగారు, రత్నాల రాసులతో దాన్ని కప్పిపెట్టలేవు.

వనవీర్ :-మీరు పొరపడుతున్నారు. పోనీ, ఒకవేళ నేనే విక్రముని వధించాననుకోండి; అందుకు మీరు కాదూ సూచనయిచ్చింది? ఆ హత్య నా తలవెంట్రుకల నలుపులో దాగిపోగలదు; కాని జాగ్రత! తమ తెల్లగడ్డానికి మాత్రం రంగువేస్తుంది.

కర్మచందు :-రాజ్య మదాంధుడివి! అదా నీ ఆలోచన? నేనా నిన్నీ హత్యకు పురికొలిపాను?

వనవీర్ :-విక్రముని బంధించి నన్ను సింహాసనంమీద నిలపగోరిన వారందరిలో మీరూ, మీ పుత్రుడూ అగ్రసరులం కాదూ?

కర్మచందు :-కాని నీ చేతుల్లో రక్షణభారం వొప్పజెప్పాం. హత్యాచరణకోసం కటారు ఇవ్వలేదు.

వనవీర్ :-దాన్ని నేను—నాబుద్ధికి తోచి—చేతపట్టాను. మీరు సింహాన్ని రెచ్చగొట్టి బంధించమన్నారు. నేనేమో దాన్ని వధించాను. ఇందులో నీతివిరుద్ధం ఏముంది? ఆ గాయపడ్డసింహం ఏనాటికైనా బోను పగులగొట్టుకుని మొదట నామీదనే దుముకుతుంది; కొంతమంది దానికి సహాయమూ చేస్తారు. అప్పుడైనా నేను దానికోరలనుంచి రక్షించుకోటానికి ఆయుధధారణ చేయవలసిందే కదా! కనుక నేనాల్గు రక్తబిందువుల్ని మాత్రం రాల్చి, మేవాడ్‌లో రుధిరనదీ ప్రవాహాన్ని అరికట్టేశాను.

కర్మచందు :-నీవు రుధిరనదీ ప్రవాహాన్ని అరికట్టేశావు, నిజమే. కాని వనవీర్! ఏనాడు ఆ ఆనకట్ట తెగిపోతుందో ఆనాడు ఆ ప్రవాహవేగానికి నీవు, నీ కటారు, నీ సింహాసనం—ఏదీ కూడాస్థిరంగా ఉండజాలదు. ఛండాలుడివి, నీ విషపూరిత నిశ్వాసంతో బప్పారావలు వంశ దీపాన్ని ఆర్పేశావు. ఆ శ్వాస నీ కొనయూపిరే కాకపోయింది కదా!

రణజిత్తు :-ఈయన చేస్తున్న ప్రసంగం అసహ్యంగా ఉంది మహారాణా! ఆజ్ఞాపించండి. ఎల్లప్పుడూ తమను గౌరవిస్తూ వంగియుండే యీ తల, మిమ్మల్ని రక్షించే నిమిత్తం మొండెమునుండి వేరుకావడానికీ సిద్ధముగానే ఉంది. (కత్తిపిడిమీద చేయివేస్తాడు)

వనవీర్ :- ఉద్రేకపడకు రణజిత్ ! అంతయవసరమేమీ లేదిప్పుడు. (కర్మచందు వైపుతిరిగి) ఔనౌను. ఉదయుని హత్యతో విక్రమునిహత్యను పూరించాను. రాజసింహాసనము కోసమై విక్రముని వధించాను. రాజసింహాసనం మీ బలవంతంమీద స్వీకరించాను. ఇవాళ నీవేమో నన్ను దోషిగా పరిగణిస్తున్నావు. నేను మొదటే చెప్పలేదూ; నాకు రాజ్యమక్కర్లేదని ! ఇక వెళ్ళు. నీకు చేతనైనదేమిటో చేసుకో, పో. అధికంగా నాకు బాధకలిగించావంటే మాత్రం—శిశుహత్యకు వెనుకాడని నాహస్తం ఒక ముసలాడి కోసం జాలిపడదని తెలుసుకో.

కర్మచందు:-పాపీ ! హంతకుడా ! నీ గర్వ మణగిపోవుగాక! నీవు నన్నూ వధించగలవా? నేను నా దుర్బల స్వరంతో మేవాడ్ రాజ్యమంతా ప్రతి ధ్వనించేలాగు చేస్తాను. 'ఒక ఘాతుకుడు, రాక్షసుడు సింహాసన మధిష్టించాడు. అతడు విక్రముని వధించాడు; అతడే ఉదయునీ చంపేశాడు' అని [వేగముగా నిష్క్రమిస్తాడు.]

(రెండవవేపునుంచి శీతలసేని ప్రవేశిస్తుంది)

శీతలసేని:-ఎందుకు పగిలింది ఈ అగ్నిపర్వతం? ఆ నోటికి బంగారపు కళ్లెం తగిలించి, ఒక మాన్యపదవీ వాగురలో అతన్ని బంధించాలి.

వనవీర్:-నేనూ అదే ఆలోచిస్తున్నాను. బహుశః కర్మచందు తనకిక రాజసభలో ఆదరం జరగదని సంశయ పడుతున్నాడేమో! నే నాయన్ను క్షమాపణ వేడుకుంటాను. మన ప్రధానమంత్రి పదవికి ఆయనకంటే యోగ్యుడు సమస్తమేవాడ్ రాజ్యంలో ఎక్కడా దొరకడు.

రణజిత్తు:-రాజమాతా! రాజమాతా! ఇది నిజమేనా?

(శీతలసేని ఒక కనుసన్నతో రణజిత్తును మాట్లాడకుండా చేస్తుంది)

శీతలసేని:-ఇప్పుడు కర్మచందును క్షమాపణ వేడుకోవలసినంత ఆవశ్యకత యేమీలేదు.

రణజిత్తు:-ఔను, నిజం. అందు మూలాన ముసలాడు మరీ నెత్తిమీ దెక్కి కూచుంటాడు. మహారాణా! మీ కెందు కంత భయం? మేవాడ్ ప్రభువులు మీరు; బొక్కసంమీది; అందులో బంగారమంతా తమది.

వనవీర్:-ఔను, నిస్సందేహంగా నీ సహాయం ఉండగా నా కెవరివల్లా భయం లేదు.

(ఆవేశంతో నిష్క్రమిస్తాడు)

శీతల:-ఈ కర్మచందు ఒక్కడే నాకు అంతిమ శత్రువు.

రణజిత్తు:-నాకు మాత్రం జడ్డిగంలోనే మిడతపోటులాగు తగులుతున్నాడు.

శీతల:-ఆయన మూలాన్నే వనవీరుని పట్టాభిషేకోత్సవం ఇంతవరకూ ఆగిఉంది.

రణజిత్తు:-ఆయన మూలాన్నే నాకోసమైన ప్రధాన మంత్రిపదవి ఇంతవరకూ శూన్యంగా ఉంది.

శీతల:-ఒక్కపని చేయగలవా రణజిత్ !

రణజిత్తు:-ఔనౌను; అర్థమయింది.

శీతల:- మరి తక్షణం వెళ్లు. ఇంకా ముసలివాడు ఇల్లు చేరుకుని ఉండడు.

రణజిత్తు:- దారిలోనే అతన్ని సమాప్తం చేస్తాను. (కటారు వెలికి తీస్తాడు)

శీతల:- మెరుపులాగ వెళ్లిపో.

(చెరొక వేపునుంచి నిష్క్రమిస్తారు — పట పరివర్తన)

## 3. దృశ్యము

ఆరావళీపర్వత ప్రాంత్యము. డూంగరపురపురాజు ఈశ కర్ణుడు తన సేనాపతితోసహా వేటాడి తిరిగి వస్తూంటాడు.

ఈశకర్ణుడు:- మృగయాక్రీడలో నీవు నాకంటె ఎక్కువగా అలసిపోయావు సేనాపతీ! అదిగో ఆ చెట్టునీడలో కాస్సేపు విశ్రమిద్దాం, ఈ ఆరావళీపర్వత ప్రాంత్య ప్రకృతిశోభను విలోకిస్తూ.

(ఇద్దరూ ఒక చెట్టునీడను కూచుంటారు)

సేనాపతి:- చిత్తోడునుంచి మహారాణా వనవీరుని పట్టాభిషేకోత్సవానికి ఆహ్వానం వచ్చినట్టుందే తమకు!

ఈశకర్ణుడు:- ఔను. అవశ్యం మనం వెళ్లవలె. కాని మేవాడ్‌లో క్రొత్త సంఘటన మొకటి విన్నావా? వృద్ధ సర్దారు కర్మచందును కూడ హత్య చేశారుట. నెత్తురులో తోగుతూ ఆయనశవం రోడ్డుపక్కన పడి ఉందిట. హంతకుని పత్తా ఇంతవరకు తెలియలేదుట.

సేనాపతి:- పాపం! ఆయన బ్రతికివున్నన్నినాళ్ళూ అందరికీ యిష్టుడుగానే సంచరించాడు. రాజులు, భిక్షుకులూ అందరూ ఆయన్ను సమానంగా గౌరవించారు. అంతటి న్యాయనిష్ఠుడైన ఆ వీరసర్దారుని మరణం రాజపుత్రస్థానమంతకూ దుఃఖహేతువే.

ఈశకర్ణుడు:- రాజవంశ మంతరించటము చూచి ఆత్మహత్య చేసుకున్నాడని కొందరనుకుంటున్నారు. మరి కొందరు మహారాణా వనవీరుడే ఆయన్ను చంపించాడని చెవులు కొరుక్కుంటున్నారు.

సేనాపతి:- ఎందుకని?

ఈశకర్ణుడు:- బహుశః క్రొత్తరాణా మనస్సు పాతసర్దారు మనస్సులో కలియలేదేమో. అయినా ఈ ప్రసంగంతో మనకు వచ్చేదేమిటి, పోయేదేమిటి? ఈ డూంగరపుర ప్రభువు ఇదివరకు విక్రమసింహుని యనుచరుడు; ఇప్పుడు వనవీరుని కధీనుడైనాడు. కాని, మహారాణా వనవీరుడు మనకొక పెద్దయాశ చూపించాడు సుమా!

(దుఃఖస్వరంతో పాడుతూ పన్నా, ఉదయుడు ప్రవేశిస్తారు)

సోహినీ - త్రితాళం

పన్నా, ఉదయుడు:

తనువు లలసిపోయే, ఇడుమలోర్చి కొగడవుల నడచీ;
ధూళి గొట్టుకొని పగళ్లు నడచీ,

చుక్కల లెక్కిడి రాత్రులు గడపీ,
ఆశలన్నియూ విడచి వచ్చితిమి నీవే శరణు మహేశా!

(ఉదయుని యెడమకాలి బొటనవ్రేలికి ఎదురుదెబ్బ తగులుతుంది. పన్నా పాడుతూనే చీరకొంగు నుంచి పేలికచించి కట్టుకడుతుంది.)

సుడిగుండములో పడి చిక్కితిమే,
నాథ! ఒడ్డునకు నావ చేర్పవే!
ఎందరికో అభయం బిచ్చితివే,
దయ నెందరినో దరిజేర్చితివే!

పన్నా:-ఈ యడవుల్లో పడి తిరిగి తిరిగి రావటంచేత నీముఖం వాడువారింది. బట్టలు దుమ్ము కొట్టుకున్నవి, చినిగిపోయాయి కూడా. బిడ్డా! నిన్ను నా వీపుమీద ఎత్తుకుంటాను. డూంగరపురము చేరువకు వచ్చేశాం.

ఉదయు:-వద్దమ్మా! నీవు నిన్నటినుంచీ ఏమీ తిననేలేదు. నడిచే వస్తాలే.

పన్నా:-అగణిత దీన దుఃఖ జన శరణ్యుడివి, భగవంతుడా! ఇంత నిలువనీడ లేకపోయిందా హిందూ సూర్యుడు బప్పారావంతవాని వంశజుడికి?

ఉదయు:-ఆచెట్టు నీడన కాస్సేపు విశ్రమించి పోదాం. (ఈశకర్ణుడు, సేనాపతి కూచునియున్న వేపుకు చూపుతాడు.)

పన్నా:-(అటుచూచి చకితయై) ఎవరది? వేషభూషల్నిబట్టి ఎవరో రాజవంశకుడుగా కనిపిస్తున్నాడు. ఈయన పరిచయం పొందుతాను (ముందుకు నడుస్తుంది.)

ఈశకర్ణుడు:-[సేనాపతితో సహాలేచి] ఈ నిర్జనప్రదేశంలో ఎవరు నీవు?

పన్నా:-రక్షించండి, రక్షించండి. నే నొక భిక్షుకురాల్ని. శ్రీమంతుల పరిచయప్రాప్తిని ఆశిస్తున్నాను. (మోకరిలుతుంది)

సేనాపతి:-నీ విప్పుడు డూంగరపురాధీశ్వరుని సమక్షంలో ఉన్నావు.

పన్నా:-మహాభాగ్యం. తమ సేవాసంపత్తినే కోరి వెళుతున్నాను. దారిలోనే దర్శన మిచ్చారు.

ఈశకర్ణుడు:-ఆకుర్రవాడు నీ కొడుకా?

పన్నా:-ఔను కొడుకే. కొడుకునుకూడా అతనికోసం బలియిచ్చుకోతగిన యోగ్యుడు. ఇతన్ని తమరు పోషించండి మహాప్రభూ! ఏనాటికైనా ప్రత్యుపకారం చేస్తాడు.

ఈశకర్ణుడు:-ఒక బిచ్చగత్తెకొడుకు ప్రత్యుపకారం చేస్తాడు! సేనాపతీ! ఈవిడ పిచ్చిదికాదు కదా!

పన్నా:-ఈ కుర్రవాని తండ్రి మీ కనేక సహాయాలు చేశారు. మీ మహాలుకు తీసుకుపోయి ఇతని పోషణ భారం వహించండి.

సేనాపతి:-ఇంకా వినండి. ఇంత కూడుపెడితే చాలదుట. రాజమహలులో నివాసము కావాలిట!

ఈశకర్ణుడు:-ఎందుకు?

పన్నా:-ఎందుకా? ఇతడు తమ ప్రభువైన సంగ్రామసింహుని పుత్రుడు.

ఉదయుడు:-(పన్నా వేలులాగి అడ్డగించుతాడు. అవలకు తీసుకుపోయి చెబుతాడు) లాభం లేదమ్మా! ఈయన హృదయంలో దయలేదు. మనం బయలుపడకూడదు. పద, సింహ గహ్వారంలోనే ఆశ్రయం వెదకికొందాం. బహుశః అదే మనల్ని రక్షిస్తుంది.

ఈశకర్ణుడు:-ఏమి చెప్పావు? ఇతడు సంగ్రామసింహుని పుత్రుడా? చాల బాగుంది. నిజమే. కాని ఇతన్నెవరో చంపారు కదూ?

పన్నా:-ఎవరో చంపారు, కాని నేను తిరిగి బ్రతికించాను.

ఈశకర్ణుడు:-అయితే నీవద్ద అమృతంకూడా ఉన్నదన్నమాట!

సేనాపతి:-బిచ్చగత్తె కొడుకును రాజకుమారుణ్ణిగా మార్చే విద్యకూడాను.

ఈశకర్ణుడు:-సేనాపతీ! ఇకపద. ఇంకా రాజధాని చాలదూరం ఉన్నది. లేకపోతే మరికొంతసేపు ఈవిడ మాటలతో వినోదకాలక్షేపం చేయవచ్చు.

పన్నా:-నేను నిరాశతో వెళ్ళిపోవలసిందేనా మహారాజా!

సేనాపతి:-వెళ్ళిపో. పిచ్చిదానా! మరొకప్పుడు రాజధానికి రా. (ఈశకర్ణుడు, సేనాపతి నిష్క్రమిస్తారు)

ఉదయు:-అమ్మా! ఇప్పుడిక ఎక్కడికిపోదాం? దేవళరాజును సందర్శించాం. ఆయన వనవీరుడికి భయపడి పోయాడు. ఈ డూంగరపురపురాజు నిన్నొక పిచ్చిదాన్నిగా భావించాడు. ఇప్పుడిక ఈ ఆరావళీ పర్వత ప్రాంత్యపు ఏదో ఒక లోయయందే మన యాశలన్నీ కేంద్రీభూతము లౌతున్నవి. అమ్మా! మన మెక్కడికీ పోవద్దిక. రాజమకుటం మీద ఆశవదలుకో; దానిలో ఏమి విశేషం ఉంది? మనం ఈ వనాల్లోనే నివసిస్తూ, కందమూలాలు తింటూ, జీవనసుఖం అన్వేషించుకుందాం.

పన్నా:-వద్దు, వద్దు, బిడ్డా! నా బహిఃప్రాణానివి, అలాగ మాట్లాడకు. ఇప్పటికీ ఈ రాజపుత్రస్థానమంతా సంగరాణాకు ఋణగ్రస్తులై యున్నవారితో నిండిఉంది. ఎవరి హృదయంలోనైనా కాసంత దయ పొడసూపకపోదు. కమల్‌మీర్ ప్రభువు ఆశాశాహుడు ధర్మబుద్ధి కలవాడు. ఆయనెప్పుడూ నీ తండ్రిగారి ననుసరించి యుండేవాడు. ఈనాడు తప్పక నీకాయన ఆశ్రయ మిస్తాడు.

ఉదయు:-కమల్‌మీర్ ఇంకా చాలదూరంఉంది. అమ్మా! ఇప్పుడు మనం వెళ్ళలేం నాకు చాలసేపటినుంచీ దాహంగాఉంది.

పన్నా:-నిన్ను నే నెత్తుకుని నెమ్మదిగా తీసుకువెళుతాలే. ఇక్కడే జాగ్రతగా కూచునిఉండు, నీళ్ళు వెదకి పట్టుకొస్తాను.

(పన్నా నిష్క్రమిస్తుంది. కొందరు తాంత్రికులు ప్రవేశిస్తారు)

ఒకడు :-పట్టుకోండి, పట్టుకోండి!

రెండోవాడు :-అక్కడే, అక్కడే (ఉదయుని సమీపించి ఇద్దరు తాంత్రికు లతనిచేతులు పట్టుకుంటారు)

ఉదయు :-ఏమిచేస్తారు నన్ను పట్టుకుని?

మొదటివాడు :-పద, అక్కడే తెలుస్తుందిలే.

ఉదయు :-విడవండి, విడవండి. నా దగ్గిర ఈ బంగారపు తాయెత్తుతప్ప మరేమీలేదు.

రెండోవాడు :-మాకది అక్కర్లేదు. నీతోనే పనుంది.

ఉదయు :-నాకు మరీ దాహంగాఉంది. మా అమ్మ నీళ్ళు పట్టుకువస్తానని వెళ్ళింది. నన్ను మొదట దాహం తీర్చుకోనివ్వండి.

మొదటివాడు :-పద, మంచినీళ్ళు అక్కడే తాగుదువుగానిలే. మా సర్దారుకు నీతో అవసరం వచ్చింది.

ఉదయు :-ఎందుకు?

రెండోవాడు :-నిన్ను కాళీమాతకు బలి యివ్వాలి. మా సర్దారుకు స్వప్నంలో అమ్మోరు చాల అకలిగా ఉన్నట్టు కనిపించిందిట.

ఉదయు :-నా బలితో ఆమెను తృప్తిపడనీయండి. నేనూ అందుకోసమే ఎదురుచూస్తున్నాను. కాని మొదట మా అమ్మదగ్గర సెలవు తీసుకోనివ్వండి. ఆమె వస్తూనే ఉండాలి; ఒక్కక్షణం ఆగండి.

మొదటివాడు :-వల్లకాదు. మా కట్లాంటి ఆజ్ఞయేమీలేదు. (తాంత్రికులు ఉదయుని పట్టుకుపోతారు. రెండో వేపునుంచి పన్నా ప్రవేశిస్తుంది దొన్నెలో నీరు పట్టుకుని)

పన్నా :-(ఉదయుడు కనిపించక అటూ, ఇటూ పరికించి, చకిత ఔతుంది) ఏడీ! ఎక్కడున్నాడు? ఈ చెట్టునీడనేగా కూచున్నాడు. ఔను నిస్సందేహంగా ఇక్కడే. మరి ఇంతలోనే ఏమైనాడు? దాక్కున్నాడా? నాతో ఎప్పుడూ పరిహాసమాడేవాడు కాదే! (పిలుస్తుంది) ఉదయ్! ఉదయ్!! ఉదయ్!!! [ప్రత్యుత్తరం లేక ఆమె చాల చింతపడుతుంది. నీటిదొన్నె చేతిలోనుంచి కిందజారి పడుతుంది.] హా! భగవంతుడా! పిలిస్తే పలుకవూ? ఎక్కడికెళ్ళావు? ఏ హింసా జంతువుకో ఆహారం కాలేదుకద! [నేలమీద పదచిహ్నాలు చూచి] ఎవరివో మనుష్యుల పదచిహ్నాలు ఇక్కడ అంకితమై ఉన్నవి. వాటి మధ్యన ఉదయుని సుకుమారములైన—ఆచ్ఛాదనములేని చిరుపాదాల ముద్రలుకూడ ఉన్నవి. అతని యెడమకాలికి ఎదురుదెబ్బ తగిలినప్పుడు గుడ్డకట్టు కట్టాను, అదికూడ అచ్చు పడ్డది. అతన్ని ఎవరో పట్టుకుపోయి వుంటారు. ఇటే వెళ్ళినట్టుంది; నేనూ ఈ పదచిహ్నాల ననుసరించే వెళుతాను. (పన్నా భూమిమీద పదచిహ్నాల్ని ఏకాగ్ర దృష్టితో అనుసరిస్తూ నిష్క్రమిస్తుంది.)

—పట పరివర్తన—

(ఇంకా వుంది)

# ★ సాహిత్యవిమర్శనము : సిద్ధాంత ప్రయోగములు ★

ఉత్తమ సాహిత్యమునకు రూప
సౌందర్యము, భావసౌందర్యము
గూడ నుండవలెను



— శ్రీ —

గుంటూరు సత్యనారాయణ ఎం. ఏ.

కవికి విమర్శకుడు పూర్తియగు అణకువ చూపిననాడే, కవితా సౌందర్యమును పూర్తిగ గ్రోలగల్గును. రూప, భావ సౌందర్య సమ్మేళనమును చర్చించుచున్నప్పుడు మాత్రమే విమర్శకుడు నిరంకుశుడు—

● నారచించిన "తిమ్మరుసు" "పాత్రరచన" కొరకు "ఔన్నత్యాల" కొరకు వ్రాయబడలేదు—అది "రాజ్యతంత్రజ్ఞత"పై నాటకము ●

విమర్శ రెండువిధములు: సిద్ధాంతము; ప్రయోగము. లలితకళ లన్నిటియందును—ముఖ్యముగ సాహిత్యమున—నీ రెండును ఉపయోగింపబడుచున్నవి. వీటి ధర్మములు, ప్రయోగములు చర్చించుటకు ముందు కొంత నిర్వచన మవసరము.

సాహిత్యము ఏరూపమైనను—జీవితమును విమర్శించుచు కాలమానముల కతీతములగు సద్ధర్మముల నెలకొల్ప ప్రయత్నించును. ఈ ప్రపంచమునందలి లోపములందు నశింపనైన నశింపవచ్చును; లేదా ఉత్ప్రేక్షింపబడవచ్చును. ("Literature either reflects the age or Revolts against it"). మొదటిది ఆదర్శ యుతమైయుండును; రెండవది మనలోపములు మాత్రముజూపి, వాటియందు మనకేహ్యము బుట్టించును. రెండింట ఫలమొక్కటియే. ఈ రెండిట మనమేవిధముగ ధర్మబోధచేయ దొరకొన్నను, మనకొక రూపము (form) కావలెను. పద్యము, నాటకము, నవల, చిన్నకథ—వీటిలో నేదైనమనకు గైకొని జీవితముగూర్చి మన యుద్దేశముల వెలిబుత్తుము. వాల్మీకి మొదటిదారిద్రొక్కి పద్యరూపమున రామరాజ్యమును సృష్టించెను; రెండవదారిద్రొక్కి నాటకరూపమున షేక్స్పియరు, లియరు కథను సృష్టించెను. ఈ రెండును, ఉదాహరణమునకుగైకొని సిద్ధాంత, ప్రయోగ విమర్శనలకుగల భేదము గమనింతము: ఒకటి పద్య కావ్యము: ప్రబంధము: అనగా కొన్ని నిబంధనల ననుసరించి జీవితవిమర్శకు దొరకొన్న సాహిత్యస్వరూప మన్నమాట. పద్యాదులకు ఛందోబద్ధమైన నియమములు కొన్ని గలవు; ప్రబంధమునకుగూడ నట్లే కొన్ని వర్ణనలు మొదలగు నియమములుగలవు. ఈ రెండునియమముల ననుసరించునదే ప్రబంధకావ్య మగునని సిద్ధాంతము (theory); ఈ సిద్ధాంతము నీకావ్య మెంతవరకు పాటించుచున్నది అని చేయు విమర్శనమే సిద్ధాంత విమర్శనము (Theoretical criticism). ఇక రెండవది: కావ్యమునే ఆధారముగజేసికొని, అందలి గుణ దోషాదులచర్చించుచు, సిద్ధాంతములతో సంబంధములేక, అందుగల యుత్కృష్టరసముల జూప యత్నించునది ప్రయోగవిమర్శనము (Practical criticism)

ఉన్నత సాహిత్యమునకీ రెండును ముఖ్యావసరములు. రూప సౌందర్యము, భావ సౌందర్యమును (Beauties of Form and Thought) గూడ నుండవలెను. అప్పుడే (Total Impression) కోమలమై, బలవత్తరమైయుండును. రూపసౌందర్యమును విమర్శింపునప్పుడు విమర్శకుడు నిరంకుశుడు; భావసౌందర్య విమర్శనమున నాతడు కవికి జోహారొనర్పవలెను. అప్పుడే ఆతడు కవికిని, కవిత్వమునకునుగూడ మహత్తర సేవ జేయగల్గును. కవి నిరంకుశుడన్నది భావసౌందర్య చిత్రమునందే; రూపసౌందర్యమునకు కొన్ని నియమములు—తను సృష్టించుకొన్నవైనను—పాటింపకతప్పదు. భావస్వభావమునుబట్టి, కవి రూపము నెంచుకొనును: ఉన్నత భావములులేక, క్రమములేక జరుగు ఘట్టముల చిత్రింపవలెనన్నచో ఏరూప మెంచుకొనవలెను? చిన్న కధగాని, నవలగాని, అటుగాక, ఏ పద్యకావ్యమో ఎంచుకొన్నచో, నిర్జీవమగు మాటల కూర్పు తయారగును. ఉదాహరణమునకు భాగవతములోని దొకపద్యము జూపెదను—

“వీరెవ్వరు శ్రీ కృష్ణులు గారా యెన్నడును వెన్న । గానరటకదా,
చోరత్వం బించుకయును నేరరట, ధరిత్రినిట్టి । నియతులుగలరే॥”

యశోద, దధిభాండము బ్రద్దలుజేసిన చిన్న కృష్ణుని తరిమి తరిమి పట్టుకొన్నది; బాలుడు చిక్కక పరుగెత్తిన కొలది కోపము హెచ్చినది. చివరకు దొంగపట్టుబడినాడు: కాని:—

“...కొట్టచేతులాడక...” కట్టదలచి, పై ముక్కలన్నది. పై పద్యమున, ప్రతి పదమునందును మాతృత్వము తొణికిసలాడుచున్నది. కాని, నూటికినూరు ప్రతితల్లియు చేయుపనియే యశోదయుచేసినది: ఇక ఘనత యెచ్చటనున్నది? రూపములో. భావము కందములో నెంత చక్కగ నిమిడియున్నది! ఆ రూప సౌందర్యములో భావసౌందర్యము తన దైనందినంత్వము గోల్పోయి మాతృత్వమున కపూర్వ సౌందర్యము గూర్చుచున్నది. ఈ భావ, రూపసమ్మేళనమునందే కవి ఘనత కన్పట్టును: “He (the poet) presents common things in uncommon light” (కవి సామాన్య విషయముల నపూర్వముగ చిత్రించును)

కందము ఛందోబద్ధముగ నందరును వ్రాయుదురు. ఇందు విమర్శకుని సిద్ధాంతమే ఉపచరించును. కాని కందమునకు తగిన భావము నందిమిడ్చినప్పుడే దాని సౌందర్యము పూర్తిగ బయల్పడును. కనుక, విమర్శకుడు కవి భావ సౌందర్యమును సిద్ధాంతీకరింపక, ఆ సౌందర్యమును తా నాస్వాదించుచు మనకందించి, రూప సౌందర్యమునుగూడ రుచి జూడవలెను. రూప, భావసౌందర్యముల కవినా భావసౌందర్యమున్నది. ఈ రెండింటి మేళవింపునందలి కమ్మదనమును రుచిజూపుటయే విమర్శన మను పేరునకు తగియుండును. సిద్ధాంత, ప్రయోగముల రెంటినిగూడ విమర్శకుడు మననునందుంచుకొనవలెను. కవిత్వ తత్వమును సిద్ధాంతీకరింప దొరకొన్నచో, మనకా సిద్ధాంతము మాత్రముమిగిలి, సౌందర్యము చేజారిపోవును. భావసౌందర్యములు సిద్ధాంతముల కతీతములు. “భావౌన్నత్యాలు—శిఖరౌన్నత్యాలు—లోతులు—చిగళ్లు—కమనీయాలు,” అనిన భావసౌందర్యముకాదు. ఇవి ఒక కావ్యములో తక్కువ అని విమర్శించిన అర్థములేని విమర్శనయగును. నిజమునకు ఇవి అర్థములేని మాటలు—ఆధునిక విమర్శకుని దబాయింపు కబుర్లు. మాత్యూ ఆర్నాల్డు (Matthew Arnold) ఇటులనే నిర్వచించబోయెను భావసౌందర్యమును: “Poetry is a criticism of life presented according to the laws of poetic truth and beauty” ఇందు ఒక పదమునకును సరియైన నిర్వచనము లేదు.

అందుచే అతడు చివరకు విసిగి మహాకవుల మహా వాక్యములను గీటురాళ్లుగ నుంచుకొని భావసౌందర్యమును తెలుసుకొమ్మనినాడు. అనగా, భావసౌందర్యము సిద్ధాంతములకుగాక, ఆస్వాదమునకే లొంగునన్నమాట.

పై చర్చనుబట్టి తేలిన ముఖ్యాంశము: కవికి విమర్శకుడు పూర్తియగు అణుకువ చూపిననాడే, కవితా సౌందర్యమును పూర్తిగ గ్రోలగల్గును. రూప, భావసౌందర్య సమ్మేళనమును చర్చించునప్పుడు మాత్రమే విమర్శకుడు నిరంకుశుడు.

"View of Life" (జీవితాదర్శము) యుగయుగమునకును మారుచుండును. సంఘ ధర్మములుగూడ తదనుగుణముగ మారుచుండును. అప్పుడు క్రొత్తదృష్టితో మనము జీవితమును జూతుము. క్రొత్తభావములు రేకెత్తును. ఆభావ సౌందర్యమును చిత్రించుటకు ప్రాతరూపములేవియు సరిపడకపోవచ్చును. అట్టిచో కవి, తన భావమున కనుకూలమగు విశిష్టరూపమును సృష్టించుకొనును. ఆ రూపమా భావమును సౌందర్యయుతముగ ప్రదర్శించుచున్నదా లేదా యనియేగాని, ఆ రూపము క్రొత్తదా, ప్రాతదా యని కవి యధికారము చర్చించుట విమర్శకుని పనిగాదు. "ముత్యాలసరము" మన ఛందస్సున క్రొత్త. శివశంకరశాస్త్రిగారు "పద్మావతీ చరణచారణ చక్రవర్తి"లో దానిసౌందర్యమును పూర్తిగ జూపినారు. భావ, రూపములమేళవింపు మధురముగనున్నది. కాని లాక్షణికులు ముత్యాలసరము నొప్పరు: కనుక ఆ కావ్యము మధురకవిత్వము కాదందురు. ఇది సిద్ధాంతవిమర్శ.

సాహిత్యమున-ప్రతికవియు తనసృష్టినొక దృష్టిలో చిత్రించును. ప్రతి కావ్యమునకును ఒక యుద్దేశముండును. ఆ యుద్దేశమున కనుగుణమగుదృష్టిలో కావ్యము రచింపబడును. ఆ దృష్టిలో జీవము దృక్పథమున నిలిపినప్పుడు తక్కిన పథములందు కన్పట్టక పోవచ్చును; లేదా అవి నీడలవలె నచ్చటచ్చట తగులవచ్చును. సిద్ధాంతము, సాహిత్యము సర్వతోముఖముగ జీవితమును ప్రదర్శింపవలెననియున్నది. కనుక ఒక్కదృష్టి (View-Point)తో మాత్రము రచింపబడ్డ కావ్యమును నిరసింపవలెను. అనగా ఆకావ్యమును, లేని సౌందర్యములకొరకు ఖండింపవలెను. ఈ యుద్దేశము నుదాహరింతును. మహాత్ముని స్వీయచరిత్రగైకొందము. స్వీయచరిత్రయన-తన జీవితమునందలి ఘట్టములన్నియు చిత్రింపవలెను. కాని నేటివరకు అట్టిది వెలువడి యుండలేదు. మహాత్ముని దృష్టిలో జీవితయాత్ర సత్యసాధనకొరకు కనుకనే తన జీవితమున ఆ సాధనకు సంబంధించిన ఘట్టములను మాత్రము చిత్రించెను. వీరేశలింగం పంతులుగారు తన సంస్కరణోద్యమమునకు సంబంధించిన ఘట్టములను మాత్రము చిత్రించెను. 'స్వీయ చరిత్ర' యని పేరిడి కొన్ని ఘట్టముల నిందు చిత్రింపలేదు గావున నిది ఉత్కృష్టకావ్యముగాదు అనుట సిద్ధాంత విమర్శ. ఆవును కొన్నచో గేదను కొనలేదని దుయ్యబట్టు టెంత సమంజసమో నిదియునట్లే. నేను కొన్న యావునందలి గుణదోషాదుల జూపుటయే నా స్నేహితుని పని. నేను కొననిదానికి నన్ను తిట్టి ప్రయోజనమేమి? హరిశ్చంద్ర నాటకము జదివి ఆతని సత్యసంధతయేగాని రాజ్యతంత్రజ్ఞత జూపలేదు గావున నీతని పాత్రరచన అసంపూర్తిగనున్నదనుట సిద్ధాంతవిమర్శ. నారచించిన "తిమ్మరుసు" నాటకమును విమర్శించుచు "ఔన్నత్యాలు, లోతులు, తక్కువ; రాయలపాత్ర రచనలో గాంభీర్యములేదు"అని శాస్త్రిగారు ఆంధ్రపత్రికలో సెలవిచ్చిరి. నేనా నాటకము "పాత్రరచన" కొరకు "ఔన్నత్యాల"కొరకు వ్రాయలేదు. తిమ్మరుసు, గజపతి, రాయలు వీరి ముగ్గురిని రాజ్యతంత్రజ్ఞులుగ

మాత్రమే దృష్టిలో నిలుపుకొంటిని. ఇది రాయలపైగాని, తిమ్మరుసుపైగాని నాటకముగాదు; "రాజ్యతంత్రజ్ఞత"పై నాటకము. ఈ ముక్కలు తొలిపలుకులో వ్రాసియున్నను వారికి బోధపడలేదు. నేను చిత్రింప దొరకొనని రాయల పాత్రాగాంభీర్యము, కవితా రసగ్రహణము వారి విమర్శకాధారమై "నారాజు" నాటకముతో పోల్చుట కవకాశమొనర్చినవి. "నారాజు" నాటకమున సర్వతోముఖముగ నన్నిపాత్రలను పోషింప ప్రయత్నము; అది యెంతవరకు ఫలించినదో రంగస్థలముపై జూచిన వారికి బోధపడును; ఒక పాత్రయును Logical finish కు రాలేకపోయి, వివిధములగు భావముల రేకెత్తించి చంపివేసినది.

John Drinkwater (జాన్ డ్రింక్‌వాటర్) రచించిన "అబ్రహామ్ లింకన్"గాని "క్రాంవెల్"గాని చదివినచో—శాస్త్రిగారికి నాటక రచనయందు దృక్పథము (View-point) రూపము నేడెంతమార్పును ఉత్కృష్టతయు జెందినవో బోధపడును. ఆనాటకములలో లింకన్‌గాని, క్రాంవెల్‌గాని మన యుద్దేశములకు సరిపడరు. లింకన్‌ను, బానిసవర్తక నిర్మూలమును మనము కలుపుదుము. గాని డ్రింక్‌వాటర్ నాటకమున, బానిస లాతని రాజ్యతంత్రజ్ఞతయందు కనపడరు. ఐనను ఆ నాటకములు సౌందర్యవంతములై యున్నవి; చిరజీవులై యుండును. ఇట్టి రూపము (Form) మన నాటకమునకు క్రొత్త. కనుక—శాస్త్రిగారికి "తిమ్మరుసు" చేదుగా తగిలినది. ఇది సిద్ధాంత విమర్శనాఫలితము.

సిద్ధాంతవిమర్శ కూడదని నా యుద్దేశముగాదు. కాని అది మన విమర్శకులలో నెంత అపాయకరముగ పరిణమించినదో చూపుచుంటిని. కవికి కవి సిద్ధాంతములతోడనే గాని విమర్శకుని సిద్ధాంతములతో పని లేదు. తానొక క్రొత్తరూపమును సృష్టించినప్పుడు కొన్ని సిద్ధాంతముల నిచ్చును. ఆ సిద్ధాంతములను రూప భావ సమ్మేళనమునందు సౌందర్యముగ నెట్లు కవి ఉపయోగించెనో విమర్శకుడు చూడవలెను; చూపవలెను. ఇకనైన మన విమర్శకులు సిద్ధాంతములతో నూగక సిద్ధాంతముల నెట్లు ఉపయోగింపవలెనో గ్రహించి కవిత్వ సౌందర్యములను పూర్తిగ నాస్వాదించి తక్కిన వారికా యవకాశ మొసంగుదురని యాశింతము.

# ఆశీస్సు

బులుసు సూర్యప్రకాశశాస్త్రి

సకల సారస్వతాస్వాదభూ యిష్టమా వాఙ్మాలములనిచ్చు వనితవీవు!
సకల వినోదముల్ సమకూర్చి యభిలాషఁ బుట్టించుచుండెడి పొలతివీవు!
సకల మానవమనో సామ్రాజ్యమేలంగ పట్టంబుగట్టిన పడతివీవు!
సకల భావములను సమకూర్చుచుండెడి కళ్యాణమూర్తివౌ కాంతవీవు!

విశ్వమానవ సంఘాల వింతలెల్ల
వివిధరుచులును వెలయించి విఱ్ఱవీగి
వఱలు "గృహలక్ష్మి" సతతము నసువుతోడు
వృద్ధిగాంచుమ సకల సమృద్ధిగాను.

# భావతరంగిణి   

"చంటిబిడ్డల తల్లులను జైలుకు పంపుట అంత మంచిదిగాదు. పూర్వపు సత్యాగ్రహానికి ఇప్పటి సత్యాగ్రహానికి చాలా వ్యత్యాసం వుంది. చంటిబిడ్డలుగల తల్లులు బిడ్డలను భావిభారతపౌరులుగా తయారు చేయడానికి ఎంతనో చేయవలసి వుంది. ఇంటివద్దవుండే నిర్మాణకార్యక్రమమును చేయుచుండిన చాలమంచిది."

—మహాత్మా గాంధి.

"ఈ కాలపు భారత స్త్రీలు ఐరోపాదేశ స్త్రీల ననుసరించి గృహకృత్యములను మానుకొనిరి. కాని పాశ్చాత్య వనితలుచేయునట్లు వ్యాయామము చేయుటలేదు. స్త్రీలకు అవసరమగు ఆరోగ్యము నూలు వడుకుటవలన కలుగును. మరియు నూలువడుకుటవలన, స్త్రీలకు చాలవరకు ఆర్థికముగా స్వాతంత్ర్యము చేకూరును."

—బాబు రాజేంద్ర ప్రసాద్.

"మీరంతా తెలుగువారయియుండి, సభలో తెలుగున ఉపన్యాసాలు జరుగక, ఇంగ్లీషులో జరగడం విచారంగా ఉంది. పరభాష నేర్చి స్వభాషను అడుగంటజేయుచున్నారు. తెలుగు అన్నిభాషలలో అత్యంత మాధుర్యమయినది. దాని నశ్రద్ధచేయరాదు. తమిళులు, మళయాళులుగూడ అంతే చేయుచున్నారు. ఈ దౌర్భాగ్యం దక్షిణదేశమునందే ఎక్కువగ నున్నది. దేశభాషను మరచిపోవుటలో గర్వం పొందుతుంటారు గూడను. అది తగదు. విద్యార్థు లయినా యికముందు యీ అలవాటు తప్పించుకొని, మాతృభాషను పోషించాలి."

—అమ్ము స్వామినాథన్.

"శతాబ్దాలనుంచి బానిసలుగానున్న స్త్రీలలో పనిచేయుట సామాన్యవిషయం కాదు. స్త్రీ స్వాతంత్ర్యమంటే బానిస వాతావరణంలోనున్న మన స్త్రీలే మనలను వ్యతిరేకిస్తున్నారు. కాబట్టి మనం మన కార్యక్రమాన్ని బాగా ఆలోచించి సమయాన్నిబట్టి, ఫలాన్నిబట్టి ప్రవేశపెడుతూండాలి."

—చంద్ర సావిత్రీదేవి.

"శాస్త్రానికి మతానికి సామరస్యమును కలిగించడానికి రెండు ఖండాలలోని మనుష్యులందరు గట్టి ప్రయత్నం చేస్తున్నారు. అతి ప్రాచీనమయినప్పటికిన్నీ యిప్పుడుకూడా సజీవంగానే వున్న హిందూమతంలోనే యిది సాధ్యం. హిందూమతం దేవతలవంటిది. దేవతలెల్లప్పుడు 20 యేళ్ల వయసుగల నిండు యౌవనులుగానే వుంటారు. హిందూమతానికి అనేకవేల శతాబ్దాలు గడిచిపోయినా యీ మతం యెల్లప్పుడు నవయువతిగానే వుంటుంది."

—శొంఠి వేంకటరామమూర్తి పంతులు.

"చక్కని మార్గమున, నిర్మలమానసముతో దీక్షతో నిర్మాణకార్యక్రమమున నిమగ్నులైతిమేని, పూర్వపు ఔన్నత్యమును మనము కరతలామలకముగా చూచుకొనవచ్చును. ఒక్క మూడుకోట్ల జనసంఖ్యగల మన ఆంధ్ర జనసంఘము తలచుకొంటె కొండను పిండిచేయవచ్చును. ఇండియాదేశమున మూడవ గౌరవ స్థానములో ఆసీనులై యున్నాము. అట్లుండునపుడు చింతింపనేల?"

—సాధు వరదరాజం పంతులు.

# ★ మనసంఘం

## చెడితే చేరనివ్వదు బాగుంటే ఓర్వదు

(బాలవితంతు)

సుశీల కాపురానికివెళ్ళి మూడు సంవత్సరాలన్నా నిండలేదు.

పండువంటికాపురం; తలవని తలంపుగా సుశీల భర్త మరణించాడు. బాగా సంపాదిస్తూ సుఖంగా వున్నవాళ్ళేగాని వెనుక ముందు ఆలోచించినవారుకారు. సుశీలకు తలిదండ్రులులేరు. కూడ పెట్టిన ధనంలేదు. చేతిలో రెండేళ్ల పసిపాప ప్రేమలత ఇద్దరు అన్నగార్లుతప్ప మరి దిక్కులేరు సుశీలకు.

ప్రకాశం చిన్న అన్నగార్కి పిల్లలులేరు. బాగా సంపాదిస్తున్నాడు. చెల్లెలు దుస్థితికి మనసు కరిగిపోయింది. భార్యతో అన్నాడు. 'హేమా! సుశీల పుట్టింట్లో, అత్తవారింట్లోకూడ చాల ప్రేమగా పెరిగింది. ఆమెకు అనుకోనికష్టం సంభవించింది. మనతో కూడ మద్రాసుకు పిలుచుకుని వెడదామా?'

హేమ 'నిజమే ఆవిడకు రాకూడని కష్టమేవచ్చింది. నుదుటి వ్రాతను తప్పింప ఎవరితరము. నాకు చాల దుఃఖంగానేవున్నది. అయితే మనమేమిచేస్తాము. ఈ కాలంలో ఎవరిపొట్ట వాళ్ళు పోసుకొని మర్యాదగా కాలం వెళ్ళద్రోస్తేచాలు. మీ కెందుకా ఋణము. మీ అన్నగారున్నారు. వారియిష్టం. మీరాప్రస్తాపనే చెయ్యవద్దు' అని ఖండితంగా చెప్పేసింది. భార్యమాటను జవదాటని ప్రకాశం యిక ఏమంటాడు? పలక్కుండా మద్రాసు వెళ్ళిపోయారు.

అమ్మా! ఏ సంఘ మర్యాదలకోసము మీ రింత ఆత్మను, శరీరాన్ని, హృదయాన్ని పాడుచేసుకున్నారో, దేనియొక్క మర్యాదను కాపాడటానికి మీ రిప్పుడు ప్రాణత్యాగం చేసుకున్నారో ఆ సంఘం మిమ్ము ఉద్ధరించిందా? లేక మీరు మరణిస్తే 'అయ్యో' అంటుందా?

శ్రీమతి
సి. కమలాదేవి

రామమూర్తి పెద్దసంసారి. స్వల్ప జీతగాడు. తనకువచ్చువేతనము తనభార్య పిల్లలను పోషింపనే చాలదు. పాపం రామమూర్తి, ప్రకాశం ఈ విధంగా పలక్కుండ వెళ్లిపోతాడని అనుకోనేలేదు. సుశీల, ప్రేమలతల పోషణబాధ్యత రామమూర్తిమీదే పడింది. సుశీలకు భర్త మరణించేసరికి పద్ధెనిమిది సంవత్సరాలు. రామమూర్తికి ఒక మేడయిల్లుతప్ప పెద్దల ఆస్తి ఏమిలేదు. నెలకు ముప్పదిరూపాయిలకన్నా ఎక్కువ జీతంలేదు. ఆరుగురు పిల్లలు, చెల్లెలు, భార్య యింతమంది జీవనము అందులోకావలయును. ఇంట్లో అంతచాకిరి సుశీలపైనేపడింది. రామమూర్తిభార్య సావిత్రమ్మ ఎదుటివారి హృదయం గ్రహించకుండా మాట్లాడే స్వభావం, పైగా గోరంతదాన్ని కొండంత చేసేదికూడాను.

సుశీల ఓర్పుగలదేగాని మాటలంటేమాత్రం ఓర్చేదికాదు. సావిత్రమ్మ ఒక్క సంవత్సరము మాత్రం అంతగా ఏమి అనకుండా బాగానే చూచింది. అదిప్రేమో, దయయో, పశ్చాత్తాపమోగాని సుశీలకు

భర్తలేని కొరతగాని, తల్లిదండ్రులులేని లోపముగాని అంతగా అవుపించకుండా వుంటూవుండేది. ఎక్కువ ఆదరణగా వుండేది.

♦ ♦ ♦ ♦

ఇప్పుడు సుశీలకు పందొమ్మిదో సంవత్సరము నిండుతూవుంది. ఆమె ఒక్క సంవత్సరం అన్నం నీళ్ళులేకుండా దుఃఖిస్తూవుండింది. తర్వాత తనకుతానే కొంత ధైర్యముతెచ్చుకొని తెప్పరిల్లేది. స్నానంచేసి శుభ్రమైన వస్త్రములధరించేది. తలదువ్వి జడవేసుకునేది. ఇంటిపనులనుకూడా విసుగులేకుండా శ్రద్ధగా చేసేది. సావిత్రమ్మకు సుశీలయొక్క ఈమార్పు నచ్చలేదు.

'ఏం తప్పు! ఎవరన్నా వింటే నవ్విపోతారు. నీ బ్రతుకేమి? నీకు దేవుడురాసిన వ్రాత ఏమి? చిన్నభర్త......అన్ని సంగతులు జరిగింది...అనుకుంటే నీకు దుఃఖమన్నా రాదేమో? ఈమధ్యన నీ సొగసులు, నీ జడలు, నీ ప్రవర్తనము నాకేమి నచ్చలేదు. నీవు మర్యాదనంతా పాడుచేస్తున్నావు. జాగ్రత. యికమీదన్నా మెలుకువగా ఉండు' అన్నది సావిత్రమ్మ.

గొప్పవారు నూరు తప్పులుచేసినా బయటపడదుగాని బీదవారు ఒక చిన్న తప్పుచేసినా అది బ్రహ్మాండమగుట సహజమేకదా? ఇప్పుడు ఎక్కడపట్టినా సుశీలనుగూర్చే మాటలు.

పాపం చేసేవాళ్లకన్నా దాన్నిగూర్చి చెప్పుకునేవాళ్లదే ఎక్కువ పాపం. సుశీల గృహకార్యాలందు, పిల్లలపోషణమునందు యేలాటి లోపములేకుండా వదినగారి పనులన్నీకూడా తనేచేస్తుండేది. 'అదృష్టం బాగాలేనప్పుడు అంటిందంతా బొగ్గయిందట', సుశీలనుచూస్తే సావిత్రమ్మకేమో మెప్పులేదు.

సుశీల భర్తమరణించి నాలుగు సంవత్సరాలు అయింది. ఈ నాలుగు సంవత్సరాల్లో సుశీల ఇంట్లోవాళ్ళతో, బయటివాళ్ళతోకూడా కావలసినన్నిమాటలు పడింది. ఆమెలో ఏతప్పూ లేదు. ఆమె హృదయం చలించలేదు. లోకం ఏమనుకున్నా ఇప్పటివరకు సుశీల ఏపాపం ఎఱుగదు. అందరు ఆమెను నిందించడానికి ఆమె విధవయై జడవేసుకోవడం, బొట్టుపెట్టుకోవడం, పురుషులతో జంకకుండా మాట్లాడడం కారణాలు.

♦ ♦ ♦ ♦

రామమూర్తిగారి ఎదురింట్లో ప్రసాద్ అని ఒక యువకుడున్నాడు. అతనికి ఇటీవలనే భార్య మరణించింది. అతనంటే స్త్రీలందరికి హడలు. అతను స్త్రీలోలుడనీ, దుర్మార్గుడనీ ఆవూర్లో అంతావదంతి. సుశీల చాలా రూపవతి. ఆమె ఎక్కడికన్నా వెళ్ళినపుడు, మేడమీద వున్నపుడు ప్రసాదు ఆమెను వూరక చూచేవాడు. ఈ సంగతి గుసగుసలతోనే వూరంతా అల్లిపోయింది. సుందరమ్మ రహస్యంగా సావిత్రమ్మవద్దకువచ్చి ప్రసాదుకున్ను సుశీలకున్ను సంబంధంవుందనీ, ప్రతిరోజు వారు ఒకరినొకరుచూచి నవ్వుకోవడం తను చూచిందనీ, ఉన్నవీ లేనివి అంతా కల్పించి చెప్పింది.

'మట్టుమర్యాద మంటలో కలిసిపోయింది. న్యాయం అన్యాయం అసలులేదు. ఏమికాలం వచ్చింది. ఈ ఇంట్లో ఇక ఒక గడియకూడా వుండను' అన్నది సావిత్రమ్మ.

'ఏం వచ్చిందంతా?' అన్నాడు రామమూర్తి.

'ఏ వచ్చిందా? పిల్లలవాళ్ళం మర్యాదకులస్తులం. విధవలకంతా నాజూకు ముదిరిపోయింది. భర్తలు కావలసివచ్చింది. బయటికి తలపెట్టలేకుండా ఉన్నాను' అంది.

'కొంచం జాగ్రత్తగా మాట్లాడు' అన్నాడు రామమూర్తి.

'జాగ్రత ఏమిటి? లోకమంతా మీచెల్లెల్నిగూర్చి బాగా ఎరుగును. నేను, పొరుగింటావిడ ప్రత్యక్షంగా చూశాము. ఇక రహస్యమేమిటి? కావలస్తే ఋజువుచేయిస్తాను' అంది సావిత్రమ్మ.

'ఆలోచించి......సుశీలనా......పోనిలే నీవు వూరుకోరాదూ?' అన్నాడు.

'అల్లాకాదు ఈ సంగతి తేలిపోవాలి. నేను యిక సుశీలతో ఒకక్షణం వుండలేను. దాన్ని ఇంటినుంచి వెళ్లిపోనిస్తేనేగాని కాదు. మొదటినుంచి ఆమెను మనయింట్లో వద్దనిచెప్పాను విన్నారా? ఇప్పుడు ఫలానావారి చెల్లెలని ఎంత అపకీర్తివచ్చిందో తెలుసా?'

వీరి సంభాషణంతావింటున్న సుశీల 'అన్నయ్యా! ఇటువంటి అపకీర్తి నానెత్తిన పడుతుందని నేనెన్నడూ తలపలేదు. నేను పాపరహితనంటే ఇకమీరు నమ్మరు. వదినా! మీ మర్యాద కీలాటి లోపం రానివ్వకుండా కాపాడుకోండి. నేనే ఈ ఇల్లువదలి వెళ్లిపోతాను' అని చేతితో ఆరు సంవత్సరాల ప్రేమను పట్టుకుని బయటకువెళ్లింది సుశీల...

సుశీలకు తన బ్రతుకుమీద. రోతగల్గింది. ప్రాణత్యాగానికికూడా సిద్ధపడింది. ప్రేమలతమీది ప్రేమయే ఆమెను ఆత్మహత్యనుంచి తప్పించింది. యిక వారి జీవనమెల్లాగడుస్తుంది? ఆమెవద్ద ఒక్క కాని కూడలేదు. చేతిలో ఒక బంగారపుగాజుమాత్రం వుంది. యిక ఒంటిమీద మరేసొమ్ములులేవు. ఆ ఒక్క గాజు నష్టంమీద అమ్మేసి ఆ వచ్చినపైకంతో యిద్దరూ మద్రాసుకువచ్చి చేరుకున్నారు.

సుశీల మద్రాసుకువచ్చి తిరువల్లిక్కేణిలో ఒక చిన్నసందులో ఒక చిన్నగది రెండు రూపాయిల అద్దెకు పుచ్చుకుంది. భర్త మరణించినతర్వాతగాని, అందరు తన్ను నిందించునప్పుడుగాని ఆమెకు ఆమె సొగసుమీది శ్రద్ధతగ్గలేదు. ఆమె కిప్పుడు తన దేహారోగ్యాన్నిగూర్చిగాని, శరీరపోషణాన్నిగూర్చిగాని శ్రద్ధలేదు. ఆమెకు అన్నిటిమీద విరక్తిగలిగింది. ఆమెకు నిద్రాహారాలమీద చింతలేదు. కేవలం ప్రేమకోసరమే బ్రతికివుంది. ఆమె వారిరువురిపోషణార్థము సంపాదించుకోడానికి అక్కడక్కడ వంటలుచేస్తూ, కూలిపనులుచేస్తూ వుండింది. సుశీల ఈకూలి జీవనంలో ఒకటికాదు, అనేకకష్టాలు అనుభవించింది. ఆమె తన శరీరపోషణయందు శ్రద్ధమాని కృశించుచున్నను, ఆమె రూపమున్ను, వయస్సున్ను ఆమెను ఎక్కడ బ్రతకనివ్వకుండా చేశాయి.

♦ ♦ ♦ ♦

సుశీల మద్రాసుచేరుకుని ఏడు ఎనిమిది సంవత్సరాలు కావచ్చింది. ఇప్పుడు ఆమె ఒకరిండ్లకు వెళ్లి పనిచెయ్యడం మానుకున్నది. ఒక కుట్టుమిషన్ కొని అందుమీద చౌకధరకు అందరికి బట్టలు కుట్టిచ్చేది. ఈ వృత్తివలన కొన్నిరోజులు కొంతమట్టుకు ఒక మోస్తరుగా జీవింపగలిగింది. ఇప్పుడు ప్రేమకు పదమూడవ సంవత్సరం. శుక్లపక్షంనాటి చంద్రునివలె ఆమె దినదినాభివృద్ధిబెందుతూంది. రూపలావణ్యాల్లో తల్లికన్నా ఎక్కువ రూపవతి అయింది. బాలికాపాఠశాల్లో ఫోర్తుఫారం చదువుతూంది. చదువుయందు, రూపమందు,

తెనివితేటలందు ప్రేమయేమొదటిది. సుశీల తిరువళ్లిక్కేణిలో తమ నిర్వాహం సరీగా జరుగనందున మద్రాసుటవునులో కాపురంచేరింది. టవునులో కుట్టుటకు బట్టలు దొరికేవి. అందువల్ల వాళ్లకు అట్టేకష్టం లేకుండా దినాలు గడిచేవి. కాని కొద్దిరోజులకంతా వారి కొక క్రొత్తకష్టం ఏర్పడింది. అచ్చటివారంతా వీరినిగూర్చి విపరీతంగా భావించేవారు. వీరికెవ్వరు బంధువులుకూడ లేరా? అనీ, ప్రేమ ఆమెకూతురు కాదనీ, సుశీల ఆ పిల్లతో వ్యాపారంచేయడానికి వచ్చిందనీ అనుకునేవారు.

◆ ◆ ◆ ◆

క్రమంగా సుశీలకు కుట్టుపనిలో రాబడి తగ్గిపోయింది. యథాప్రకారం వారిని కష్టం, దుఃఖం వదల లేదు. సుశీలమాత్రం ఇంట్లోవుంది. తలుపుతట్టిన శబ్దము వినవచ్చింది. సుశీలవెళ్లి తలుపుతీయగా ప్రేమ ప్రత్యక్షమైంది.

‘ఏమి ప్రేమా! ఇంత త్వరగావచ్చావు? అప్పుడే బడి వదలిపెట్టారా?’ అన్నది సుశీల.

‘ఈరోజు అరగంట ముందువదిలేసినారు. చంద్రశేఖరంగారను ధనవంతులు మా స్కూలుకు లక్ష రూపాయిలు విరాళమిచ్చారట. వారు మాస్కూలు తనిఖీకి బొంబాయినుండి వచ్చారు. వారు మన కులస్థులేనట. ఈరోజు రాత్రి ఎనిమిది గంటలకు మనయింటికి వస్తామనిచెప్పారు. మనయింటి అడ్రసుకూడా తీసుకున్నారు’ అంది ప్రేమ. సుశీల ఈ మాటలనువిని భయాశ్చర్యములకు లోనైంది. తనలో ‘అంత ధన వంతులు మనయింటికి వచ్చుట మంచికో చెడ్డకో పాలుపోకున్నది. అన్నిటికి దేవుడేదిక్కు’ అనుకొన్నది.

రాత్రి ఎనిమిదిగంటలు. కారు శబ్దమయింది. కారులోనుంచి ముప్పది, ముప్పదిరెండు సంవత్సరాల లోపుగల యువకుడు లోన ప్రవేశించాడు. సుశీల వారికి మర్యాదతో కూర్చునుటకు ఆసనంచూపింది. తర్వాత తమబోటి ధనవంతులు మాబోటి బీదవారియింటికి వచ్చుటకు కారణమేమని వినయంగా అడిగింది సుశీల.

‘అమ్మా! మీరు అలా తలంపవద్దు, మీకు ప్రేమ ఒకర్తేనా కుమార్తె?’ అన్నాడు శేఖరం.

‘ఆ అవునండీ. అయితేనేమి’ అన్నది భయంతో.

‘అమ్మా! ఏమి భయపడవలదు, మీ కుమార్తెను నాకిచ్చి పెండ్లిచేయుదురా? అని అడుగ నేనిచ్చటికి వచ్చాను’ అన్నాడు శేఖరం.

సంతోషాశ్చర్యములతో కొంతవరకు ఏమి జవాబు చెప్పలేకపోయింది సుశీల. ‘అయ్యా మీబోటి వారు మావంటివారి బీదబాలికను పెండ్లియాడగోరుట మాయొక్క భాగ్యం. నాకేలాటి ఆటంకంలేదు. యిందుకు ప్రేమయొక్క అభిప్రాయంకూడ తెలుసుకొనవలెను’ అన్నది సుశీల. కొంతసేపు ఆలోచించి ‘అయ్యా తాము కోపగించుకొనరుకదా! నేనొకమాట అడుగ కోరుతాను. తాము ఇంత ధనాఢ్యులు, రూపవంతులుగా నుండి యింకా వివాహమాడకుండుటకు ఏమి కారణం?’ అన్నది వినయంగా సుశీల.

‘నాకు మొదట ఒక వివాహమైనది. ఆమె ఒక సంవత్సరం కాపురంచేసి మరణించింది. ఆమె మరణించింతర్వాత నాకు ఎవ్వరియందును ప్రేమగలుగలేదు. కాని మీప్రేమను చూచినప్పటినుంచి మనస్సు మనస్సులోలేదు. మీప్రేమను నాకిచ్చి పెండ్లిచేసినచో పెండ్లిచేసుకొనెదను. లేనిచో ఇక ఈ జీవితమందు మరి ఏ ఇతరస్త్రీని పెండ్లాడ జాలనన్నాడు’ శేఖరం.

ప్రేమలతకూడా అతనిని ప్రేమించియున్నందున ఏలాటి ఆక్షేపణలేక కొన్ని రోజులకంతా ప్రేమకూ, శేఖరమునకు మహా వైభవంగా పెండ్లి జరిగిపోయింది. కూతురూ, అల్లుడితో సుశీలకూడా బొంబాయికి వచ్చింది. తనలో ప్రేమయొక్క అదృష్టమునకు పరమానందం పొందింది సుశీల.

◆ ◆ ◆ ◆

సుశీల, బొంబాయికివచ్చి ఆరునెలలు కావచ్చింది. ఆమెకు కూలికి బట్టలుకుడుతూ స్వతంత్రంగా మద్రాసులో వున్న దినాలే బాగుండినవి. ఇప్పుడు ఆమె అనుభవించుచున్నంత కష్టము ఎన్నడు అనుభవించి యుండలేదు. ఎల్లప్పుడు విచారంతో ఓప్రక్క కూర్చుని ఉండేది. ఆమెకు అట్టే కఠినమైనపనులు లేక పోయినా అందరూ ఆమెను బానిసగాచూచేవారు. బయటికి షికారు వెళ్లేటప్పుడైనా ఆమెను పిలిచేవారు కారు. ఆమె జీవితంలో ఆమె ఇంతగా ఎప్పుడు బాధింపబడలేదు. ఆమెకు వారి అలవాట్లు, వారి పద్ధతులు ఏదీ నచ్చలేదు. ఆ ధనవంతుల గృహపంజరమునుండి ఎప్పుడు స్వతంత్రించి యుండగలనను దుఃఖము అధిక మవుతూ వుండేది.

◆ ◆ ◆ ◆

ప్రేమలతకు వారి పద్ధతులంతా త్వరలో అలవడిపోయింది. ఆమె వారితో కలిసిమెలిసి స్వేచ్ఛగా నుండుచుండెను. సుశీలకు క్రమంగా తినుఅన్నం ఒంట పట్టడంలేదు. రానురాను మనోవ్యాధిచే శుష్కించి పోవుచుండెను. సుశీలను ప్రేమతప్ప మరెవ్వరూ పలకరించేవారుకారు.

ప్రతిరోజు శేఖర్ రెండవభార్య ప్రేమను చూచుటకువచ్చే స్నేహితులకు లెక్కలేదు. ప్రేమలతకు ఎన్నో ప్రజంటేషనులు వచ్చాయి. ఒకసారి కొందరు స్త్రీలు ప్రేమను చూచుటకువచ్చారు. వారు భాను మతితో 'భాను! ఆ గదిలోకూర్చున్న ఆవిడెవరు? పిచ్చిదానిలాగా ఉందే' అన్నారు, సుశీలనుచూపి.

భాను కొంతసేపు ఏమితోచకుండా 'ఆ-ఆఆవిడనా! ఆమె మావదిన ప్రేమలతను చిన్నతనం నుంచి ఎత్తి పెంచినదాది. ఆమె ప్రేమనువిడచి వుండలేనందున మా వదినగారితోకూడా పంపారు' అంది భానుమతి మెల్లగా. ప్రక్కగదిలోనే కూర్చున్నసుశీల ఈ మాటలన్నీవినింది. ఆమెకన్నులు చీకటిక్రమ్మినవి. ఆమెకు అయిదునిముషములు స్మృతితప్పినది. కొంతవడికి తెప్పరిల్లి తనలో హా. ఈ ధనాఢ్యుల ఇంట్లో నా ప్రియపుత్రికప్రేమను ఇచ్చి నాప్రాణప్రదమైన ప్రేమనుకూడా పోగొట్టుకుంటిని. యిక ఈ ఇంట్లో నాకే మున్నది. ఆమె ఆ ఇంట్లో మరి ఒక్కక్షణం నిలువలేకపోయింది. సుశీల నేరుగా ప్రేమవద్దకు వెళ్లింది.

'అమ్మా! ప్రేమా! నీవద్దనుంచికూడా నేను వేరైపోతానని కలలోకూడ తలవలేదు. తల్లీ! ప్రేమా! ఎక్కడన్నా నూరేండ్లు దీర్ఘాయుష్మంతురాలవై సుఖంగా ఉండు. ఇక ఈ రోజునుంచి నీవు నీతల్లిని చూడవు ప్రేమా! నాకు సెలవియ్యి, నేను వెళ్లిపోతున్నాను' అంటూ ఆపుకోలేనిప్రేమచే ప్రేమను ఆలింగనం చేసుకుని తన్ను తెలియని రెండు కన్నీటిబిందువులు రాల్చింది.

దిగ్భ్రాంతిగా 'అమ్మా ఏమంటున్నావు, ఎక్కడికి వెడతానంటున్నావు. నీకిక ఎవరున్నా రమ్మా! నాకొరకు నీవెన్ని కష్టములకో ఓర్చి నన్ను ఒక గృహిణిగాచేసితివి. నన్నువదలి ఎక్కడికి వెడ తావు? నీవిక్కడే ఉండు'మని ఎంతో నిర్బంధించింది ప్రేమ.

కాని ప్రేమయొక్కమాటలు ఆమెను అచ్చట నిలపలేకపోయాయి.

'ఇక ఒక్కక్షణంకూడా ఈ ఇంట్లో ఉండజాలను.' అంటూ ప్రేమయొక్కమాటలు వినిపించు కోకుండా ఆ ఇల్లువదలి వెళ్లిపోయింది సుశీల.

◆ ◆ ◆ ◆

మధ్యాహ్నం మూడుగంటలనుంచి కాలు ఎక్కడెక్కడ అడుగు పెడుతుందో అక్కడికంతా నడచి వెడుతూంది సుశీల. ఎక్కడికి వెళ్ళవలయునో ఏమి చేయవలయునో ఆమెకేమితోచలేదు. సాయంత్రం

ఏడు ఏడున్నరగంటకు ఎక్కడెక్కడో తిరిగి (చౌపాతి) సముద్రం ఒడ్డుకువచ్చిచేరింది సుశీల. ఆకసమున మేఘమాలికలు ఆవరించాయి. గొప్ప వర్షము కురియునట్లున్నది.

'ఓ సముద్రుడా! నన్ను పిల్చుచున్నావా? నీవే నన్ను ఆదరించవలసినవాడవు. యిక నాకీ ప్రపంచంలో ఎక్కడా స్థలంలేదు' అంటూ సుశీల మెల్లమెల్లగానడుస్తూ నడుములోతు నీటిలోనికివెళ్ళింది. 'ఏమి యిక మణిగిపోవలసిందేనా? దూరముగానుంచిచూచిన సొగసుగానున్న ఈ సముద్రము యింత భయంకరమవుతున్నదేమి?' మరల నీటిలో యింకాకొంచం ముందుకు వెళ్ళసాగింది. క్రమంగా ఆమె తల మాత్రం అస్పష్టంగా కనబడుతూంది.

విలాసార్థము పడవలోవెళ్ళిన ఒకపురుషుడు వర్షభయముచే తిరిగి వస్తుండగా నీటిలో మునగనున్న సుశీలను చూచి తమపడవలోనికి ఎక్కించుకుని వడ్డునకు తెచ్చాడు.

'అమ్మా! మీరెవరు? ఇంతరూపముగలవారై ఉండి ఈ ప్రకారం నీటిలోమునిగి మరణింప తలచుటకు కారణం ఏమి'? అన్నాడు పడవలోని పురుషుడు.

'అయ్యా! నన్ను మరణింపనీయండి. నాకు ఈ జీవితంలో సుఖంలేదు. ఈ శరీరంలోంచి ఈప్రాణం వేరుకావడమే గొప్ప శాంతిసుఖము' అంది.

'అమ్మా! ఏ సంఘమర్యాదలకోసము మీరింత ఆత్మను, శరీరాన్ని, హృదయాన్ని పాడుచేసు కున్నారో, దేనియొక్క మరియాదను కాపాడటానికి మీరిప్పుడు ప్రాణత్యాగం చేసుకుంటున్నారో ఆసంఘం మిమ్మ ఉద్ధరించిందా? లేక మీరు మరణిస్తే అయ్యోయనంటుందా? మీబోటిస్త్రీలువారికి లెక్కలేదు'......

'అయ్యా! మీరెవరు చాలా తెలిసినవారులాగున్నారే' అన్నదిసుశీల.

'నేను సినిమాకంపెని డైరెక్టరును. మీరు మా కంపెనీలో పనిచెయ్యండి. మీజీవితము ఒకమోస్తరు సుఖముగా గడపవచ్చును' అన్నాడు.

'ఇన్నిరోజులు ఎంతో మానమర్యాదలతోను, ఆత్మశాంతితోను ఉన్న నన్ను స్టేజీమీదికెక్క మనెదరా? అసంభవము' అంది సుశీల.

'అమ్మా! బాగాఆలోచించుకోండి. మీయొక్కత్యాగానికి సంఘం హర్షింపదు. కేవలము మీజీవితము మాత్రం నష్టమగును. మీ రూపము, మీ కౌశలము మట్టిపాలగును. ఏ సంఘమర్యాదలకోసం మీ సర్వస్వం నష్టంచేసుకొని మరణిస్తారో ఆసంఘం ఎప్పుడైనా ఒకప్పుడన్నా మిమ్మ ఆదరించిఉన్నదా!' అన్నాడు.

'అయ్యా! ఎప్పుడులేదు అన్నది' గంభీరంగా సుశీల.

'అటువంటి దయావిహీనమైన సంఘంకోసం మీ పవిత్రమైన మానవజన్మము నెందులకు నష్టము చేసుకొనెదరు. కారు తయారుగానున్నది. వచ్చెదరా?' అన్నాడు ఆ పురుషుడు.

మారుపల్కకుండా సుశీల డైరెక్టరుతోకూడా వెళ్ళి కారులోకూర్చుంది. చూచుచుండగనే కారు అదృశ్యమయిపోయింది.

కొన్నిమాసముల తర్వాత పత్రికలలో పెద్దపెద్ద అక్షరములతో "బాల వితంతు" అను సినిమాలో హీరోఇన్‌గా ఆక్షనుచేసిన సుశీలాదేవినిగూర్చి శ్లాఘించి వ్రాసియుండిరి. బాలవితంతు సినిమా చూచిన స్త్రీ, పురుషులలో సుశీలను పొగడనివారు లేరు.

♦ ♦ ♦ ♦

శేఖరు తనటేబిల్‌పైన పడివున్న 'బాలవింతు' అను సినిమానుగూర్చి వ్రాసిన పెద్దపెద్ద అక్షరాలను చూచి తనకళ్ళను తాను నమ్మకుండా చదివినదాన్నే ఊరకచదువుతూ నిలుచున్నాడు చాలాసేపువరకు.

# ★ వేణుగానము

● శ్రీ అంగర వేంకటసత్యనారాయణరావు

మేధానిధులైనటువంటి కవీశ్వరులు, వేదాంత పారంగతులు, జగదవలోకనంచేసి ప్రకృతి వైచిత్ర్యాన్ని వేనోళ్ల కీర్తిస్తారు. రసాయన శాస్త్రజ్ఞులు తమ వైజ్ఞానికదృష్టితో జగత్తుని పరమాణు సముదాయంగా పరిగణిస్తారు. విశ్వవిపంచికాతంత్రీ నిస్వనంతో తమ మధురకవనాన్ని మేళవించి, అనంతానందం అనుభవించే రచయితలు మహోత్కృష్ట భగవత్సృష్టిని కీర్తిస్తారు. అనుభవంవల్ల సేకరించే ఖేదమోదాల గాధనుంచి భౌతికేచ్ఛకి అనుగుణ్యంగా ఉండే వస్తుసముదాయాన్ని సూక్ష్మదృష్టివల్లగాని లభింపచేసుకోలేం. ప్రాణిగణాన్ని పల్లవింపచేసే తుహినపాతాన్ని, భస్మీపటలంచేసే అశనిపాతాన్ని సమన్వయంచెయ్యడానికి ఎంతటి ప్రయత్నం అగుతుంది! జీవితాల్లో గ్రహపాటువల్ల కలిగే నూత్నమైనట్టి, అపరిచితమైనట్టి అనుభవాలు శ్రీ గృహంలో సూత్రాలకి మల్లె వేరుపరచడానికి వీల్లేకుండా ఉంటాయి. వస్తువులు ఎన్నడూ అవిరుద్ధంగా ఉండక విపరీతంగా గోచరిస్తాయి. గోమయజనితం అయినా సుగంధపరిమళాన్ని విరజల్లే గులాబి చిట్టచివరకి మట్టిని కలుస్తుంది. తన ప్రచండతాపంచేత దృక్పథానికి తగిలిన ప్రతి వస్తువులోను నిప్పుకణులు రేకెత్తించి చిట్టచివరకి దగ్ధంచేసే లోకభయంకరుడైనప్పటికీ, సూర్యుడే జీవితవల్లికి పాదులు కల్పించి ప్రాణాధారకమైన వసంతపావనోదారాన్ని చేకూర్చె ఉగాదికి దోహదమయ్యేడు. కాని అతడే తన దర్శనంవల్ల జగచ్చిత్రావలోకనానిమగ్నుడైన జీవికి ఒకప్పుడు విసుగు పుట్టిస్తాడు. అందువల్ల యీ తాపతప్తమైన జగదంతరంలో కళ్ళకింపైన ప్రదేశం ఉంటుందన్నా ఏ వ్యక్తీ మోజుపడదు. కాని జీవనపథాన్ని సుప్రసూనాల్తో నింపుకొనే అందుకు జీవులు అనుభవించే ఆటపాటలు లోకబాంధవుడి కొలువులో గావిస్తారు. కాని గాఢతామసి గర్భంలోనా?

దుష్టసేనానివహాల్ని పారదోలి, ప్రపంచంలో శాంతిని నెలకొల్పి, తన వేణుగానంచేత జగత్సజ్జనుల హృదయాల్ని పల్లవింపజేసే నిత్యకిశోరమూర్తిని లోకం అంతా అనునిత్యము ఆరాధిస్తూ ఉంటారు. సుహృజ్జనులైనటువంటి నిర్భాగ్యుల్ని ఉద్ధరించేటంతవరకు యీయన తన వేణుగానాన్ని ఆపడు. ఈయన్నిగురించి అనేకమంది అనేకవిధాలుగా అనుకుంటూంటారు. కాని ఉదారస్వభావులుమాత్రం, యీయన జగజ్జన సంరక్షణార్థం సర్వదా విశ్వవిహారం చేస్తూంటాడని సంపూర్ణవిశ్వాసం కలిగివుంటారు. యీయన ఉనికిని గురించి వితర్కించుకోనేకన్న కల్మషరాహిత్యమైన హృదయంతో విశ్వపర్యటనం చేసినట్టయితే అతని వేణుగానం వినిపించని స్థలం ఉండదు.

ఈ మోటుప్రపంచంలోనే చిత్రవిచిత్రమైనవెన్నో ఉద్యానవనాలున్నాయి. నిమ్నోన్నత ప్రదేశాల్నించి, ఉద్యానవనాల ప్రక్కనించీ ప్రవహించే నిర్మల నదీనదాల్ని సముద్రంలో కలిపి ఆనందదాయకంగా గోచరించే జగత్తు ఒకప్పుడు అతి భయంకరంగాను, నాగరికతావిహీనంగాను పాండు శుష్కితదేహంతో గోచరిస్తుంది. వసంతకోకిలాలు ఆలపించే గీతాలు దేన్నిచెప్తాయి? వర్షపాతంవల్ల కీకారణ్యాల్లో వినవయ్యే హోరు దేన్నిగురించి? లభ్యమైన మత్స్యాల్ని నౌకలో పోకపోస్తూ జాలరి ఆనందంతో ఆలపించే గీతం

దేన్ని స్ఫురింపజేస్తుంది? యివన్నీ నిశ్చయంగా ఆయన వేణుగానంలోని కళలే. ఆయనే పై జీవరాసుల దివ్యగీతాలాపాలకి మూలాధారం. పాలికాపుల మోటు శృంగారానుభవాలు, పచ్చిక ప్రదేశాల్లో వినవయ్యే తురగాల రింఖధ్వని, జలజలబారే సెలయేటి కలారవము, కళ్లకింపైన ఆకాశపు నీలిమబ్బులు, మందహాసపూర్వకంగా ఒకరికొకరు చేసుకొనే ప్రణామాలు మొదలైనవే నిత్యకిశోరమూర్తి వేణువుమీద ఆలపించే దివ్యగీతాలకి కథావస్తువులు. యీ అపూర్వగానాన్ని ఆనందించడంకోసం నోరెరుగని పశుజాతికూడా మహా ఉబలాటపడిపోతుంది. ఎంచేతనుకున్నారు? అమృతమయమైన యీ గానం ప్రతి హృదయాన్ని ఆనందపరవశం చేస్తుంది. ప్రకృతిలో ఆనందాన్ని చేకూర్చే ప్రతివిషయం యీ వేణుగానం మూలాన్నే సంప్రాప్తమైందన్నమాట. లోకంలో వాక్చాతుర్యంగల పలుకుబడిదారుడు సంతోషం అనుభవిస్తున్నప్పుడే, ప్రీతికరమైన వస్తువుని బాలుడు ప్రేమతో చూసినట్టు, యితరులకికూడా తన సంతోషాన్ని పంచుతాడు. పదవిన్యాసం ఎరుగనివాడు విశ్వనాట్యరంగంలో నృత్యంచేస్తే అసందర్భం కాక తప్పుతాడా? జగన్నాట్యరంగంలో ప్రదర్శింపబడే నృత్యాన్ని చూడ్డానికి వచ్చే ప్రేక్షకవర్గంలో రసజ్ఞులు కాని కొందరు అనుభవవిహీనంగా మళ్లిపోతారు. అయితే టక్కరితనాన్నిగాని, యింకేవిషయాన్నిగాని యీ అద్భుతాన్ని చూసిన వాళ్లల్లో కొందరు అనుభవవిహీనంగా మళ్లిపోవచ్చు. ఇంకా యిలాంటివారెందరో ఉండవచ్చు. కాని, నిత్యకిశోరమూర్తి వేణుగానంచేత ఉత్సాహపూరితమనస్కుడై అంజలి ఘటించని వ్యక్తి ఎవడుంటాడు?

కాని ఒకొక్కప్పుడు ఆ లీలామానుష విగ్రహుని వేణుగానకళలు వింత పోకడలకి తావొసంగినపోతూ ఉంటాయి. పాపం! అవి పూర్వంమాదిరిగా హాయిని చేకూర్చేటందుకు బదులు హానిని చేకూరుస్తాయి. అప్పుడు జగమంతా మానవమాత్రుడి ఊహకతీతమైన దుస్థితికి తేబడుతుంది. పెనుగాలిచే పెళ్లగింపబడే మహావృక్షాలు, సముద్రంలో తుపానుచే కలిగే హోరులో కొట్టుకొనిపోయే నావలు, మిక్కిలి భయావహమైన ఉఱుము, మెరుములతోటి నిండే మేఘ నిబిడీకృతం అయిన కాఱుచీకట్లు క్రమ్మి, జగదంతరంలో భీభత్సం కలిగించే దృశ్యాలు, తుపానులో చెలరేగి ప్రవాహగమనంలో మార్పుచెంది వేరువేరు దిక్కులై పారే నదులు మొదలైన విధ్వంసాల్ని కలిగి జగత్తు భయానకమై ఉంటుంది. ఆలాంటి దృశ్యాల్ని చూడ్డంతోటే యిప్పుడీవిశ్వం ఆయన కోపానలంలో ఒక యింధనమైపోయిందని అనిపించక మానదు. యీ సమయంలోనే భూమాత తన బిడ్డలమీద ఆగ్రహం వహించి కన్నపుత్రులని కనికరంలేకుండా తన మృదుతరహస్తాల్లో దాచి యుంచిన నఖాల్తో ఆవేశపూరితంగా ఆ శిశువుల్ని రక్కి చంపేయడానికి కుతూహలపడుతుంది. స్వభావరీత్యా చల్లదనంకలిగి ఉన్నా అపారసాగరం విశ్వాన్ని ముంచెత్తడానికి ప్రయత్నిస్తుంది. ఇంతెందుకు ప్రాణిగణాల్ని పరమపవిత్రంచేసే పావకుడుకూడా తన అనంతముఖాల్లోంచి నిప్పుకలు విరజల్లుతూ లోకుల్ని భస్మీపటలం చేస్తాడు. ఏ విషయమైనా సరే స్వభావరీత్యాకాని, మేలులేక కీడుచేసే ఉద్దేశంతోకాని, తన ఆత్మప్రేరేపణపరంగా కాకుండా, అన్యథా పరిస్థితుల్నిబట్టి మార్పుచెందుతూ వుంటుంది. ఇల్లా భగవంతుడు తన గానంలో మార్పుచేసుకున్నప్పుడే సుఖంగా పుచ్చేకాలం అయినా, సంతోషదాయకాలైన వస్తుపరిస్థితులైనా, అవి కష్టాలన్నిటికీ కారణభూతాలైపోతాయి పాపం! అలాంటప్పుడే శృంగారచేష్టల్లో ఓలలాడే కాముకీకాముకుల్ని మృత్యుదేవత ఎడబాటుచేస్తుంది. ఇంకా వివాహమంటపాలమీదికి ఎగబ్రాకి వధూవరుల్ని వేర్పరుస్తుంది. చూశారా! ఆ లీలామానుషవిగ్రహుడు మృత్యువుకెంత అధికారమిచ్చి సత్కరిస్తాడో ఒకప్పుడు.

ఇదేసమయంలో ఆప్తమిత్రులు పరమశత్రువులౌతారు. ఒక జీవి యింకో జీవిమీద పగతీర్చుకోడానికి ప్రయత్నిస్తుంది. ఇంతెందుకు! తల్లిగర్భంలో ఉన్న శిశువుకూడా తల్లిప్రాణాలుతీసి బైటపడ్డానికి ప్రయత్నిస్తుంది. అంచేత 'అతఁడు కనుమూయ నంతయు నణగిపోవు' అన్నట్టు ఆయనికి కొంచెం ఏమరుపాటు కలిగిందంటే లోకులందరికీ ప్రాణాలు పిడికెట్లోకొచ్చాయన్నమాటే. అందువల్ల జగత్తుకి సంభవించే విపత్తు యింత అనడానికి అవకాశం ఉండదు. ఇకాయనకి కోపం వొచ్చిందంటే వేరే చెప్పాలా? ప్రపంచాన్నంతట్నీ తల్లడిల్లచేసేడన్నమాటే. ఈ సందర్భంలోనే ప్రాణికోటికి అతడంటే మహాభయం. జీవితంలో అవినాభావసంబంధం కలిగివుండే సుఖదుఃఖాల పోరాటంలో తదనుభవజ్ఞుడైన జీవి నిర్హేతుకంగా దుఃఖాల్నే దృగ్గోచరం చేసుకోవడం. ఎపుడో ఆకస్మికంగా సంభవించే మృత్యువుని తల్చుకుని హృదయదౌర్బల్యంచేత దిగజారిపోవడం మొదలైనవి నిత్యకిశోరమూర్తి చెయిదాలే అని అసందర్భంగా ఊహించుకోవడమే. ఆయన్నిచూసి జనానీకం దిగులుచెందడానికి హేతువు. జీవితసౌఖ్యాల్ని, జీవనభారాల్ని త్యజించే మహనీయులుకూడా అనుభవించక తప్పని సరి అయినప్పటికీ, శాస్త్రరీత్యా అత్యధిక సుఖదుఃఖానుభవాల్లో ఉండే సాధకబాధకాల్ని చూడనైనా చూడక పోతారు. ఈ సందర్భంలోనే ఆత్మజనితం అయిన సద్భావపుంజాన్ని విశ్వసించనివాడు నిజంగా తన పెన్నిధికి మహాపరాధం కావిస్తున్నాడన్నమాట!

జీవితపరిణామ రహస్యంతో తృప్తిపొందని మనస్సు కొన్ని ముహూర్తాల్లో జీవితంలో ఉద్భవమయ్యే విచిత్రానుభవాల్ని ఆశిస్తూవుంటుంది. జీవితంలో ఆనందదాయకమైన ఘట్టాల్లో సౌఖ్యం అనుభవిస్తూన్నప్పటికీ నిర్భౌతికజీవితాన్ననుభవిస్తూన్నట్టూహించుకుంటే మనకి, అనేకవిధాలుగ విశ్వవిహారంచేస్తూన్నవాళ్లు కాలప్రతి పరిభ్రమణంలో మళ్లీ స్వస్థానికి చేరుకుంటూన్నట్టు స్ఫురిస్తుంది. ఈ అనుభవమే ఒకప్పుడు ఆనందదాయకంగానూ, ఇంకో అప్పుడు మహాభయంకరంగానూ ఉంటుంది. కాలసాగరంలో ప్రయాణం సాగించే జీవితనౌక ఎవ్విధమైన ఒడుదుడుకులు లేకుండా సాగిపోతుందని విజ్ఞానం ఉద్ఘోషిస్తుంది. కాని నిత్యజీవితానుభవాల్నిబట్టి ఆలోచించినట్టయితే జీవనపథంలో ముప్పు ఉండకుండా ఉండదు. ఈ విషయం వైజ్ఞానికదృష్టికి అగోచరం. అంచేత నిత్యజీవితానుభవాల చర్చలో అంతరాత్మ వైజ్ఞానికవాదాన్ని గర్హించడమే కాకుండా యీ అనుభవాల్ని పురాణరీత్యా, కళాశాస్త్రరీత్యా ప్రపంచానికి విప్పిచెప్తుంది. ఈ విషయంలో విజ్ఞానం చెప్పేదంతా చాలా మందంగా ఉంటుంది. భౌతికసంబంధం అయినప్పటికీ జీవితంలో రక్తం వుడుకెత్తించే యీ అనుభవాల చర్చ అంతా తాపీగా ఆలోచించతగ్గదా? జీవితం, గమ్యస్థానాన్ని చేరేవరకూ ఏ అడ్డూ లేకుండా ఒకేరీతిగా సాగిపోతుందని చెప్పే విజ్ఞానము జీవితంలో పెఠిల్లని బ్రద్దలయే అగ్నిపర్వతాలున్నాయని గుర్తించలేదు కాబోసు! మండు వేసంగిలో ఎండనిప్పులు కురుస్తూన్నప్పుడు, పర్వతాలు సైతం బద్దలౌతూన్నప్పుడు, ప్రచండభాస్కర తాపాన్ని భరించలేక వసుంధర పెఠిల్లని బద్దలై కోట్లకొద్దీ జీవరాసుల్ని తన గర్భంలో విన్యస్తం చేసుకుంటూన్నప్పుడు, జీవితానుభవం ఎల్లా ఉంటుందో విజ్ఞానికి తెలీదు? జీవితంలో సంభవించే ఒడుదుడుకులు కావూ యివి? నిత్యకిశోరమూర్తి గీతాల్ని వేణువుమీద ఆలపిస్తూ వేసే కళలే భూమికి జారి యీ వివిధానుభవాల్ని ప్రాపంచేస్తూంటాయి. ఒక్కొక్కసమయంలో తన విలయతాండవానికి అనుగుణ్యంగా ఉండేటట్టు చేసే వేణుగాన ఫలితంవల్ల జనానీకానికి మహాభయంకరానుభవాలు సంప్రాప్తమౌతాయి. కాని ఆ మహనీయుడు యీ బాధోపశమనంకోసం తన మురళీమీద పంచమస్వరం పట్టి జగజ్జనుల హృదయవిపంచికలలో యీ మృదులస్వరాన్ని మేళవించి అమృతం చిందుతాడు.

# జీవిత నాట్యము

శ్రీ ఉమర్ అలీషా

గడిచిపోయిన జీవిత కాలనాట్య
రంగమున చేసినట్టి నర్తనమునందు
ప్రతియడుగు క్రింద ముండ్లె గన్పడుచునుండె
ప్రతినిషిద్ధ వాతావరణ తతియందు
చీమలె పట్టుకొనుచుండె నేమొగాని
శాంతియొక్కడిదింక దిగంత దృశ్య
మైన సౌందర్యముల లీలమైన తెరల
చాటు మాటున బ్రతుకను నాటకాంత
రాగమెత్తి పాడుచు యాను రాగరసవి
శేషవాహిని హృదయ సంక్షిప్త భూము
లందు పారించి ప్రేమ రాజ్యముల నేల
ఏది యవధాన మీ దగ్ధ పానపముల
ప్రోల సుడిగాలి ముంగల బోర్లవడ్డ
శూన్య భాండంబు ఇదియేరు చూడగలరు
నెచ్చెలుల పొంత ప్రాంతవ నీవిలాస
లాలసంబుల వెన్నాడి లాస్యహాస
భాసమానాల ప్రొద్దులు మోసులెత్త
బుచ్చుటకు నీ ప్రకృతి తోడు వచ్చుమాట
లేకపోయెను రంగవల్లికల యందు
ముగ్గులుంచి నిగారంపుముత్తె సరుల
క్రేవలందువసంత వాకిళ్ల యందు
పచ్చతోరణములఁ గట్టి పళ్లెరముల
హారతి యుషస్సునకు నిచ్చె అంజలిని ఘ
టించి స్వాగతమిచ్చి యర్థించి కురుల
నిరుకులను గ్రాలు తలబ్రాలు విరుల గురియ
వాసనల దోఁగి వలపులువాలు విరియ
నవ్వులను దేలి జీవిత నాటకాంక
మును చతుర్థాంకముగఁ జేయుటనునది గన
లేదు ముంగిళ్లు ముసుగులు లేవనెత్తి
యిరులకాటుక పట్టి కత్తెరల నిరికి
పరువులెత్తి రసస్వరూపముల డాసి
వాసిమెయి పాలయల్కలం దోసిళులను
బోసి బతిమాలి మోము మోములను జేర్చి
వడ్చికన్నీళ్లు దుడిచి యేమేమొ బాస
లాడి వగలాడి వేడుకయాగడముల
కేసి కన్నెత్తి చూడలేదాసమాత్ర
ముండిపోయెను పగలిన గుండెలందు.

## ★ ఉపదేశం ★

హృదయాన్ని కరగించి సామాజిక జీవితాని కళ్ల ఎదుట కల్పింపజేసే ఒక కమనీయ స్వప్న కథానిక.


— శ్రీ —

పిల్లలమఱ్ఱి

వేంకట హనుమంతరావు

(సాధనసమితి)


కలలు నాకు సామాన్యంగా రావు. వచ్చినా మేల్కొనే టప్పటికి ఎంత ప్రయత్నించినా జ్ఞప్తికి వచ్చేవి కావు. ఆరోజు వచ్చినకలను అదేమి చిత్రమోగాని మరచిపోలేకపొయ్యాను. కలలో కలిగిన ఆనందాన్ని గాని దుఃఖాన్నిగాని ఇతరులకు చెప్పితేనే మనస్సుకు తృప్తి. కనుక నేనుకూడా చెబుతున్నాను. మధ్యాహ్నం 3 గంటలకు మా సంఘసభలో 'స్త్రీలు వారి నాగరకత' అనే అంశాన్నిగూర్చి నే నుపన్యసిస్తూ వుండగా ఒక ముసలి బ్రాహ్మడు సభలోనుంచి నన్ను పిలిచాడు. పిలవంగానే సభవారి ఆజ్ఞ తీసుకుని వెళ్లాను. ఆ బ్రాహ్మడు నన్నొక నిర్జన ప్రదేశానికి తీసికెళ్లి అబ్బాయీ! నీ ఉపన్యాసం విన్నాను. స్త్రీ ప్రపంచం నీకు అపరిచితంలాగ వుంది. నామాట ప్రకారం చెయ్యి. నీకు తెలుస్తుంది! అన్నాడు. నే నాశ్చర్యంతో 'సరే' నన్నాను.

'తూర్పు తిరిగిచూడు. ఏం కనపడిందో చెప్పు'అన్నాడు. నా దృష్టిని ఆదిక్కుకే ప్రసరించాను.

ప్రశాంత వినీలాకాశంలో మినుకుమినుకుమనే నక్షత్రసమితి మధ్య రేరాజు. కొండచరియల్లోనుంచి, గులకరాళ్ల మీదుగా గలగలా ప్రవహిస్తున్న సెలయేళ్లు, కొండ సందుల్లోజనించి, క్రింద సెలయేళ్లల్లోకి వొంగి, వాటితో కలసిపోతూన్న లతల్లో కలవకండా అక్కడే నిలుచున్న మృదులతకూనలు, సెలయేళ్లతో కలసి పయనమైపోతూ కొన్ని గులకరాళ్లకూ, ముళ్లమండలకూ చిక్కుకుని చివికి నల్లబడిన తీవలు, సెలయేళ్లతో బడకండానే ప్రవాహాలదరిదాపుకు వచ్చి కూడా అట్టే ఆగిపోయి గట్లమీద నిలబడిన లతలు.

'అబ్బాయీ! నీవు చూస్తున్న ప్రవాహాలన్నీ ప్రపంచంలోని పురుషులు. లతలన్నీ స్త్రీలు. ఆ మృదులతకూనలు పసిపిల్లలు. సంసారసుఖమనుభవిస్తూ దుష్టుల దుండగములకు గురియైనవే ఆ నల్లబడిన తీవలు. సంసారసౌఖ్యమనుభవిద్దామని సంతోషంతో గట్లదాకా వచ్చి గులకరాళ్లను చూచీ, ముళ్లమండల్ని చూచీ కుమిలిపోతూన్న వారిని చూచీ, భయపడి సంసారంలోకి దిగనివే ఆగట్లమీద ఆగిపోయిన లతలు!' అన్నాడు ప్రక్కనేవున్న ఆ బ్రాహ్మడు. నేనట్లాగే వింటూ నిలబడ్డాను. 'పైన సంచరిస్తూన్న రేరాజును చూశావూ? అతడు నీకూ నాకూ నిర్మలంగా సంచరిస్తూ కనబడినప్పటికీ వివిధతావుల్లోవున్న ఆ లతలకు రకరకాల భావాలు కలుగజేస్తాడు. నువ్వు గమనించు ఇంకా,' అన్నాడు. అనంగానే నే నావేపు

భాషా నాకబ్బింది! ప్రవాహాల్లో కలసిపోతూన్న లతల్ని, రేరాజును చూశాను. ఆ లతలభావాల్ని గ్రహించే శక్తి నాక్కలిగింది! అవి స్తోత్రం చేస్తున్నాయి. రాళ్లల్లో మండల్లో చిక్కున్నతీగెలు రేరాజును దూషిస్తున్నాయి. గట్లమీద నిలచిపోయిన లతలు ఆ రేరాజు యేలుబడిలో వుండలేమని తహతహలాడుతున్నాయి. మృదు లతకూనలు ఆవెన్నెల్లో సుఖంగావుండి ఆడుకొంటున్నాయి. చూస్తూవుండగానే చల్లని గాలి మామీదుగా పోయి ఆతీవల్ని తాకింది. 'ఈ మారుతం లతల్లో ఎన్నిమార్పులు కలుగజేస్తుందో చూడు' అన్నాడు బ్రాహ్మడు 'ఏమిటీగాలి?' అన్నాను. "ప్రపంచంలో 'నాగరకత'అని అంటారు దీన్ని!"అన్నాడు. ఈ గాలి వెళ్లి ఒక ప్రవాహంలోవున్న తీగెను వేరే ప్రవాహంలోకి నెట్టింది. గట్లమీదవున్న తీగెల్లో కల్లోలం కల్గించింది. ఆగాలి సహాయాన్ని స్వీకరించి కొన్ని ప్రవాహాల్లోకి దూకినై. మరికొన్ని వెనుదీసినై. జన్మస్థానంలో నిలచిపోయిన లతకూనలు చల్లగాలుల్లో ఆడుకుంటూ ఎట్టి సంచలనంలేకండా వున్నాయి. 'చూశావుగా నవనాగరకత! విడాకు లివ్వడం మొదలైన ఫ్యాషన్లు?' అన్నాడా బ్రాహ్మడు. 'ఆ లతల్లోకి జాగ్రత్తగా చూడు' అని రెట్టించాడు. చూశాను.

ఆ లతల్లో అక్కడక్కడ కొన్ని పూవులున్నాయి. అవి అనేక రంగుల్లో విరాజిల్లుతూవున్నాయి. ఎంతో అందంగావుండి ఆనందాన్ని చూరగొంటున్నాయి. ఆకుపచ్చ తీవల్లోనుంచి దోబూచులాడుతూ వున్నాయా ప్రసూనాలు. వాటిని నాకు తీసుకుందామనిపించింది. నా ఊహను గ్రహించే కాబోలు అతను 'తెంపబోకు. ఆ పూలకోసమే ఆ లతలంత అవస్థపడుతున్నాయి. లతలకు వాటిమీద ఎంతో ప్రేమ. ప్రవాహాల్లోకలసి పయనమౌతూన్న లతలకు ఫలితం ఆ ప్రసూనాలు. అవే సంతానం! ఈర్ష్యా ప్రపంచాన్ని చూట్టానికి వెరచి లతల్లోనే అణగియున్నై. తమ ఆనందాన్ని చుట్టూవున్న లతలక్కూడా పంచుదామన్న బయటికివచ్చిన కుసుమాలు భగ్నమనోరథలై నిలిచి నిశ్చేష్టవోయి చూస్తున్నై. అబ్బాయీ! ఒకరి ఆనందానిని చూచి సహించలేదు ప్రపంచం!' అన్నాడు. ఆ లతల్లో గుసగుసల్ని విన్నా నాకావిధంగానే తట్టింది. వాటి భాష నాకలవడింది గనుక అవి అనుకుండే విషయాలు తెలుసుకున్నాను.

'కొండ సందుల్లోనే నిలిచిన లతలు ప్రవాహాల్లో కలవడానికి తగినపాడవు పొందినా అలా కలవకుండా వున్నాయనీ, కలవడానికని పోయి గట్లమీదే నిలబడిపోయిన వెందుకోయనీ, నల్లబడి రాళ్లల్లో చిక్కున్నవాటిని గూర్చి ప్రవాహాల దేమీ తప్పులేదు; ఆతీవద్దే తప్పు; తమతమ ప్రవాహాల్నివదలి వేరే ప్రవాహాల్లో కలసిపోదామని ప్రక్కకు తప్పుకొని రెంటికీ గాకుండా చెడిపోయినవనీ, ప్రవాహాల్లో కలసి పయనమౌతోన్న లతల్లో కొన్నింటిని ప్రవాహమధ్యలోనుంచి పోకుండా పక్కగుండా పోతున్నై అనీ, ఐక్యతాట్టే వున్నట్లు అగుపించదనీ, ప్రవాహమధ్యంగా పెనగిపోతూన్నా వాటికి ఫలం దక్కలేదనీ లతల్లో లతలు గుసగుసలు.'

'విన్నావా లతల రహస్యాల్ని? ఒకరి విషయం మన కెందుకని వూరుకోదు ప్రపంచం! ఒకరికొకరికి సరిపడదు. ఈర్ష్య! ఇంతాజేస్తే సుఖంగావున్న లత లెన్నివున్నాయో చూశావా? లోపమనేది ప్రతిదానికీ వుంది. వున్నా తమ లోపాల్ని చూసుకోకండా ఇతరుల లోపాల్ని చూచి వెక్కిరిస్తాయి. వాటి మాటలు విన్నావు కాని ఇక వాటి చర్యలు పరికించు'అన్నాడు. వాటి మాటల్ని వినేటప్పటికి నా కేదో విధమైన అసహ్యం పుట్టింది. నా చిత్తవృత్తిని గ్రహించి అన్నాడా బ్రాహ్మడు 'చూశావుగా అబ్బాయి!

ప్రపంచమంతా ఇంతే! ఈ ప్రపంచంలో తలయొగ్గి తనదారిన పోయే వాడివికాదు రోజులు. అన్యాయము, కృత్రిమము, అమర్యాద, అసత్యము తనసొత్తుగా కలవారే మహామహులు. కాని పరలోకంలో వారికి స్థానమే శూన్యం! ఇట్టి ప్రపంచంలో నుంచి తప్పించుకునే మార్గం వేరేలేదు.'

ఈ మాటలు వినేటప్పటికి నాకు కళ్లల్లో గిర్రున నీళ్లు తిరిగినై. దీనంగా బ్రాహ్మణ్ణి చూస్తూ పరమావధి ఏమన్నట్లు మోకాళ్లమీద నిలుచున్నాను. పాపమతను నన్ను లేవనెత్తి 'ఆ ప్రవాహాలెటు పోతున్నవో చూడు'అన్నాడు. అవన్నీపోయి ఓపెద్ద సముద్రంలో కలసిపోయినై. ఆ లతలన్నీ వాటితో సహా ఆనీళ్లల్లోకలసి ఎటుపోయినవో! నిర్వర్ణించి చూశాను. కొన్ని ద్వీపాలు అగుపడ్డాయి. వాటిల్లో ఎవరో-దేవతల్లాగ వున్నారు. పూల పాన్పులపైన ఆడుకుంటున్నారు. ప్రక్కనేవున్న బ్రాహ్మడు 'అబ్బాయీ, ఆ ద్వీపాలే స్వర్గలోకం! దాంట్లో ఆడుకుంటూన్నవాళ్లే ప్రపంచంలో సుఖంగా సంసారయాత్ర సాగించి సత్ప్రవర్తనులై సంచరించిన మహానుభావులు!' 'అయితే ప్రపంచంలో అన్యాయ అసత్యప్రవర్తనులేమైనారు? వారి స్థాన మెక్కడ?' అన్నాను. జవాబు రాలేదు. ప్రక్కకు తిరిగి చూశాను. బ్రాహ్మడులేడు! ఆ ద్వీపాలవేపు చూశాను. అవీలేవు! ఇంతలో వులిక్కిపడిలేచాను. చూచుకుంటే నా పక్కమీద నే నున్నాను.

# విశ్రాంతి

మున్నెవ్వంగు రచింపనట్టి, రసికామోదంబులౌ కావ్యముల్
మిన్నుఁ ముట్టగజేయు నీ ప్రతిభ .....ఏమేమో సగర్వంబుగా
ఎన్నోఆశలు పల్లవించె అవి యెన్నేనిఁ నిరాశాశ్రులై
మన్నైపోయెను గాదె ఓ కలమ? ఈ మాత్రానికే ముర్సితో?

ఏకరఝురీ ప్రవాహమున ఎత్తిన హస్తము దింపనీక అ
స్తోకమహత్వ కావ్యరస స్ఫూర్తివహించెడి వృత్తిమాని నే
డీ కుటిలత్వమూని పలిటీలను గొట్టుచు అస్తమింపగా
నీ కవనమ్ము కీర్తి పయనించెను వెంటనె నాకవీధికిఁ

మధురసభావ సూక్తి మటు మాయముజెందెను కావ్య కన్యకే
బధిరతగూర్చినావు తుది వందనమాయిది? తెల్గుసీమసీ
విధి క్షుభితాత్మజేసి, మము వీడిలు మింతలా; ఆంధ్రవాఙ్మయో
దధినిమధించకే పరమ ధామము జేరితివేమి కర్మమో??

'ఎన్ని నూతన మంగళ కృతిసుమముల తెలుగు తల్లికి వడినంపదెత్తు' వనుచు
తలచుచుండగ నీమది వలచినట్లు శాశ్వతంబగు విశ్రాంతి సంభవించె.

—బూ. రం. రావు.

# వింత వింతల ప్రపంచం

'వర్షం రాకడ, ప్రాణంపోకడ తెలియదు' అని మనలో సామెతవుంది. ఏకొన్ని నిమిషాలో ముందుగా తెలుస్తుంది వర్షం వస్తుందన్నా, ప్రాణం పోతుందన్నాను. కాని జంతువులు ప్రాణంపోవడాన్ని కొన్నిగంటలు ముందుగా తెలుసుకుంటాయిట. వాటి ఆప్తులు ఎవరైనా వుంటే, వాళ్ల చావుకూడా తెలుసు కుని చెబుతాయిట అనేకవిధమైన చేష్టలచేస్తూ. ఇందుకు నిదర్శనంగా, టురిన్ పట్టణంలో నాటకమాడుతూ వుంటే, నాటకశాల కాపలావాడు పెంచుకుంటూవున్న ఒకమేక, దానిపిల్లలు తాళ్లుతెంపుకుని ప్రక్కగా ఎక్కడికోవెళ్లి దాగుకున్నాయిట. అవి వెళ్లిపోయినట్టుగానే కొన్ని గంటలకి ఆ శాలఅంతా తగులబడి పోవడమూ, కొంతమంది చచ్చిపోవడమూ జరిగింది.

ఇంతకన్నా విచిత్రం ప్రొఫెసర్ ఎర్నెస్టో బాజానో అనే ఆయన ఒక కుక్కని పెంచుతూ వున్నాడు. ఆ ప్రొఫెసరు కుమారుడు ఏదో అపాయంలో అకస్మాత్తుగా చనిపోయాడు. అతడు సాయం కాలం చనిపోతాడనగా ఆకుక్క ఉదయంనుంచీ ఏడుస్తూనే వుందట. ఇదేకాకుండా చుట్టుప్రక్కల ఆప్తుల విషయంలోకూడా ఆకుక్క అలానే చెబుతోంది. జంతువులయొక్క యీశక్తిని చూచి శాస్త్రజ్ఞులు ఆశ్చర్య పోతున్నారు.

♦ ♦ ♦ ♦

సీటిల్ పట్టణంలో 7 సం॥లు వయసు కలిగిన ఒక గుఱ్ఱం వుంది. అది చేపలుతిని బ్రతుకుతుంది. గడ్డిగాని మరి ఏదిగాని ఏమివేసినా తినదు. యజమాని చిన్నకొడుకు దానికి రోజూ చేపలుపట్టి పెడుతూ వుంటాడు. వాటిని చక్కగాతిని, కడుపునిండినట్టు గుర్తుగా నోరు బాగా తెరుస్తుంది.

♦ ♦ ♦ ♦

కార్నెల్ కార్నీ అను నతడు కాఫీహోటల్లో కూర్చుని కాఫీ త్రాగుతున్నాడు. లూయిస్ అనే అమ్మాయి, ఆమె స్నేహితురాలు కలిసి ఎదురుగుండావున్న బల్లదగ్గర కూర్చుని కాఫీ త్రాగుతున్నారు. ఒకరి నొకరు చూచుకోవడంతో ఇద్దరు అమ్మాయిలూ అతణ్ణి పెళ్లాడాలని అనుకున్నారు. అతడుకూడా వారిని పెళ్లాడడానికి అంగీకరించాడు. కాని "మన మిద్దరమూ అతన్ని పెళ్లాడ్డానికి వీలులేదు" అంది లూయిస్ రెండోఆమె తన హేండ్ బాగ్ లోంచి పేక బయటకు తీసింది. ఆపేక కలిపి కోతలుకోయాలి. ఆ కోతలు కోయడంలో లూయిస్ గెలిచింది. పెళ్లాడింది. మర్నాడు విడాకులుకి అనుమతికోరింది. న్యాయాధిపతి కారణ మడిగితే, "పట్టుదలకోసం పేకకోతలో నెగ్గి పెళ్ళాడాను కాని, నిజంగా మనసారా ప్రేమించి గాదు"అంది లూయిస్.

♦ ♦ ♦ ♦

యునైటెడ్ స్టేట్సులో ఒకకేసు. భర్త మంచి దేశభక్తుడు. రేడియోలో ఎప్పుడు జాతీయగీతం వినబడినా భార్యను లేచినుంచోవలసిందిగా ఆజ్ఞాపేశాడు. ఆమె నీళ్లోసుకుంటూన్నాసరే, పడుకున్నాసరే లేచి నిలబడవలసిందే. అలా నిలబడకపోతే ఆమె జెబ్బట్టుకుని నిలబెట్టేవాడు. ఇలా కొంతకాలం జరిగింది. చివరకి అతడికి ప్రాణం విసిగి విడాకులుకు దాఖలు చేసుకున్నాడు. 'జాతీయగీతం వినబడుతూన్నప్పుడు లేచి నిలబడకపోయినంత మాత్రంలో దేశభక్తి కేమీలోటు రాదోయ్'అని చెప్పి అతణ్ణి ఒప్పించడానికి జడ్జీకి తలప్రాణం తోకకి వచ్చింది.




# కూచిపూడి భాగవతులు

★ శ్రీమతి నందగిరి ఇందిరాదేవి

**ఒక మాట**

భాగవతం, గొల్లకలాపం మొదలైనవి తెలుగు వెలుగును వెదజల్లే జాతీయనాట్యాలు. ఆంధ్ర సంస్కృతికి, సంపత్తికి యివి ప్రబలనిదర్శనాలు— వీటిని పునరుద్ధరించి తెలుగు జీవనానికి తిరిగి జాతీయ తొడుగులు తొడగాలి. గృహలక్ష్మి ఈ ఆంధ్రజాతీయ కళాప్రబోధానికి కృషి చేస్తుంది. విషయ సముచ్చయాన్ని వివరించే వ్యాసాలను తప్పక పంపి మాకు సహకారమిస్తారని సోదర సోదరీమణులను ప్రార్థిస్తున్నాను.

సంపాదకుడు

"ఆ కూచిపూడివాళ్లా! ఓ! మావూరికికూడా వచ్చారు." అంటాడు ప్రతి తెనుగుబిడ్డ. ఆంధ్రదేశంలో ఏ మూలనున్నా సరే— కూచిపూడి భాగవతులు వచ్చారంటే ఊళ్ళో ఎక్కడలేని హడావిడి, ఉత్సాహము. చిన్నచిన్న పిల్లలదగ్గరనుండి ముడుకాళ్ల ముసిలివాళ్లవరకు చాపచుట్టలు చంకనపెట్టుకొని హాజరవుతారు భాగవతాలుచూడటానికి. పట్నవాసాల్లో పుట్టిపెరిగిన మనకు వీటితో ఎక్కువపరిచయం లేకపోవటం మూలాన భాగవతాలంటే ఏదో నిర్లక్ష్యంగా ఉంటుంది. కాని పల్లెటూరి ప్రజలకు ఈ భాగవతాలే అన్నివిధాల ఆనందం సమకూర్చేవి.

ఈ భాగవతాలు బ్రాహ్మణుల సొమ్ము అనటంలో సంశయం లేదు. కూచిపూడివారంటే లోకోత్తర ప్రఖ్యాతి. దొమ్మరవాళ్లు కూడా భాగోతాలు ఆడుతారు కాని వాళ్ల ఉచ్చారణ స్వచ్ఛంగా ఉండదు. నాట్యంకూడా వీళ్ల తరువాతదే. అసలు కూచిపూడి అనేది బెజవాడదగ్గర ఒక చిన్న పల్లెటూరు. ప్రకృతిసౌందర్యాన్ని తనివితీరా అనుభవిస్తూ కృష్ణానది చల్లటిచూపుల్లో ప్రశాంతంగా జీవయాత్రలు సాగిస్తారు ఆపల్లె ప్రజలు. ఊరుమధ్యనే వారికి సర్వస్వమయిన నటరాజు నెలకొని యున్నాడు. కృష్ణలో స్నానమాడి హాయిగా చక్కని పాటలుపాడుతో ఒళ్లుమరచి నాట్యంచేస్తారు నటరాజు ముందర. ఆ నటరాజ దేవాలయంలో—జీవితంలో కనీసం ఒక్కసారయినా నటరాజుముందర నాట్యంచేయనిదే వారిజన్మలు తరించవని ఆప్రజల నమ్మకం. వారు నిరుపమాన నాట్యకళాకౌశలం సంపాదించటానికి ఇదే ముఖ్యకారణం అయిఉంటుంది. ఆ పల్లెప్రజలకు ఇహపరసాధనం అయింది నాట్యం, సంగీతం. కూచిపూడివారు నాట్యకళోద్ధరణకోసమే బ్రతికారు. అదే వారిజీవిత పరమావధి. ఇప్పటికీ కూచిపూడి వీధులవెంట తెల్లవారుఝామున బయలుదేరితే

చిరుతలచప్పుడు, తాళాలచప్పుడు, కమ్మని సంగీతం వినిపిస్తుంది. మరి అస్తమానం తైతక్కలాడుతూ రాగాలుతీస్తుంటే వీరిజీవితం ఎల్లా గడిచేది అనే సందేహం రావచ్చు. లలితకళల్లో అగ్రస్థానం వహించిన నాట్యం, సంగీతంలో ప్రవీణత సంపాదించటం అంటే, కడుపుకక్కుర్తి అవసరంలేకుండా ఉంటేనే సాధ్యమవుతుంది. సరే ఇప్పుడు జనాదరణలేక వారుకూడా ఏ గవర్నమెంటు ఆఫీసుల్లోనో గుమస్తాలుగా పడిపోయినారు. కాని ఆ కాలంలో లక్షలకొద్ది సంపాదించారంటే ఆశ్చర్యంలేదు.

అసలు ఈ భరతనాట్యం వీరిసొత్తు గావటానికొక కథ వున్నది. కూచిపూడిలో సిద్ధప్ప అనే యువకుడు చదువు సంధ్యలులేకుండా ఊరిమీద తిరిగేవాడు. తల్లిదండ్రులేకాక ఆ వూరంతాకూడా అతనిని అసహ్యించుకునేవారు. దానితో మనసు నొచ్చుకొని ఎవరికీ చెప్పకుండా ఎక్కడకోలేచిపోయి అన్ని శాస్త్రాల్లో ప్రవీణుడయి తన స్వస్థానానికి మరలివచ్చాడు. ప్రజలందరు అతన్ని ప్రావీణ్యానికి మెచ్చుకొని యోగి సిద్ధప్పఅనేవారు. అతడే భరతనాట్యం తన దేశస్థులకునేర్పించి కూచిపూడిలో నటనాగ్రేసరులను తయారుచేశాడనీ, ఈనాటి ఈకీర్తి ప్రతిభలన్నీ అతనికే చెందుతాయని చెప్పుకుంటారు.

భగవంతుడిలీలలను ప్రదర్శిస్తారుకనుక కూచివాడివారికి భాగవతులు అనేపేరు వచ్చింది. కాని వీరు మూడురకాలుగా ఉంటారు. నటకులు, పగటివేషగాళ్లు, నటనాధ్యాపకులు. నటకులయినవారు తమ తమ పరివారసహితంగా ఊరూరుతిరిగి భాగవతాలు ఆడుతారు. వీరు ఆడే కథలు అన్నీ పురాణాలల్లోవే. అవికూడా రెండురకాలుగా భాగించవచ్చు. గొల్లకలాపం అనీ, భామకలాపమనీని. గొల్లకలాపం వేదాంత విజ్ఞానాన్ని వెదజల్లుతుంది. భామ కలాపం ఒళ్లు పులకరింపజేస్తుంది. ఇటు శృంగారం అటు వేదాంతం రెంటినీపోషిస్తూ యువకరక్తాన్ని ఉడుకెత్తించి పండు ముదుసలులకు వైరాగ్యంబోధించి సర్వజనాదరణను సంపాదించారు కూచిపూడి భాగవతులు.

రెండవరకం పగటివేషగాళ్లు. వీరికి ఆకాలంలో చాల ఆదరం ఉండేది. అన్ని రకాలవేషాలు వేసి ఆసందర్భపుమాటలలో అందరినీ నవ్వించటం వీరి ముఖ్యోద్దేశం. ఒక విధంగా హాస్యగాళ్లు అన్నమాట వీరుకూడా నటనలో మంచి ఆరితేరినవారు. 'వేషం' అని తెలియనంత సహజంగా ఉంటుంది. ఒకసారి ఒక గ్రామ స్కూలుమేస్టరు దగ్గరికి ఇన్స్పెక్టరువేషంలో తగిన హంగామాతోవచ్చి స్కూలు మేస్టరును పని సరిగా చేయలేదని జడిపించి కావలసినంత హడావిడిచేసి చివరకి ఆ గృహస్థునికి నమస్కారంచేస్తూ "బాబూ మేం పగటివేషగాళ్లం" అని చెప్పారట. వారి నటనాసామర్థ్యాన్ని నిరూపించటానికి ఇట్లాంటి ఉదాహరణాలు ఎన్నో ఉన్నాయి. వీరు ఇవ్వాళటి సి. ఐ. డి లవలె స్టేషనులో కొత్తముఖం కనబడగానే జేబులోనుండి నోటుబుక్కు పెన్సిలుతీసి "ఆప్ కానామ్, బాప్ కానామ్" అని అడిగి వ్రాసుకోటం కాకుండా తమ పగటివేషాలతోనే రాజ్యతంత్రాలలోకూడా చేయి కలుగజేసుకునే తెలివిమంతులుండే వారు.

మూడవరకం ఆడవాళ్లకభినయం నేర్పటానికి వీరిలో కొంతమంది భాగవతుల గుంపును 'వెంట పాటకులు'. అనే పేరుతో వెంబడిస్తారు. పాటకు అనుగుణంగా తాళం వేయటం, కొన్నిసార్లు ప్రదర్శన యోగ్యంకాని సంఘటనలను చెప్పటం వీళ్లపని. భామకలాపం, గొల్లకలాపం రెండూ ఆడవాళ్లకు నేర్పిస్తారు. రెంటికి కథానాయకుడు శ్రీ కృష్ణుడు, నాయిక సత్యభామ. భామకలాపంలో నాయికానాయకుల ఎడబాటు

విరహం ఉంటాయి. తాను వయస్యపాత్రను నటిస్తూ సందర్భానుసారంగా హాస్యం పోషిస్తూ ఉంటాడు గురువుగా ఉన్న బ్రాహ్మణుడు. 'సారధి' వారి రైతుబిడ్డలో కూచిపూడి బ్రాహ్మణుని నాట్యకళా నైపుణ్యం ఆతని ఉపాధ్యాయత్వం కూచిపూడి భాగవతులతో పరిచయంలేనివాళ్లకు విశదంగా బోధపడు తుంది. మాటమాటకు అభినయం. 'ఇన్నాళ్ళవలె గాదమ్మా, మా చిన్నికృష్ణుడు ఎన్నో నేర్చినాడమ్మా' అన్న నుడుగుయొక్క అభినయం ఎంత పరిపూర్ణంగా ఉంటుందంటే పాట పాడకున్నప్పటికీ అభినయంవల్లనే అర్థం చక్కగా స్ఫురిస్తుంది.

భాగవతుల స్టేజి చాల సామాన్యమయింది. ఒక్క పరదాతో ఎంత నాటకమయినా ఆడేస్తారు. వాళ్ల నాట్యభంగిమమే పరదాలేని లోపం తీరుస్తుంది. పందిళ్లువేసిన విశాల బయలుప్రదేశం వీరి థియేటరు. టిక్కట్లు పేచీ లేదు గనుక ఊరి ప్రజలంతా క్రిక్కిరిసిపోతారు. సినిమాకు వెడితే ఎవరి అణాలు వారు పెట్టుకున్నట్లుగాక ఊళ్లో చేయినిండుగా ఉన్నవాళ్లు ఆడిస్తారు. అంటే ఆనాటి ఖర్చుగాక ఏదో యథాశక్తిగా ముట్టచెప్పుతారు భాగవతం ఆడినవారికి.

కథ విషయం. నాట్యానికి సంగీతానికి ఉన్నంత ప్రాముఖ్యం కథకు ఉండదు. కనుక కథ సాఫీగా నడవదు. కథలో పాత్రలు వేరువేరుగా ఉండవు. అసలు కథను ఇద్దరు వెనుకపాటగా పాడతారు. నటకుడు కూడా రసాభినయంతో పాడి అర్థంచెప్పుతూ ఉంటాడు. రాజువేషం భామవేషం ముఖ్యమయినవి కథలో. చాల పురాతన పద్ధతిలోనివి గనుక ఇందులోనివి డైలాగ్సు చాల గమ్మత్తుగా ఉంటవి సంస్కారంలేని పద్ధతిలో. రాజువేషం వస్తూ 'రాజు వచ్చెనూ, రవితేజముతో' అంటూ self introduction చేస్తాడు. అది పామరజనులకు తెలియదు గనుక ఇంకా తానెవరో స్పష్టపడాలన్న ఉద్దేశంతో మంత్రిగా కూర్చున్న నటకుని ఉద్దేశించి 'మంత్రీ! నేనెవరినో యెరుగుదువా?' అని మంత్రినోటినుండి 'నువ్వు రాజువు' అని అనిపించే దాకా వదలడు. తరువాత 'మన రాజ్యంబున ప్రజలు సుఖంబున నున్నవారే' అని పద్యంలో చెప్పి దాని అర్థం వచనంలో అడుగుతాడు. ఇందులో విసుగురాకుండా ఉండటానికి సందర్భానుసారంగా హాస్యం తోపాటు ఆధ్యాత్మకీర్తనలు, గీతగోవిందాష్టపదులు, తరంగాలు, మువ్వగోపాలపదములు పాడుతారు. వీటన్నిటితో మెల్లిగా కథ పూర్తి అయేటప్పటికి తెల్లవారుతుంది. అయినప్పటికీ ప్రజలంతా అంత ఓపికతో తెల్లవార్లు నిద్రలేక చూస్తారు.

వీరి అలంకారాలన్నీ పూర్వపద్ధతిని ఉంటవి. ఒంటిమీద బంగారం తూకంతోనే వ్యక్తుల సాంఘికస్థానం (Social standard) ఆధారపడిఉంటే ఆ రోజుల్లో భామవేషానికి లెక్కలేనన్ని నగలు ఉండాలి. అడ్డబాస, రాగిడి, చంద్రవంక, నాగరము ఇట్లాంటివి. మొగవాళ్లుకూడా కంఠి, చంద్రహారం అనేవి వేసుకునేవారు. బట్టలుకూడా సాధారణంగా ప్రముఖవేషాలకు జరీబూటాలవి వాడుతారు. మొత్తంమీద వాళ్ల వేషం మనలను ఆకర్షించదు. మోటుగా ఉన్నదనిపిస్తుంది. అందుచేతే ఈకాలపువాళ్లను తృప్తిపరచ టానికని వారుకూడా నవీనులు (Modernise) కావటానికి ప్రయత్నిస్తున్నారు. కాని ఆకాలపు సీతమ్మకు ఈకాలపు జార్జెంటు చీరకట్టించి బ్రోచులుకుచ్చితే అసహ్యంగా ఉంటుంది.

దేనికయినా ఓకాలం ఉంటుంది పేరుప్రతిష్ఠలు ఉన్నరోజులు అంటూ. అట్లాగే ఒకనాడు కళా ప్రపంచంలో ఒకయెత్తుగా భావింపబడిన కూచిపూడి భాగవతాలు ఇప్పుడు దాదాపు విస్మృతకళగా అయి పోయినవంటే ఆశ్చర్యంలేదు.

# ★ స్త్రీకి స్వాతంత్ర్య మెంతవరకు? ★

## శ్రీమతి ఆచంట సత్యవతమ్మ

ఈ ప్రశ్నకు సరియైన సమాధానము కాంక్షించియే యీ వ్యాసము వ్రాయుచుంటిని; కాని "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అని శాసనకర్తలు వ్రాసే పెట్టారు స్మృతులలోను పురాణాల్లోను కూడాను. అల్లాఅని అన్నీ వారు వ్రాసినట్లే ఆచరణలోవున్నాయా? లేదు. కాలానుసారము ఆచారాలు, ఆచరణలుకూడా మార్పు చెందుచూనేవున్నాయి. యీ ఇరవయ్యవశతాబ్దపు నవయుగంలో పురుషసమాన స్వాతంత్ర్యమే—కావాలన్నవారికే పారితోషికాలుకూడా వచ్చాయి. ఇవి బాగా ప్రపంచకాన్ని విమర్శించి వ్రాసేవారు మెచ్చేవారుకూడా ఒప్పుకున్నారంటే నిత్యావకాశాల్లోను సినీమాల్లోనుకూడా అతి స్వేచ్ఛకారి, బహుభంగకారిణియై తుదకు పురుషుని అండలోనికేవచ్చి పడుచున్నట్లు చూచుచున్నాము. కొన్నిటిలో స్త్రీ స్వేచ్ఛగా అనేక దేశోపకారకృత్యములుచేసి ఆదర్శరూపిణియై ప్రఖ్యాతిపొందినట్లును గాంచుచున్నాము. రెండువిధాల బాగోగులు చూచియే ద్వంద్వభావంలో ఇరుక్కున్న యీ సందేహమును తీర్చమనే పాఠకులను ప్రార్థించుచున్నాను.

పూర్వులు బాలిక తండ్రి ఆధీనమని, వివాహానంతరము భర్త్రాధీనమని, వృద్ధాప్యంలో భర్త్రానంతర స్త్రీలకు పుత్రాధీనమని శాసించివున్నారు. వారు రచించినవి, ఆచరించమన్నవి కూడా చాలా స్వానుభవం మీద చెప్పినవి కాని ఆషామోషీ కలగూరగంప కబుర్లుకావని నా అభిప్రాయం. 'బంగారపు కంచానికైనా గోడచేర్పు కావా' లని ఎంత విద్యావతియైనను, ఎంత బలశాలినియైనను స్త్రీకి పురుషసమాన స్వేచ్ఛముప్పే తెచ్చును. స్త్రీ ప్రకృతి అట్టిది. నవయుగమైతే మాత్రము నాణ్యము సమ్మతకారికదా? స్త్రీవ్యక్తి కోమలము, సౌందర్యవంతము, ఆకర్షవంతము. గాన జీవితనౌకను తెడ్డు, చుక్కానికూడా తానే త్రిప్పుకొంటూ నడుపుకొనుట చాల కష్టము. బలమున్నదని మోటుతనము, కఱుకుతనము ఏదీ! గడుపుకొనగలమని విర్రవీగుటకు డిగ్రీ విద్యలుండును; కాని ధైర్యసాహసములు ఏవీ! లేవనుటకు వీల్లేదు. ఆనాటి రుద్రమదేవి, సంయుక్త, ఝాన్సీ లక్ష్మీబాయి, మొదలగు వీరవనితలు, దమయంతి, చంద్రమతి, సీత, అనసూయాది మహా పతివ్రతలు, తమ శీల, ప్రాణములను, రాజ్యములను కూడ కాపాడుకొనిరి కదా? ఇట్టి వారి నాదర్శకముగా దీసుకొంటూ మనం యీ కాలంలో అతి స్వేచ్ఛగా వుందామంటే ఆనాటి ఆచరణ కాదీనాడు.

సప్తవ్యసనాలసాగరాల్లో నిత్యము స్నానములాడేటి బూటకపు దుష్టగుణ పురుషులుంగల కలియుగ వాతావరణయిది. నిత్య జీవితాల్లో సంభవించే చిత్రాలే సినీమా చిత్రాలక్రింద త్వరగా మనస్సుకు పట్టేలాగ దృశ్యరంగాలు చిత్రించారు చూడండి. ఇల్లాలులో విద్యావతినని విఱ్ఱవీగి భర్త జబ్బునుకూడా గమనించకుండా స్వతంత్రురాలై అర్ధరాత్రినికూడా నిరాకరించి వెళ్లిన భార్య తుదకు నాశనమైనది. మరణకాలములో పతిపదసేవే నాతికి ముఖ్యమని తేల్చింది. అల్లాగే అర్ధాంగిలో విద్యావతి (డిగ్రీకాంత) వ్యర్థాంగియై పురుషునికి వ్యధకారిణియై లోకంలో దూషితకాంతయైనది. జీవనజ్యోతిలో సరోజిని, సుశీలల సంఘ స్వాతంత్ర్య మెంతవరకు తెచ్చింది! తుదకు వారి ఆశయములు భర్త్రాధీనానికే వచ్చితీరాయి.

అందుచే స్త్రీలకి స్వాతంత్ర్య మెంతవరకు అంటే గృహస్థురాలై పతీపుత్రుల ఆత్మైకజ్యోతియై తన మాన ప్రాణములు కాపాడుకుంటూ జాతీయ విద్యావిధానయై సనాతన ధర్మాచారాలననుసరించి స్త్రీకి తగిన వినయము, పొందిక, సిగ్గు కలిగి యింటికిల్లాలై గృహిణికి తగ్గ స్వేచ్ఛాజీవితమే ముఖ్యము.

# స్త్రీలు చెడ్డవారా?

★ శ్రీమతి చెరుకూరి నాగభూషణమ్మ ★

పురుషులు మాత్రం?' అనే ప్రశ్న వస్తుంది. 'ఇది స్త్రీ పురుషుల్లో ద్వేషాలను పురిగొల్పడం' అంటారు పెద్దలు. కాని, ప్రబలంగావున్న ఈ అపవాదును పరిహారిచేయడం క్షంతవ్యమా.

హిందువులలో శాస్త్రజ్ఞులదగ్గరనుండి, ఋషులదగ్గరనుండి, పురాణకారులదగ్గరనుండి, అతి సామాన్యులువరకూ 'స్త్రీలు చెడ్డవారు, నమ్మగూడనివారు' అను దురభిప్రాయము నిండి నిబిడీకృతమై వుంది. వీరందరూగూడ స్త్రీల హృదయతత్త్వమును ఏమాత్రము గ్రహించినట్లు లేదని అనుట సత్యదూరం కాదు. ప్రపంచంలో స్త్రీలు పురుషులు ఒకే మానవజాతికి చెందినవారైనప్పుడు, స్త్రీలను పురుషులు ఎట్టి నిందలమోపి యెంత హీనులగా పరిగణిస్తున్నారో కొంచెం పరికిస్తే తేలుతుంది. ఈ క్రింది విషయాలనుచూస్తే కొంచె మభిమానముగాని, విజ్ఞానముగాని వున్నటువంటి యే స్త్రీకైనను—తుదకు యే పురుషునకైనను కంపమెత్తక మానదు.

సామాన్యముగా శాస్త్ర, పురాణములు మొదలుకొని, సుమతి, భాస్కరాది నీతిశతకములవరకు_ఇవి యన్నీ సంఘాభివృద్ధికిని, సంఘశ్రేయమునకును నీతులను, వుపదేశములను బోధించుటకే వ్రాయబడివున్నాయి. అట్టి యీ నీతిబోధకములైన గ్రంథాలనుండి స్త్రీలను దూషించే వుదాహరణలు మచ్చునకు కొన్ని :

అందు నీతులకు ప్రసిద్ధివడసిన సుమతిశతకంలో 'అల్లుని మంచితనంబును, గొల్లని సాహిత్యవిద్య కోమలి నిజముఁ...... లేవు తెలియర సుమతీ'

అని వ్రాసివుంది. అనగా స్త్రీజాతిలో 'నిజము' అనేది లేదని చెప్పబడింది. ఇలాగే భాస్కర శతకంలో కూడా 'అంగన నమ్మరాదు తన యంకెకురాని మహాబలాఢ్యు వేభంగుల మాయలొడ్డి చెఱుపందలపెట్టును' అని. సుమతిశతకకారుడు స్త్రీలకు నిజమే లేదంటే, ఇతడు మఱియొకమెట్టు పైకెక్కి స్త్రీలను నమ్మనే కూడదని, నమ్మినచో తప్పకుండ చెడిపోయెదరుసుమా యని పురుషుల కుపదేశరత్నమును ప్రసాదించి వున్నాడు.

ఈవిధముగానే మహాభక్తుడు, నీతిబోధకుడు ఐన తులసీదాసు తన తులసీ రామాయణంలోకూడ నిట్టి భావాలనే వ్రాసివున్నాడు. ఈ గ్రంథము హిందూదేశములోని గ్రంథములన్నింటికంటెగూడ యెక్కువ ముద్రణలను పొందివుంది.

ఢోల్, గంవాడ్, శూద్ర, పశు, నారీ।
యే సబ్ తాడనకే అధికారీ॥

అనగా డోలు, ఏమీ తెలియనివాడు, శూద్రుడు, పశువు, స్త్రీ వీరంతా కొట్టుట కర్హమైన వారట! ఆహా! స్త్రీలు పశువులతో సమానమైనవారినిగా జమగట్టారు. పైగా డోలును వాయించినట్లు కొట్ట

తగినవారట ! ఏమి యన్యాయము ! ఇట్టివేనా నీతిబోధనలంటే? అంతేగాదు. ఈ కవియే మరియొకచోట ఇలా వ్రాశాడు—

'అవగుణ ఆట్ నారి ఉరబసహీ'

అంటే సమస్తమైన దుర్గుణాలకి స్త్రీ హృదయము స్థానమట ! ఇట్టివారికి మనుష్యత్వమనేమో తెలియ దనడం సాహసంకాదు.

భాగవతంకూడా చతుర్థస్కంధంలో స్త్రీలు నరకానికి మూలకారకులని పేర్కొని ఉన్నది. ఈ గ్రంధాలే గాదు, మన గ్రంథములన్నిటిలోను ఇట్టి భావాలే కుప్పతెప్పలుగా కన్పిస్తున్నాయి.

ఇట్టి వివిధములైన అన్యాయోక్తుల్ని వినడంచేత తాము పురుషుల వశులై వారి దాస్యాచారబద్ధు లగుటచేత స్త్రీలుగూడా తాము చెడ్డవారమని అనుకోవడం పరిపాటైపోయింది. ఒకానొక వనితామణి తన వరదరాజశతకంలో ఇలా వ్రాసింది :

సీ॥ "వనితల హృదయంబు గనజాలకయెగాదె, త్ర్యంబకుండాగంగ తలను దాల్చె
గాంతల మర్మముల్ గానరాకయె గాదె, పడతివాక్కుననుంచె పద్మభవుడు
అతివల చిత్తంబు లరయజాలకగాదె, యురమున శ్రీ లక్ష్మి యుంచె హరియు
నింతుల భావంబు నెఱుగజాలకగాదె, సతి నరుంధతి వసిష్ఠముని గాచె
......................................"

కాబట్టి, స్త్రీలను జాగ్రతగా కాపాడుకొనవలసినదని ఈమె పురుషులను హెచ్చరించివుంది. ఈ భావములు పురుషులయందువలెనే, స్త్రీలయందును ఆచారానుగతముగ అస్థిగతములైపోయాయి. ఈ విషయము కొంచెము విమర్శనాత్మక దృష్టితో చూచినప్పుడు ఆశ్చర్యము కలగకుండా వుండదు.

పురుషులలో దుర్గుణాలు లేవని చెప్పగలరా? లేక దుర్గుణాలు పురుషులలో వున్నా ఫరవాలే దంటారా? తమ సర్వస్వము అర్పించే భార్యలతో మంచీ, చెడు, మాటా, మంతీ లేకుండా ఎందఱు పురుషులు పరస్త్రీ లోలురై తిరుగుతూవుంటే—మనసిచ్చి చెప్పే మాటకుకూడ నోచుకోలేదని కంటికి కడివెడుగా కార్చే స్త్రీల నెందఱిని చూడటంలేదు? ఆస్థి, అధికారాలు వున్నవని విఱ్ఱవీగి ఒళ్లుదెలియకుండా త్రాగి తందనాలుగొట్టి, ఆస్థినంతా వ్యయపరచి, తిన తిండి, కట్ట గుడ్డ, వుండ నిల్లులేకుండ చేస్తూవుంటే వారి భార్యా పిల్లలెందఱు అలో లక్ష్మణా యని యేడవడం లేదు? పురుషులు మంచి ప్రకృతిగలవారలే యైతే ఆ యనర్థాలెందుకు? ఆ యేడ్పులెందుకు? ప్రపంచములో జరిగే హత్యలు, అబద్ధాలు, అనాచారాలు జరగ టానికి స్త్రీలే కారకులు గాబోలు! అదేమంటే పురుషులకు చెల్లునని మూఢులే గాకుండ విద్యావంతులలో గూడ కొందరంటారు. నిజమే! అర్థికాధికారాలున్నప్పుడు చెల్లకుండ ఉంటాయా? కాకపోతే తమ సాటి స్త్రీలను ఇట్లు నిందావాక్యములాడ సాహసిస్తారా?

స్త్రీలలో ఎలాంటి అమూల్యమైన గుణములు గలవారలున్నారో చూడటంలేదూ? భూతదయా పరులు, పరోపకార శీలురు స్త్రీలలో నెందరు లేరు? కొంచెము మనసిచ్చి మాట్లాడితే తమ సర్వస్వము నర్పించువారెందరు లేరు? భర్తలు కొంచెమనుకూలముగా నుంటే తమ సౌఖ్యములను వదలివేసియైనా అడుగు

లకు మడుగులొత్తు స్త్రీల నెందర జూడటంలేదు? కావున్న హక్కులు, అధికారాలు ఉండుటచే పురుషులు తమ యిష్టమైన కార్యాలను బహిరంగంగానే చేస్తున్నారు. స్త్రీలు, ఆర్థికసంబంధమైన హక్కులేవీ లేని కారణంచేత, తమ మనుగడకోసం పురుషుల దౌర్జన్యాధికారముల క్రింద ఎన్ని యిక్కట్లు బెట్టినను అణిగిపడి యుండవలసినప్పుడు యెవరో కొందఱు కొన్నితప్పులు చేయవచ్చును; చేయక తప్పదుకూడా. 'అత్తజేసిన పనులకు ఆరళ్లుండవన్నట్లు, అధికారమ త్తదే గాని కోడలికుండదు'గా మఱి. పురుషుల దౌర్జన్యాలకు భయపడి, నిజమాడితే ఏమిజేయుదురో యనే భీతిచేత ఏదైనా అబద్ధమాడవలసివస్తుంది. తమకు భయపడని స్థితిలో తమ స్త్రీల నుంచినట్లైతే వారు అబద్ధమాడవలసిన యావశ్యకత వుండనే వుండదు. ఐశ్వర్యముగలవారు చోరత్వమునకు పాల్పడుతారా?

పాపము! స్త్రీల అస్వతంత్రజీవనము కొందఱ పురుషులకు రవంతైనా గన్పట్టదు. వారి దిక్కుమాలిన స్థితికి ఆలోచించవలసినదానికి బదులు వారికి పైజెప్పిన దోషము లారోపించి, అనేకవిధములైన కపట ధర్మముల నంటగట్టుతారు. వారు అడుగుతీసి అడుగువేసిన శంకిస్తారు.

పురుషులందరు ఇట్టి భావాలు గలవారని చెప్పటం నా వుద్దేశ్యంగాదు. కాని, యికనైనా వారితో సమభాగినులైన స్త్రీలను న్యాయదృష్టితో వారికట్టి దోషముల నారోపింపక, అన్నిటా అడ్డుబెట్టి బంధింపక, వారికి మానవులకుండవలసిన సర్వవిధ హక్కులనూ ఇచ్చి వారినిగూడ విజ్ఞారాంద్రుగా జేయ ప్రయత్నించాలని కోరుతాను.

స్త్రీలుకూడా తాము వట్టి పనికిమాలినవారమని అనుకోవడం మాని మనదేశములోను ఇతరదేశములలోనుగూడా స్త్రీలు ఎంతెంత ఘనకార్యములు జేసెడివారున్నారో తెలిసికొని ధైర్యసాహసములతో అభివృద్ధిమార్గములబట్టి పోతే మన సంఘం అన్నిటా ఔన్నత్యం పొందుతుంది.

చెన్నపట్నంలో

# తెనుగుపిల్లలకు తెలుగు చదువు

★ ఆంధ్రమహాసభ ఆర్గనైజరును, సుప్రసిద్ధ కాంగ్రెసు సేవకులును అగు శ్రీ రామచంద్రుని వెంకటప్పగారు సత్యాగ్రహమొనర్చి, ప్రభుత్వ బందీగా వెడలుచున్నప్పుడు చెన్నపురి ఆంధ్ర సోదరీమణుల కొసగిన సందేశము ★

ఈ చెన్నపట్నంలో తెలుగు బాలబాలికలు 20,100 మంది ఉంటే అందులో 10,000 మంది కంటె ఎక్కువ చదువుకోవడం లేదు. ప్రజాప్రతినిధి సంస్థ అయిన కార్పొరేషన్ పరిపాలించే బడులలో 5,700 మంది మాత్రమే చదువుతున్నారు. వారిలో 2,500 మందే తెలుగులో చదువుకుంటున్నారు. అయితే మొత్తంమీద 100 కి 81 మంది — అనగా 85,00 చదువుతున్నారు. అలా ఉండగా తెలుగుపిల్లలు 100 కి 50 మంది మాత్రమే చదవడమేమి — నిర్బంధోచిత ప్రారంభవిద్య 14సం॥ల నుంచి అమలులో ఉన్న చెన్నపట్నంలో ?

తెలుగు పిల్లలందరికీ చదువు రావాలంటే — అందరూ తెలుగులో చదవాలంటే - తనబిడ్డ చదువుసంగతి తెలుగుతల్లి శ్రద్ధపూనవలె, ఆందోళన చేయవలె, అధికారుల చెవికి, మదికి ఎక్కేట్లు గగ్గోలు పెట్టవలె.

మద్రాసు,
2-1-41.

రామచంద్రుని వెంకటప్ప,
ఆర్గనైజరు, ఆంధ్రమహాసభ స్థాయిసంఘము.

# హైందవాచారాలలో విజ్ఞానం

● వసంత ●

చిత్తశుద్ధి, మనస్థైర్యం, ఆత్మనిగ్రహం—ఇవి జీవికి అత్యంతావశ్యకమైనవి. చక్కని కార్యక్రమం ఒకటి నిర్మించుకొని, తదను గుణ్యంగా కృషిచేస్తూ అంతరాయాల నుల్లంఘిస్తూ జయప్రదంగా ముందుకు సాగడం జీవియొక్క ప్రధానలక్షణం; నిజస్వభావం. అయితే మానవజీవితం ఎంత క్లిష్టమైనదో, ఎంత సంకుల మైనదో గ్రహిస్తే కార్యసిద్ధికై చేయవలసిన కృషియొక్క పరిమాణం పొడకట్టుతుంది. కాబట్టి భూమిపై జీవిస్తూన్న మానవుడు ఎట్టి విచిత్రమైన రంగంలో తన పాత్ర పోషించుకొంటున్నాడో ఎట్టి క్షేత్రంలో చరిస్తున్నాడో గమనించవలసి ఉంది.

మనం నివసిస్తూన్న భూమి ఒక పెద్ద గోళం. దాని నిడివి సుమారు 8000 మైళ్లు. ఈ భూమి తనలో తను తిరుగుతూ, సూర్యునిచుట్టు ప్రదక్షిణాలు చేస్తూవుంది. ఒక్క ప్రదక్షిణం చేయడానికి ఒక సంవత్సరం పట్టుతుంది. అంటే సంవత్సరంలో సుమారు 600,000,000 మైళ్లు ప్రయాణం చేస్తూంది; సెకనుకి 18 మైళ్లు పరుగెత్తుతూంది, గంటకి 65,000 మైళ్లు చొప్పున ఆకాశయానం చేస్తూనేఉన్నది. భూమితో మనంకూడా అంత విపరీతవేగంతోను ఆకాశంలో తిరుగుతున్నాం. ఆ విషయం మన మెరుగుదుమా? లేదు; సరికదా సూర్యుడే భూమిచుట్టు తిరుగుతున్నాడని భూమి స్థిరంగా నుందని నమ్మేవారు. ఏమంటే ఇంత త్వరగా సాగిపోతూన్నా భూమి తొణకదు. భూపరిసరాలు పరిశీలించినా స్థూలదృష్టికి భూమియొక్క చలనం గోచరించదు. మన నిత్యకృత్యాలకీ ఈ చలనం అడ్డురాదు.

మనభూమి కేవలం ఒకమట్టి ఉండకాదు. అది అయస్కాంతం (Magnet) ఒక అయస్కాంత సూచికను వ్రేలాడకట్టితే అదెప్పుడు ఉత్తర దక్షిణంగానే నిలుస్తుంది. ఏమంటే భూమికిగల ఉత్తరదక్షిణ అయస్కాంతధ్రువాలు సూచికయొక్క దక్షిణ ఉత్తరధ్రువాలని ఆకర్షించి సూచికను ఒక్కవిధంగానే నిలబెట్టుతాయి. ఇక అయస్కాంతం చుట్టుఉన్నది అయస్కాంతక్షేత్రం (Magnetic Field) క్షేత్రం నిండా అయస్కాంత బలరేఖలు వ్యాపించి ఉంటాయి. అట్టి అయస్కాంత క్షేత్రంలో మానవుడు జీవితం గడుపుతున్నాడు.

సూర్యుడు మనకు వేడివెలుగు ప్రసాదిస్తున్నాడు. చంద్రుడు, నక్షత్రాలుకూడ కొంత కాంతి ప్రసాదిస్తున్నాయి. ఈ కాంతి తరంగరూపేణ ప్రయాణంచేసి భూమిని చేరుకొంటూంది. వేడికూడ అదే విధంగా ఆకాశంలో ప్రయాణంచేసి మన దగ్గరకు వస్తూంది. ఈ తరంగాలు విద్యుదయస్కాంత తరంగాలు (Electro-magnetic waves) అని వైజ్ఞానికులు కనుగొన్నారు. ఇవన్నీ ఒకజాతికి చెందినవేగాని వాటి వాటి తరంగదైర్ఘ్యం (Wave-length)లో గల అంతరంబట్టి వేరువేరు రూపాలలో మనకు వ్యక్తమాతున్నాయి. కాంతి తరంగాలు నేత్రాలకు గోచరిస్తాయి. ఉష్ణ తరంగాలు స్పర్శచే తెలియబడతాయి. అతి నీలలోహిత తరంగాలు పడినచోట బొబ్బలులేస్తాయి. కిరణాలు చర్మాన్ని ధ్వంసం చేస్తాయి. ఈ ప్రకారంగా సూర్య చంద్ర నక్షత్ర గ్రహములనుండి వస్తూన్న అనేక కాంతులు భూమిని చేరుకొంటున్నాయి. అంటే భూతలం ఒక అయస్కాంత క్షేత్రమే కాకుండా విద్యుదయస్కాంత క్షేత్రం కూడా అయినదని విశదమాతుంది.

ఈ కిరణాలతోపాటు నక్షత్రాంతరాళాలనుండి కాస్మిక్ కిరణాలు వ్యాపించి భూతలాన్ని మర్దిస్తున్నాయి. కిరణజాలంలో మహాశక్తివంతములైనవి కాస్మిక్ కిరణాలు. అవి నీటిలో జొచ్చికొని పోతాయి. వాతావరణంలోని అణువులను భిన్నం చేస్తున్నాయి. మానవ శరీరంలో వందలకొద్దీ అణువులను సెకనులో విచ్ఛిన్నం చేస్తున్నాయి. ఆ విషయం మనకు రవంతైనా తెలియదు. సర్వకాల సర్వావస్థలయందు నిర్దాక్షిణ్యంగా మన శరీరాలను మర్దించి ఛిద్రంచేస్తూన్న కిరణాలసంగతి 40 ఏండ్ల క్రితం తెలియనేతెలియదు! అట్టి కాస్మిక్ కిరణాల వాతబడి కృశిస్తున్నాయి మన శరీరాలు !!

అంతకన్న మనలను క్రుంగ తీస్తూంది వాతావరణం. మనభూమి నావరించుకొని అనేక వాయువుల మిశ్రం సుమారు 100 మైళ్లవరకు ఉంది. అది ఎంతో ఒత్తిడి కలిగిస్తూంది. ఆ ఒత్తిడి సంగతి మనకేమాత్రము తెలియదు. దాని పరిమాణం మాత్రం అద్భుతం. ఆ ఒత్తిడికి 30 అంగుళాల ఎత్తున గొట్టంలో పాదరసం నిలుచుంటుంది. అంటే దాని ప్రభావం స్ఫురించదు. హేమంతంలో చలిబాధకి రగ్గులు కప్పుకొంటాం. దళసరి ఊలురగ్గు కప్పుకొంటే కొంతసేపటికా భారం భరించడం కష్టమౌతుంది. అట్టి సందర్భంలో బంగారు రేకు పావంగుళం దళసరిది కప్పుకోగలమా? ఏమో బంగారమన్న ఆశతో, వ్యామోహంచేత దానిభారం దురాశాపీడితులు భరిస్తారేమో? భరించినా స్వల్పకాలంలో పైకూడిపడతారు, తప్పదుకదా! అయితే అట్టి బంగారురేకులు 85 జోడించి కంబళివలె కప్పుకొంటే ఎంతగా పీడింపబడతామో, ఎంత ఉక్కిరి బిక్కిరి అగుతామో అంతతీవ్రంగా మన వాతావరణంచేత పీడింపబడుతున్నాం; ఉక్కిరి బిక్కిరి కావడంలేదు, పుట్టినక్షణం నుంచి ఆ ఒత్తిడికి అలవాటుపడి పోబట్టి కాబోలు! తుదకు పర్యవసానమేమంటే మనలను వాతావరణం యావజ్జీవము విపరీతంగాపీడించి క్రుంగతీస్తూంది. ఆ విషయము మనకు తెలియదు. నిత్యవ్యవహారానికి ఆ ఒత్తిడి అడ్డంకుగాలేదు. ప్రత్యేకించి గమనిస్తే తప్ప వాతావరణంతో మనకు ప్రసక్తిలేనట్లే కనిపిస్తుంది.

అంతకన్న అద్భుతమైనది గురుత్వాకర్షణబలం. ఈబలం మూలంగానే నక్షత్రగ్రహాలు గతులు తప్పకుండ చరిస్తున్నాయి. ద్రవ్యంతోపాటు ఈబలం ప్రదర్శితమౌతుంది. రెండు ద్రవ్యఖండాలు పరస్పరంగా ఆకర్షించుకొంటాయి. ద్రవ్యఖండ పరిమాణంతో ఆకర్షణబలం హెచ్చగుతుంది. వాటిదూరం హెచ్చినకొద్దీ ఆకర్షణ తగ్గుతుంది. భూతలంపైనున్న యావద్వస్తు సమూహాన్ని భూమి తన గర్భముఖంగా ఆకర్షిస్తూంది. అగుట ఏవస్తువు పైకెగురవేసినా క్రిందపడుతుంది. వాతావరణంలోని వాయువులను పైకి పోనియ్యకుండా బంధించి ఉంచినది ఈబలమే. సూర్యునిచుట్టు గ్రహాలచే నిత్యప్రదక్షిణాలు చేయిస్తున్న దీబలమే. భూమి చుట్టు చంద్రుని తిప్పుతున్న దీబలమే. ఒక్కొక్కనక్షత్ర కూటంలోని నక్షత్రాలచే సంఘీభావంతో ఏక కుటుంబికులట్లు ఆకాశయానం చేయిస్తూన్నదీ బలమే. ఒకటేమిటి జగత్తులోనున్న నక్షత్రగోళాలు స్వైర విహారంచేస్తూ ప్రమాదకరమైన అన్యోన్య సంఘాతాలకులోనై జగత్ప్రళయం తెచ్చిపెట్టకుండా వాటిని చక్కని మార్గాలలో చరింపచేస్తున్నదీ ఈ బలమే.

మహత్తరమైన ఇట్టి గురుత్వాకర్షణబలం ద్రవ్యంలో అంతర్భూతమైనట్లు పొడకట్టుతుంది. మానవ శరీరం ద్రవ్యంతోనే ఏర్పడిఉంది. అస్తి చర్మాలు, రక్తమాంసాలు ద్రవ్యమే. ఈద్రవ్యంకూడా గురుత్వాకర్షణ బలానికి లొంగి ఉండవలసినదే! భూమితోపాటు మనంకూడా సూర్యగ్రహ నక్షత్రాలచే అకర్షింపబడుతున్నాం; భూమితోపాటు చంద్రుని ఆకర్షిస్తున్నాం, చంద్రునిచే ఆకర్షింపబడుతున్నాం. అమావాస్య పూర్ణిమ దినాలలో సూర్యచంద్ర గోళాలు రెండుకలసి భూమిని అధికంగా ఆకర్షిస్తున్నాయి. ఆ రోజులలో

సముద్రకెరటాలు పెల్లుబుకుతాయి, ఉన్మత్తులు కట్టు తప్పుతారని ప్రతీతి. సామాన్య మానవస్వభావంలో ఆ దినాలందు ఎట్టి పరిణామమంకలుగుతుందో చెప్పలేము.

అయితే మనభూమిస్వభావం ఎట్టిది? భూతలం విద్యుదయస్కాంతక్షేత్రం, అది వివిధ కిరణ జాలానికి గురియైనది; వాతావరణంచే పీడింపబడుతూంది; గురుత్వాకర్షణ బలాధీనమైఉంది. అనేక ప్రకృతి శక్తులకు నాట్యరంగమైన భూతలంపై నివసిస్తూన్న మానవుడు వాటి ప్రాబల్యానికిలోనై జీవితంగడుపుతున్నాడన్న విషయం నిర్వివాదం. అట్టి సందర్భంలో తన ఇష్టానుసారం ప్రవర్తించడానికి తనకార్యక్రమం కొనసాగించుకోడానికి, ప్రకృతి శక్తులను ప్రతిఘటించవలసి ఉంది. వాటితో నిరంతర సంగ్రామానికి యుక్తమైన సామగ్రి ఆయిత్తపరచవలసి ఉంది.

(ఇంకా వుంది)

## పయనముగండీ!

శ్రీమతి అడుసుమల్లి సరస్వతీదేవి

కన్నతల్లీ యూరడిల్లుము
కాలము మారిందోయమ్మ
భారతమాత దుఃఖము బాప
భారత స్త్రీలే పయనమవ్వడీ
భారతపుత్రుల శౌర్యంబేమొ
మొక్కపోయెనని తెలుసుక మీరు
భారతమాత దాస్యము బాప
ఆంధ్రమహిళలే పయనమవ్వడీ
దాస్యశృంఖలముల విదిలించివేసి
పూర్వశక్తులు మీలో పొడెమెనని
భారతమాత దాస్యము బాప
స్వతంత్ర మహిళలే పయనమవ్వడీ
వంటయింటికి స్వస్తిని చెప్పి
వంటసామగ్రికి గుడ్‌బై చెప్పి
భారతమాత శోకము బాప
హైందవస్త్రీలే పయనమవ్వడీ
వీరాంగనలను మదిని తలంచియు
వీరనారుల చరిత్రల చదివియు
భారతమాత ఆర్తిని బాప
భారతస్త్రీలే పయనమవ్వడీ
మాగంటి అన్నపూర్ణను
విమలఝాన్సి వీరాంగనలను
పూనికతో మీ మనమందు నిల్పి
భారతమాత తృష్ణనుదీర్చ
భారతమహిళలే పయనమవ్వడీ
గరిటమూలను శౌర్యవైచియు
కత్తి, కలముల రెంటిని బట్టి
హైందవతల్లి శోకముబాప
భారతపుత్రికలే పయనమవ్వడీ
తిని తిరుగుచు దిద్దుక కూర్చుంటం
కాదు మీపని ఇప్పుడు రండీ
మీ మాతృ మూర్తి శోకముబాప
స్వతంత్ర మహిళలే పయనమవ్వడీ
కన్నతల్లిని పరులకిచ్చియు
తల్లిదాస్యము జేయ జూచుట
పాడిగాదది మన కెల్లరకును
ఆంధ్రమాత దుఃఖము బాప
స్త్రీలే స్వయముగ లెండీ రండీ
కోట్లకొలదియు బిడ్డలుండియు
భరతమాత దుఃఖించుచుండ
పూరకచూస్తూ యుండక మీరు
సంతోషముతో స్వాతంత్రముకై
నేడే పయనముగండీ రండీ

# కొళాయిదగ్గిర

— శ్రీ సత్యదుర్గేశ్వర కవులు —

(శతావధానులు)

అది బజారువీధి. ఈ కథానికలోని సన్నివేశసమయం ప్రాతఃకాలము. అప్పుడే సూర్యభగవానుడు ముడుచుకుపోయిన ముఖ పద్మాలను చేతులతో విడదీశాడు. మొఖాలు కడిగికొనేవాళ్లు, గోదావరీ స్నానానికి పోయేవాళ్లు, వీధులూడ్చుకొనేవాళ్లు, ముగ్గులుపెట్టేవాళ్లు—ఇల్లాగే ప్రకృతి ధర్మాలతో నిండిఉంది లోకం అంతా.

అదేవేళకు ఎక్కణ్ణుంచో ఓ జట్కావాలా చరాచరావచ్చి మాషాపుకు దగ్గిరగాఉన్న కొళాయి దగ్గిరకుచేరి గుఱ్ఱానికి నీళ్లెట్టుకుంటున్నాడు. అదేసమయంలోనే పొరుగింటి పుల్లమ్మగారి కూతురు లక్ష్మీదేవి 16 ఏళ్లపిల్ల-ఒడ్డూ, పొడుగూ, లావూ అన్నీ అతికినట్టుగా అమర్చబడిన వ్యక్తి-బిందె చేత్తోబుచ్చుకొని నీళ్లకు చక్కావచ్చింది. నేనా పక్కింట్లోనే కాపురముంటూ ఆ సమయానకి వీధిలో అరుగుమీదకూర్చొని బంట్రోతింకాపందుంపుల్ల తేలేదేమా? అని చూస్తున్నాను. సరిగ్గా ఈ దృశ్యం నాకళ్లబడింది. సావకాశంగా పరిశీలించాను. ప్రపంచంగో లింకా యేమీ తెలియని ఆ అమ్మాయిదృష్టి ఏదో మోస్తరుభావంతో ఆ జట్కాకుఱ్ఱాడిమీద ప్రసరించిందా? అనే అనుమానం తట్టిందినాకు. జట్కాకుఱ్ఱాడుగూడా ఎఱ్ఱగా, బుఱ్ఱగా నిగ్గుదేరిన క్రాపింగుజుట్టూ వగైరాతో డ్రామాయాక్టరులా బాగానే ఉంటాడు. వాడుకూడా ఈపిల్లకేసి ఏదోమోస్తరు వెర్రిచూపు చూచాడనే నానమ్మకం. లేకపోతే ప్రణయప్రళయం ఒప్పే చిరునవ్వు ఇద్దరూ ఒకేసారి నవ్వడం ఏలా సంభవిస్తుందీ అని నాఅనుమానం. ఏమైతే ఎందుకు? అప్పటి ఈ గొడవతప్ప అప్పటికి మరేమీ నాకు విషయాలు తెలియనేలేదు. మరోరెండు గంటలకు ఆ అమ్మాయి తమ్ముడు, ఆ అమ్మాయి ఆబండిమీదే వెళ్లుతూఉండడం చూశాను. అంతే? ఆమధ్యాహ్నం భోజనానికింటికివచ్చేటప్పటికి మాఆవిడ ఎంతోఆశ్చర్యంగా మొదలెట్టింది చెప్పడానికి.

'ఏమండోయ్! మీకోసంగతి చెప్పుతున్నాగాని ఎవరితోటీ చెప్పకండేం? వాళ్లకుతెలిస్తే బాగుండదు' అంది.

నేను:- నువ్వు చెప్పినాసరే? చెప్పకపోయినాసరే? ఆకథా సరళి బాగుండి కొట్లో బేరాలేమీ రాకపోతే సావకాశంగా కూచుండి చిన్నకథగానో, పద్యాలుగానో, నాటకంగానో రాయడంమాత్రం మానను.

మా ఆవిడ:-పేర్లతోటే రాస్తారా ఏమిటి? అప్రదిష్ఠ. ఎవరేనా ఏమనుకుంటారు? అంది మళ్లానూ.

నేను:-ఏమనుకుంటారు? ప్రకృతినే చిత్రిస్తాడండీ! ఎంతగొప్ప వ్యక్తిఅండి! అనుకుంటారు. తెలిసిందా?

మాఆవిడ:-చాల్లెండి! అల్లాఅయితే నేను చెప్పనే చెప్పను. అని మూతి బిగించుకొంది. సరేలే అని కిమన్నాస్తిగా మాటాడకుండా రెండు మెతుకులుతినేసి గదిలో పడుకొన్నాను.

పిల్లల్ని వాళ్లని సర్దుకొని రెండుమెతుకులుతిని ఏదోపనిమీద గదిలోకొచ్చి పెట్టెలుసవరించుకొంటుంది మాఆవిడ. అప్పుడే సమయంఅనుకొని మెల్లిగా కదలేశాను ప్రొద్దుటిగొడవ. 'ఆ అమ్మాయి యిల్లాచేసిందేమిటే?' అని. 'ఆఁ, అవును ఆ అమ్మాయికథే మీతో ప్రొద్దున్న చెప్పాలనుకున్నాను. అప్పుడే మీకుకూడా తెలిసిందీ?' అంది.

'ఆఁ, ఏదో! తెనిసిందిలే. కవినవడంచేత ఒకటేమిటి? అన్నివిషయాలు భావనామాత్రంచేతే ఊహించగలను. అసలు విషయమేమిటేమిటి?' అన్నాను కొంటెతనంగా—

'మీరు కవులుగా ఊహించేశక్తి ఉండగా నన్నడగడం ఎందుకు?' అంది నవ్వుతూ.? అంటే మా ఆవిడ ఆరోక్లాసుదాకా చదువుకుందిలెండి చిన్నప్పుడు; అంచేతే, తండ్రిగారి లౌక్యంకొంత తల్లిగారి అమాయకత్వం కొంత ఆవరించాయి; ఆహేతువువల్లే చెప్పకూడదని అనుకొనిగూడా ప్రసక్తి గూర్చిఅడిగితే చెప్పేస్తుంది. ఇట్టే మళ్లా అందరితోనూ చెప్పదుసుమండీ! యావన్మంది ఆడాళ్లతోనూ—నాతోనూ, ఇంతే. ఇంకేముందీ మొదలెట్టిందిల్లా—

'మనపొరుగింటి పుల్లమ్మగారి కూతురు లక్ష్మీదేవిమొగుడు పాపం చిన్నతనములోనే పోయాడు. లక్ష్మీదేవిపెరిగి పెద్దదయింది. వాళ్ల నాన్నగారు చదువులో ప్రవేశపెట్టారు. చదువుఅంటే ఆ అమ్మాయి కెంతోయిష్టం కూడాను; రోజూ స్కూలుకు కాలినడకనే వెళ్లి వస్తూఉండేది. కొన్నాళ్లక్రితమే వాళ్లనాన్నగారు చనిపోయారుగదా? వాళ్లఅమ్మగారు పూర్వాచార పరాయణురాలవడంవల్ల చదువు మాన్పించేసింది. కాని ఆ అమ్మాయిక్లాసులో కల్లా బాగాచదివేదవడం చేత పాపము ఆమేష్టరుగారే వాళ్ల అమ్మనేలాగో ఒప్పించి జీతం వగైరాలన్నీ ఆయనే కట్టుతో మళ్లా చదివించడానికి మొదలుపెట్టించారు. అప్పట్లో రోజూ స్కూలుకు తీసుకొచ్చేందుకు ఓ జట్కాబండినికూడా మాట్లాడి, వాడికి నెలకు ఒకమాటే ఇంతని యిస్తోండేవారుట. సరే క్రమంగా పెళ్లి అయిందో? లేదో? ఇదివరకు తెలియని ఆ అమ్మాయి పడుచుదనం ఆ జట్కావ్రాడికి కొంచెం లొంగే సూచన కనిపించినట్టుంది. మెల్లిగా ఏలాగో వాళ్లిద్దరికిగూడా మనము వివాహం చేసుకోవాలనే బుద్ధి పుట్టింది. వాళ్లమ్మ కీసంగతి తెలుస్తే శరీరాన్ని కూరతరిగినట్టు తరిగేస్తుంది. అనే భయం ఉంది లోపల—ఇంట్లో చాకిరీ చేస్తూనేఉండేది. స్కూలుకు వెళ్లుతూనే ఉండేది. కాని యిదివరలోకన్న ఇప్పుడు సాయంత్రంవేళ యింటికి రావడంమాత్రం ఆలస్యంగా ఉండేది. ఇదేమే? అని వాళ్ల అమ్మ అడిగితే మేష్టారు ప్రయివేటు చెబుతున్నారే అని మభ్యపెట్టి సర్దుకొనేది. అల్లా సుమారోసంవత్సరంనుంచి జరుగుతోంది కాబోలు. ఈ యేడాది పరీక్ష తప్పింది. దానికోసం వాళ్లమ్మ కోతకోసేస్తూ ఉంది. ఇంక భరించలేక పోయింది కాబోలును. ఈవేళ వాడితోగలిసి లేచిపోయింది. అవునుగాని వెధవముండకు చదువెందుకండి? వాళ్ళమ్మకు బుద్ధిలేదుగాని. వాళ్ళకూ చదువుచెప్పిస్తే గౌరవాలు తగులబడిపోతాయి గాని, ఇంకేమేనా నిలుస్తాయా?'—అని తన సిద్ధాంతాన్నిగూడా చిట్టచివర తేల్చేసింది మా ఆవిడ. 'అదికాదో వెంకాయీ. నువ్వు చిన్నప్పుడు ఎందుకు చదువుకున్నావూ?' అన్నాను నేను.

మా ఆవిడ :-చాల్లెండి. ఆపిల్లకి నాకు సాటితెచ్చారా ఏమిటి?

నేను :-సాటి తేవడం కాదు. చదువుకోవడం జ్ఞానంకోసం. జ్ఞానం ఎప్పుడూకూడా ఒక కట్టుబాటులో నడిపిస్తుంది. దానివల్ల గౌరవం, కీర్తి దేశంలో కలుగుతాయి. ఆ అమ్మాయి చదువుకుంది.కనుకనే దేశానికి ఆదర్శంగా ప్రేమను చరితార్ధంచేసింది. ప్రేమకు హృదయంలో పొంగే ఉత్సాహంతోనేగాని జాతి మత భేదాలతో నిమిత్తం ఉండదు అనికూడా తేల్చింది. అదీగాక ఈ అమ్మాయి భర్త పెళ్లిఅయిన స్వల్ప కాలంలోనే చనిపోవడంవల్ల, ఆ అమ్మాయికూడా కన్యకలలోకే జమ వస్తుంది గాని వెధవలలోకి రాదు. కాబట్టి సర్వవిధాలా అపభ్రష్టయి పాడైపోకుండా లేచిపోవడంవల్ల మాబోటి కవులు, కథకులు అంతా ఆమె జీవితాన్ని ప్రపంచానికి ఆదర్శప్రాయంగా రాసి, ప్రకృతికి అలంకారంగా, సంఘానికి దోహదంచేస్తూ ఉంటారు. ఏదో చదువుకున్నా లోకజ్ఞానం లేకపోవడంవల్ల మీ సిద్ధాంతాలు అన్నీ ఈలాగే ఉంటూ ఉంటాయి.

మా ఆవిడ :-ఇంక చాల్లెండి. మీ నోరు ఎప్పుడూ నా చదువునుగూర్చే లెక్చర్లిస్తూ ఉంటుంది. అలాంటివారు ఈ లోకజ్ఞానంలేని చదువుకొన్న పెళ్లాం వద్దని ఆనాడే చెప్పేయలేక పోయారా? మంచి లోకజ్ఞానం వుండే పెళ్లాం వచ్చేది—అంటూ కపటంగా అభినయిస్తూ రెండుమార్లు ఎత్తిపొడిచి కుర్రాడు లేచి ఏడుస్తూవుంటే చక్కా వెళ్లిపోయింది. సరే, నేనుగూడా షాపుకు పోదామని డప్పా డవాలూ తగుల్చుకొని బతాలుదేరాను; దారిలో ఆలోచించుకొంటూ స్టోరీ ఏలా మొదలుపెడితే బ్భాగుంటుందా? అని. ఇంతట్లోకే నా చిరకాల స్నేహితుడు రామారావు కనుపించాడు దారిలో—

'ఏమిరోయి! బహుకాలదర్శనం. ఎక్కడుంటున్నావేమిటిప్పుడు?' అన్నాను.

వాడు :-ఎక్కడేమిటి ఈమధ్య సుమారోసంవత్సరం దగ్గిఱ్నుంచీ ప్రపంచంలోనే వుంటూవుంట ఒకచోటా? ఒకదేశమా? దేశాలన్నీ తిరుగుతున్నాను—అన్నాడు.

నేను :-అదేమిటోయి? సాధువుగారికి మల్లే చెబుతున్నావ్?

వాడు :-అసలుకథ విను మరి చెబుతాను. నేను బెజవాడలో చెరుకుపల్లి జమీందారుగారి దగ్గిర వుద్యోగం చేస్తున్నాను. వాళ్ల మేనల్లుడీమధ్యే అంతా ఓసంవత్సరం సుమారవుతుందిలే?-ఇంట్లో అత్తగారేదో అందని ఎవళ్లతోటీ చెప్పకుండా బిచాణా ఎత్తేశాడు. జమీందారుగారికి ఆ కుర్రాడంటే పంచప్రాణాలూను. తనకున్న ఒక్కకూతుర్ని వాడికిచ్చి పెండ్లిచెయ్యాలనికూడా వుత్సాహపడుతున్నాడు. ఇంతట్లోకే వాడికేమి తోచిందో, లేచి చక్కాపోయాడు. ఎక్కడున్నా వెతికి తీసుకురావాలని చెప్పి నన్నూ ఇంకా కొందర్ని తలోచోటకూ పంపించాడు మా జమీందారుగారు. వెతగ్గా వెతగ్గా కొవ్వూర్లో ఒకాయన చెప్పేడు. 'ఈ వూళ్లో జట్కాబండి తోలుకుంటున్నా'డని సరే, అనిచెప్పి ఈవూరు వచ్చాను—అన్నాడు.

నేను :-ఈ వూళ్లో జట్కాబండి తోలుకుంటూ ఒక విలక్షణరూపంగల కుర్రాడయితే వున్నాడు కాని, వాడి తాలూకు ఫోటో ఏమైనా వుందా నీదగ్గిర—అన్నాను. ఉందని చూపించాడు. బాగా పరిశీలించాను. నేను ప్రొద్దున్నచూచిన విగ్రహానికి దీనికి ఏమీ భేదం కనిపించలేదు నాకు. 'సరే ఈకుర్రాడయితే ఈవూళ్లో ఉన్నాడు కాని ఇవ్వాళ ప్రొద్దున్నే ఒక విధవ అమ్మాయిని తీసుకొని లేచిపోయాడురా' అని మెల్లిగా జారవిడచాను మాట.

వాడు ఆలోచిస్తూ 'సరే. ఆ అమ్మాయి తాలూకువాళ్లెవళ్లేనా ఉన్నారా? ఈవూళ్లో' అన్నాడు.

'లేకేం? అమ్మాయితల్లీవాళ్లూ ఉన్నారు. మా యింటిపక్కదే కూడ వాళ్లిల్లు'

వాడు:-ఊహుఁ;

నేను:-అయితే, ఈ జమీందారుగారికుల మేమిటిరా?

వాడు:-బ్రాహ్మణాళ్లే నోయ్. వీళ్లెల్లాగైనా పట్టుకొని తీసుకుపోవాలిరా. లేకపోతే మాజమీందారుగారు నుయ్యో, గొయ్యోఁ చూచుకుంటాడు. అంతతో మాకూట్లో దుమ్ముపడుతుందికూడాను.

తిన్నగా మాయింటికివెళ్లేము. నన్ను వదలిపెట్టి వాడుతిన్నగా పుల్లమ్మగారింటికివెళ్లి మళ్లా పది నిముషాల్లోవచ్చి, 'ఒరేయి, వంటా పెంటాచేయించకు. మళ్లావచ్చినప్పుడు భోంచేసిపోతానుగాని ఆకుర్రాడు ఆ అమ్మాయి కలిసి వాళ్లమేష్టరుతో కాకినాడ వెళ్లారుట. వాళ్ల మేష్టరేమో యింటికి కబురుచేసారుట. అక్కడ ఇద్దరికీ పెళ్లిచేస్తారట రేపో మాపో?' అంటూనే బిచాణా చేత్తోపట్టుకుని 6 గంటల డీసెల్ కారకు బయలుదేరాడు. 'ఒరేయి, సంగతేంజరిగిందో వుత్తరంరాయరోయ్' అన్నాను జట్కాలోవాడు వెళ్లుతుంటే—

రెండురోజులకి నామిత్రుడిదగ్గిర్నుంచి నాకీక్రింది యుత్తరంవచ్చింది.

"క్షేమము ప్రియమిత్రుడికి రామారావు వ్రాయునది—

నిన్న తెల్లవారేసరికి కాకినాడనుంచి మేష్టారుతోగూడా అమ్మాయిని అబ్బాయినీగూడా బెజవాడ చేర్చాను. అందటి ప్రాణాలూ ఆత్మల్లోకి చేరేయి. కాని, మొదట్లోని మీవూరి అమ్మాయిని ప్రేమించిన వరుణ్ణి మా జమీందారుగారి కూతురు ప్రేమించినా, కడవలునిండేలాగు కన్నీరుకార్చినా, (అతడింట్లోంచి లేచిపోయాడని లే) పెళ్లిచేసుకుంటుందా? అని అనుమానించాను. కాని ఆలాంటి వుపద్రవాలేమీ లేకుండానే పీర్లగుండాన్ని బడ్డాయి. మేష్టరుగారు పెట్టిన ముహూర్తాన్నే ఇద్దరూకూడా అతణ్ణే పెండ్లిచేసుకోడానికి ఒప్పుకున్నారు. చేసుకొంటున్నారుగూడా. ఇంతకీ కుర్రాడదృష్టవంతుడోయి—మరి నేను దిగడ్తాను.

రామారావు"

ఈ వుత్తరాన్ని చదువుకొని మళ్లా ఒక్కమారు ఆనాటి కొళాయిదగ్గిర దృశ్యాన్ని ఆత్మలో అవగతంచేసుకున్నాను. నిశ్చలప్రేమను గౌరవస్వాతంత్ర్యంతో మేళగింపజేసిన ఆ అమ్మాయి దేశానికి ఆదర్శప్రాయమయింది అని సంతోషించాను. సంతోషించడమే కాదు. నా సంతోషమే మొన్నవచ్చిన గోదావరీ నదిలా పొంగి ఈ వ్యాసమనే గట్టును తెగ్గొట్టి ప్రవహించింది హాయిగా; ఆ సంతోషాన్నే మీ అందరికీకూడా పంచిపెడుతున్నాను.

---

న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి,
హవిషాకృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే.

ఇంద్రియజయముచే నేమి లాభము కలదు. విషయసుఖము లనుభవించుటచేతనే యింద్రియములు తనివి నొందును అని శంకించి సమాధానము చెప్పబడుచున్నది—కామము (కోరిక) విషయాభిలాషముచేత నెప్పటికిని దనియదు. ఆజ్యాహుతిచే నగ్నిహోత్రుఁడు ప్రవర్ధిల్లినట్లు మఱిమఱి వృద్ధినొందుచునే యుండును.

—మనుధర్మశాస్త్రము.



# బాలభాగ్యం

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

రేడియో మామ కబుర్లు

★ శ్రీ ఏడిద కామేశ్వరరావు
(రేడియో ప్రసంగం)

## "రొట్టీ, బిస్కెట్"

**చూడండి, అమ్మాయిలూ—మీరు రోజూ రొట్టీ, బిస్కట్టూ తింటూనే వుంటారు. 'బలే, తియ్యగావున్నాయ్'అని గంతులువేస్తూ తింటారు—మరి ఇవి ఎలాతయారు చేస్తారో మీకు తెలుసా? చూడండి మీకా విషయం చెప్తాను—**

"రొట్టీ, బిస్కెట్—రొట్టీ, బిస్కెట్" అని కేకలువేస్తూ రొట్టెలు, బిస్కట్టులు జంగిడిలో పెట్టుకొని అమ్ముతూ వీధులంట రావడం రోజూ మీరు చూస్తూనేవుంటారు. ఆ కేక వినేసరికి ఒక రొట్టో, బిస్కట్టో అమ్మచేత కొనిపించేదాకా వూరుకో బుద్ధివెయ్యదు కూడాను.

ఈ రొట్టె తియ్యతియ్యగా బాగానే వుంటుంది తిండానికి. బిస్కెట్లుమాత్రం ఎన్నితిన్నా, తినాలనే వుంటుంది రొట్టికంటె తియ్యగా. అయితే ఇవి తినడానికి ఎంతరుచిగా వుంటాయో, వాటిని తయారు చేయడంకూడా అంత తమాషాగా వుంటుంది.

అసలు ఇవి వేటితో తయారుచేస్తారూ అంటే, మనవాళ్లు 'మైదాపిండి, మైదాపిండి' అనేస్తారు. ఇది కొంతవరకు నిజమైనా, అసలైన మంచి రొట్టెగాని, బిస్కట్టుగాని యీ మైదాపిండితో తయారు చెయ్యడం అంత మంచిదిగాదు. కాని వీటినే గోధుమపిండితో తయారుచేసినట్లయితే మైదాపిండితో చేసిన వాటికంటె మంచి రుచిగా వుండడమే కాకుండా, వంటికి మంచి ఆరోగ్యంకూడాను. మైదాపిండి అనేది అదోకరకం పిండి. దానిలో మన శరీరానికి బలాన్నిచ్చేటటువంటి గుణాలట్టే లేవు. అయినా రుచికిమాత్రం గోధుమపిండిలా వుండటంవల్ల దీన్నికూడా వాడుతూవుంటారు. కాని యీ పిండి గోధుమపిండి అంత మంచిది కాదు. ఆవుపాలముందు డబ్బాపాలులాగే ఇది కూడాను.

అసలు గోధుమలుత్తోటే ఈ రొట్టె తయారుచేయడం మంచిదని మనం తెలుసుకున్నాము. అయితే యీ గోధుమలు మనదేశంలో ఎక్కడెక్కడ పండుతాయో ఆ వివరాలుకూడా తెలుసుకోవద్దు మరీ?—

గోధుమలు మీరందరూ చూచేవుంటారు. వడ్లగింజల్లాగే లావులోనూ, పొడుగులోనూ సమానంగా వుంటాయి. అయితే వడ్లగింజలా గరుగ్గా వుండకుండా ఒకప్రక్కన పొడుగునా పగిలివున్నట్లుంటాయి. రుచిలోకూడా పచ్చివి తిన్నా బియ్యంకంటె తియ్యగా వుంటాయి. మనదేశంలో ధాన్యానికి తరువాత ఈ గోధుమలే ఎక్కువ పండుతాయి. ముఖ్యంగా ఉత్తర హిందూస్థానంలోను, ఉత్తరాన్ని వున్న సంయుక్త రాష్ట్రాలలోను, బెంగాలురాష్ట్రంలోనూ, పడమటగా పంజాబులోనూ వీటిని ఎక్కువగా పండించుతారు. ఆ మాటకొస్తే పంజాబురాష్ట్రంలో యీ గోధుమలు పండినంత ఎక్కువగా మనదేశంలో మరియెక్కడా పండవు. పంజాబులో 'లైలాపూరు' అనే చోటు గోధుమపంటకి చాలా ప్రసిద్ధి. ఒక కోటీ యెనభైలక్షల టన్నుల గోధుమలు ప్రతి సంవత్సరమూ మనదేశంలో పండుతున్నాయి. ఇందులో సగానికి పైగా యీ పంజాబురాష్ట్రంలో పండుతూవున్నాయంటే, ఇక్కడ ఈ పంట ఎంత సమృద్ధిగా వుందో మనం తెలుసుకోవచ్చు.

ఈ గోధుమలని పండించడంకూడా మనం వడ్లు పండించుకునే మాదిరిగానే పండిస్తారు. జూన్, జూలై మాసాల్లో తొలకరివానలు ప్రారంభమవగానే మనం ధాన్యానికి అనుమళ్లు పోసినట్లే వీటిక్కూడా అనుమళ్లు పోస్తారు. ఆ తరువాత వాటిని పెద్దచేలల్లో ఊడుస్తారు. మన వరిచెట్టును మల్లేనే ఇదికూడా చిన్న దుబ్బులా పెరుగుతుంది. కాని, వరిదుబ్బుకన్న యిది కొంచెం పెద్దగా వుంటుంది. వెన్నుకూడా పెద్దదిగానే వుంటుంది. ఈ గోధుమచేను బాగా ఎదిగిన తర్వాత చేనులో నుంచుంటే మొలయెత్తువరకూ వస్తుంది.

గోధుమధాన్యం బాగా పంటకొచ్చినతర్వాత, కుప్పనూర్పు మొదలయిన వ్యవహారమంతా వరిపంట మాదిరిగానే వుంటుంది. అయితే మన ధాన్యంమాదిరిగా గాక వీటిని కొంచెం బాగుచేయవలసి వుంటుంది. దీనిమీద పొట్టు చాలా ఉంటుంది. గింజకి వెన్నుపట్టుకూడా కొంచెం ఎక్కువ వుంటుంది. అందుచేత యీ పొట్టు అంతా పోకపోతే, మంచి గోధుమధాన్యం రావు. నిజంగాచూస్తే మనం చూసే గోధుమలు గోధుమబియ్యం—కాని గోధుమధాన్యం కావు.

గోధుమపంట మన చెన్నరాజధానిలో అసలు లేనేలేదు. మచ్చుకైనా పండేచోటు ఒక్కటికూడా లేదు. కారణమేమిటంటే మన రాజధానిలో వున్న శీతోష్ణస్థితి, నేలసారం యీ పంటకి అనుకూలంగా లేవు. ఈ పంటకి మంచి వేడిప్రదేశం వుండాలి. పగలు ఎంత ఎండ వుంటుందో రాత్రి అంత మంచు, చలీ వుండాలి. భూమిలోకూడా మాంచి సారం వుండాలి. పంజాబు మొదలైన ఉత్తరదేశాల్లో గోధుమపంటకి అనుకూలమైన పరిస్థితులు అన్నీ ఉండటంచేత అక్కడ యీ పంట ఎక్కువగా పండుతోంది.

మనదేశంలో వేడి, చలికూడా సమానంగా వుంటాయి మనది సమశీతోష్ణమండలం గనక. పంజాబు మొదలయిన రాష్ట్రాలలో మనలా కాక పగలు రోళ్లుపగిలే ఎండ, రాత్రిళ్లు వొళ్లు చిల్లుంపడే చలీని. అంచేత యీ పంటకి కావలసిన పరిస్థితులు సరిగ్గా అక్కడ వుండటంచేత బాగా పండుతోంది. ఇక్కడ మనకి

వరిపంట ఎంత ముఖ్యమో అక్కడివాళ్లకి యీ గోధుమపంట అంత ముఖ్యం. మనం బియ్యం వండి అన్నం తిన్నట్లుగానే వారు గోధుమల్ని విసిరి, పిండితోటి చపాటీలని అట్లుగా చేసుకు తింటారు.

గోధుమలని బాగా విసిరితే నూక, పిండి వస్తుంది. ఈ గోధుమనూకని ఉప్మా మొదలైనవాటికి మనం బాగా వాడతాము. బొబ్బట్లు వండుకుంటే గోధుమపిండిని వాడతాము. అంతకంటె తరుచుగా యీ పిండిని మనం వాడము. కాని యీ పిండితోటి రొట్టె, బిస్కట్టు చేసుకోనేందుకు—ఇది ఎక్కువగా ఉపయోగ పడుతుంది.

అయితే మనమందరమూ తయారుచేసుకోగల్గుతున్నామా? లేదు. కారణమేమిటంటే, రొట్టెలు గాని, బిసకట్లుగాని తయారుచెయ్యాలంటే, దానికి చాలా చాకిరీ వుంది. చాకిరీయే కాకుండా అది ఒక పెద్ద పని, పనిముట్లు కావాలి. ఈ పనిముట్లు లేకపోతే వీటిని సరిగ్గానూ, బాగానూ తయారుచేసుకోలేము.

రొట్టెలు తయారుచేయడానికి మెత్తని పిండి కావాలి. గోధుమలని మెత్తగా, కాటుకలా విసురుతారు ముందు. ఆ పిండిని కొంచెం నీళ్లతో తడిపి కొంచెం ఉప్పువేసి బాగా కలియబెడతారు. 'కడుపునొప్పి సోడా' అని బజారులో అమ్మతారు—అదికూడా కొంచెంపాటి వేస్తారు కూడాను. ఈ ముద్ద బాగా జిగురు పాకం వచ్చేవరకు మర్దిస్తారు. బెల్లపుజీళ్లు చెయ్యడం మీరు చూచేవుంటారు. బెల్లాన్ని పాకంపట్టి జీళ్లు చెయ్యడానికి ఎల్లాగ సాగదీస్తారో అలాగే దీన్నికూడా సాగదీస్తారు. ఈలా మర్దించడం సుమారొక పూటవరకూ చేస్తేనేగాని సరియైన జిగురుపాకం రాదు. ఈ రొట్టెలు చేసేవాళ్లవద్ద వీటికోసం పెద్దపెద్ద బల్లలుంటాయి. బల్లకి కొంచెం నెయ్యిరాసి దీన్ని బాగా మర్దిస్తారు. అప్పుడు దీనిలో ఏలకులు, ద్రాక్షపళ్లు, జీడిపప్పు కొంచెం కొంచెంవేసి బాగా కలియబెడతారు.

ఇక వీటికి, అంటే రొట్టెలు చెయ్యడానికి డబ్బాలుంటాయి. ఇవి సీనారేకుతోటి గదులు పెట్టెలోని అరల్లాగ చిన్నచిన్న తొట్టెలు తయారుచేసివుంటాయి. ఆ తొట్టెలకి కొంచెం తడీపొడీగా నేయి రాసి బాగా మర్దించిన యీ పిండిని తొట్టెలలో మూడువంతులువరకు వేస్తారు. నిండా వేస్తే కాలినప్పుడు పొంగుతుంది కాబట్టి, పొంగి కిందబడిపోకుండా సగానికి కొంచెం పైగా మాత్రమే వేస్తారు. ఇక వీటిని కాల్చడం కొంచెం గమ్మత్తుగా వుంటుంది—

బజారులో బటానీలు వేయించడం మీరు చూచేవుంటారు. పెద్దపొయ్యి ఒకటివుంటుంది. దాని క్రింద కణకెణలాడుతూ నిప్పులుంటాయి. పైని ఒక పెద్ద ఇనపమూకుడుంటుంది. ఆమూకుడులో ఇసకవేసి, దానిలో పచ్చి బటానీలువేసి అవి వేగినతర్వాత ఇనపజల్లెడతో దేవితే ఇసక క్రిందకు కారిపోయి వేగిన బటానీలు జల్లెడలో మిగులుతాయి.

ఇదిగో, యిలాంటిపొయ్యే ఒకటిఉంటుంది యీరొట్టెలు కాల్చడానికికూడా. బటానీలపొయ్యికి వున్న బూర్లమూకుడుకు బదులు దీనికి పొయ్యిమధ్యలో ఇనపఊచలు ఉంటాయి ఒకదానికిఒకటి దగ్గరగా మన ఘామూలు మట్టికుంపటికి వున్నట్లు. క్రిందనుంచి మంట యీ వూచలసందుల్లోంచి సన్నంగా, సమంగా పైకివస్తుంది. ఈ వూచలమీద పెడతారు పిండితో నింపిన యీబ్బాలతొట్టెలని ఒకదానిప్రక్కని ఒకటి. ఆ

తరువాత ఒక పెద్ద రేకుమూతవేస్తారు పొయ్యిమీద. సరిగ్గా లెఖ్ఖప్రకారం 20 నిమిషాలు అలా మంటలోవుంచి డబ్బాలన్నిటినీ తీసివేస్తారు. మంటకొంచెం ఎక్కువైతే రొట్టెలు మాడిపోతాయి. తక్కువైందంటే, రొట్టెలు కాలనూకాలవు, పొంగనూపొంగవు. అందుకోసం లెఖ్ఖప్రకారం వేడితగలాలి. ఈలా తయారుచేసిన రొట్టె దూదిపింజలా పొంగి, మెత్తగావుంటుంది. పాలల్లోకొంచెం పంచదారవేసుకొని రొట్టెను ముక్కలుచేసుకొని ముంచుకుతింటే ఎంతో రుచిగావుంటుంది, వంటికి మంచిబలంకూడాను.

మామూలుగా మనంతినే అన్నంకన్నాకూడా యిది చాలాబలం. మనదేశపు శీతోష్ణస్థితికి ప్రతి రోజూ వీటినే తిని హరాయించుకోలేము. పైగా బియ్యంవాటికన్న యివి ఖరీదుకూడా కొంచెంఎక్కువ.

అందుకే మనవాళ్లల్లో జ్వరంవస్తే రొట్టె, పాలు ఇస్తారు. పొట్ట బద్దలయ్యేటట్లు తినకపోయినా కావలసిన సత్తువ నిస్తుందనీ, ఆరోగ్యం అనీని—

బలకరమైన దవడమేకాకుండా తియ్య తియ్యగావుంటుంది గనకనే, "రొట్టీ, బిస్కెట్" అనే టప్పటికల్లా నోరూరుతుంది. మరి యీరొట్టెని తయారుచేయడానికి ఎంత తతంగం కావాలో చూచారా?

(ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిని)

## పిన్ని ఉత్తరాలు

# వంగరాష్ట్రం

సర్వమంగళా,

మీరంతా చెన్నపట్టణాన్నుంచి మీ ఊరు తిరిగి వెళ్లినప్పుడు ఎక్కిన రైలుబండి పేరేమిటో తెలుసా? దాన్ని 'కలకత్తా మెయిల్' అంటారు. మీరంతా సామర్లకోట స్టేషన్లో దిగకుండా ఆరైల్లోనే కూచునున్నారనుకో. అది తిన్నగా మిమ్మల్నందర్నీ కలకత్తాకి తీసుకుపోతుంది. ఈ రైలు చెన్నపట్నంలో ఈ సాయంకాలం బయల్దేరుతే ఎల్లుండి మధ్యాహ్నానికికాని కలకత్తా వెళ్లదు. కలకత్తా అంతదూరం ఉందన్నమాట.

కలకత్తా వంగరాష్ట్రంలో ఉంది. ఇది చాలా పెద్దనగరం. ఇక్కడే పెద్దపెద్ద షాపులూ, ఆఫీసులూ చాలా ఉన్నాయి. పెద్దపెద్ద మిల్లులున్నాయి. వంగరాష్ట్రంలో జనుము బాగా పండుతుంది. ఈ జనప నారని తాడుగాపేని సంచీలుగా తయారుచేస్తారు. ఈపని అంతా మిల్లులే చేసేస్తాయి. కలకత్తాలో తయారయే టన్ని సంచీలు ప్రపంచంలో మరెక్కడాకావు. గోని సంచీలు ఎవళ్లకి కావలసివచ్చినా వంగ రాష్ట్రంలోంచి పంపవలసిందే. కలకత్తాలో పెద్ద హార్బరుంది. ఆ హార్బరు వచ్చేపోయే ఓడలతో చాలా సందడిగా ఉంటుంది.

కలకత్తాలో కాళికామ్మవారి గుడి ఉంది. అందుకే ఆ ప్రాంతాన్ని పూర్వం 'కాళీఘట్టం'అని పిలిచేవారు. 'కలకత్తా'అనే పేరు 'కాళీఘట్టం'లోంచి వచ్చినదే. జంతువుల్ని బలియిస్తే కాళికామ్మవారు సంతోషించి, తమకు కోరినదల్లా ఇస్తుందని ప్రజలునమ్మి ఈ అమ్మవారికి ప్రతీ సంవత్సరం వందలకొలది దున్నపోతుల్నీ, గొర్రెలనీ, మేకలనీ తీసుకొచ్చి బలి ఇస్తారు. ఓపిచ్చి నమ్మకంతో నోరెరుగని ప్రాణుల్ని ఇలా చంపడం చాలా తప్పని. గాంధీగారు ఈ గుడిని చూడడానికొచ్చి, ఈ జంతువులరక్తంకళ్ల బడే టప్పటికి, గుండె కరిగిపోయి దుఃఖించడం మొదలుపెట్టేడట. ఈ దురాచారం పోవడానికి ఇంకా ఎంతకాలం పడుతుందో మరి!

కలకత్తాలోనే మరోచోట జైన దేవాలయాలున్నాయి. ఈ దేవాలయాలదగ్గర 'బలి' అనేమాట వినబడితే చెవులు మూసుకుంటారు. జైనమతంలో వాళ్లు 'జంతువుల్ని హింసచెయ్యడం మహాపాపం' అని నమ్మినవాళ్లు. దుష్ట మృగాలనైనా సరే చంపకూడదని వాళ్ల అభిప్రాయం. రాత్రి దీపాలుపెడితే పురుగులూ, అవీ వచ్చి దీపంలో పడి చచ్చిపోతాయేమో అన్న భయంతో జైనులు రాత్రి దీపాలే పెట్టుకోరుట! నడిచే టప్పుడు కాళ్లక్రింద ఏ చీమలైనాపడి నలిగిపోతాయేమో అన్నజాలితో చేతిలో ఓకుంచెలాంటి దాన్ని పుచ్చుకుని దానితో మార్గంలో ఏ పురుగులూ లేకుండా అటూఇటూ తుడుచుకుంటూ వెడతారట.

అమ్మడూ! వంగదేశం గంగానదిడెల్టాలో ఉంది. 'డెల్టా'అంటే ఏమిటో తెలుసా? నది సముద్రంలో కలవడానికి ముందు పాయలుగా చీలిపోయి సముద్రంలో కలుస్తుంది. ఈ పాయలమధ్య ఉన్న భూమికి 'డెల్టా'అంటారు. ఈ 'డెల్టా'కి అటూఇటూ నది ఉంటుంది గనక కావలసినంత నీరన్నమాట. అందుచేత డెల్టాలలో పంటలు బాగా పండుతాయి. వంగరాష్ట్రంలో కూడా పంటలు బాగా పండుతాయి.

వంగరాష్ట్రంవాళ్లకి తమ రాష్ట్రమన్నా, తమ భాషఅన్నా అమితమైన అభిమానం. ఈ రాష్ట్రాన్ని రెండుభాగాలుగా చేస్తే పాలించడానికి వీలుగాఉంటుందన్న ఉద్దేశంతో దొరలు అలా విభజిద్దామనుకున్నారు. తమ దేశం రెండుగా చీలిపోతే తమలో తమకి దెబ్బలాట లొస్తాయని, వంగదేశీయు లంతా అలా భాగించడం వల్లకాదని దెబ్బలాడేరు. తమ రాష్ట్రం, తమ ఐకమత్యం అంటే వాళ్లకి ఎంత ప్రేమో చూడు. వాళ్లల్లో ఇంగ్లీషు, ఇతర భాషలూ బాగా వచ్చినవాళ్లు కూడా ఆ భాషలలో మాట్లాడ్డం గాని, వ్రాయడంగాని ఆట్టే చెయ్యరు. మాట్లాడడం, పుస్తకాలు వ్రాయడం అంతా దేశభాషలోనే.

వంగదేశంలో చాలా మంచి మంచి పుస్తకాలు రాసినవాళ్లు ఉన్నారు. అందులో రవీంద్రనాథ ఠాగూరు అనే ఆయనకీర్తి మన దేశంలోనే కాకుండా ప్రపంచమంతటా వ్యాపించింది. రామకృష్ణపరమ హంస అనే ఋషి వంగదేశంలోనే జన్మిస్త. ఈ ఋషికి వివేకానందస్వామి అనే ఓ శిష్యుడుండేవాడు. ఆయన ఇంగ్లీషులో పెద్దపెద్ద పరీక్షలన్నీ ప్యాసై ఆఖరుకి సన్యాసంపుచ్చుకుని మన హిందూమతంలో ఉన్న సారాన్నంతనీ విడమర్చితెలుపుతో ఉపన్యాసాలిచ్చారు. 'హిందూమతం ఓ గొప్పమతం' అన్న సంగతి ప్రపంచానికంతకీ వివేకానందస్వామిమూలాన్నే వెల్లడయింది. ఆయన సముద్రాలు దాటివెళ్లి దొరలందరికి మనమతంలో ఉండే గొప్పతనాన్ని తెలియచేశారు. ఎంతోమంది దొరలూ, దొరసానులూ ఆయనకు శిష్యు లయ్యారు.

అమ్మడూ! పూర్వం మనదేశంలో 'సహగమనం' అనే ఆచారం ఉండేది. 'సహగమనం' అంటే భర్త చనిపోతే భార్య ఆశవంతోపాటు తానుకూడా ఆ చితిలోకి ఉరికి మరణించడం. మొదటి రోజులలో ఈ ఆచారం మంచిదిగా తోచినా క్రమంగా, బ్రతికున్నవాళ్లు నిప్పులోకి ఉరికిచావడం అనేది ఓదారుణంగా అగుపడింది. ఇష్టంలేకపోయినా ఆడవాళ్లని బలవంతంగా నిప్పులోకి తోసేసేవారుట! ఈ దురాచారాన్ని మాన్చడానికి ఎవరికీ శక్యమైంది కాదు మొదట. ఆఖరుకి ఈ దారుణాన్ని ఆపగలిగినవాడు రాజా రామమోహనరాయ్ అనే వంగదేశీయుడు. ఆయన మన దేశంలోని స్త్రీలకి జరుగుతోన్న చాలా అన్యాయాలను గుర్తించి వాటి నన్నింటినీ తొలగించి ఎంతో ఉపకారం చేశాడు.

చెన్నపట్టణం,
1-3-41.

పిన్ని

పాత పాటలు

## శివ కేశవులకు భేదములేదు

శివ కేశవులకుభేదమూ, వారుచేసినందుకు మరి ఖేదమూ...

భూతిపూసినవాడు లింగడు, పట్టినామము దాల్చినవాడు రంగడు
భూతిపూసినవాడు, పట్టినామముదాల్చినవాడు, ఇద్దరు వక్కటేసత్యము జనులార ॥శి॥

తోలు కట్టినవాడు లింగడు, పట్టూ శాలువకట్టినవాడు రంగడు
తోలుకట్టినవాడు, పట్టుశాల్వ కట్టినవాడు; ఇద్దరు వక్కటేసత్యము జనులార ॥శి॥

మాలవేసినవాడు లింగడు, తులసిమాలవేసినవాడు రంగడు,
మాలవేసినవాడూ, తులసిమాలవేసినవాడు, ఇద్దరు వక్కటేసత్యము జనులార ॥శి॥

ఎద్దునెక్కినవాడు లింగడు, బొల్లిగద్దా నెక్కినవాడు రంగడు
ఎద్దునెక్కినవాడు, బొల్లిగద్ద నెక్కినవాడు ఇద్దరు వక్కటేసత్యము జనులార ॥శి॥

పార్వతీసమేతుడూ లింగడు, వరలక్ష్మీసమేతుడూ రంగడు,
పార్వతీసమేతుడు, వరలక్ష్మీసమేతుడు, ఇద్దరు వక్కటేసత్యము జనులార ॥శి॥

శూలంబట్టినవాడు లింగడు, విల్లమ్ముబట్టినవాడు రంగడు,
శూలంబట్టినవాడు, విల్లమ్ముబట్టినవాడు, ఇద్దరు వక్కటేసత్యము జనులార ॥శి॥

ఈశ్వరుడందురు, లింగని, పరమేశ్వరుడందురూ రంగని
ఈశ్వరుడన్నను, పరమేశ్వరుడన్ననూ, ఇద్దరు వక్కటేసత్యము జనులార ॥శి॥

—జరుగుమిల్లి రామాబాయమ్మ.

# శ్రీ అమృతానందనాథ జయంతి

# బిరుద ప్రదానములు

ఇటీవల, అమృతానందనాథ జయంతి సందర్భమున బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణ విద్వచ్ఛాస్త్రులు గారికి 116 రూప్యములున్ను, బ్రహ్మశ్రీ కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మ గారికి 'మహాకవి' యను బిరుదము 116 రూప్యములున్ను, మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులవారికి 'సాహిత్యధర్మస్థాపక' యను బిరుదమున్ను, 116 రూప్యములున్ను సమర్పింపఁబడినవి. ఆంధ్రకవయిత్రి, శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారికి 'కవయిత్రీమణి' యను బిరుదము నొసంగఁబడినది.

## శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము

## పారితోషిక ప్రశంస

### శ్రీమతి కవితిలక, కవితావిశారద, కాంచనపల్లి కనకాంబా విరచితము

క॥ శ్రీ విజయవాడ దుర్గాదేవీ కరుణార్ద్ర దృష్టి ధీరవరులకా
నేవేళ కనకవృష్టి సుధావృష్టియుఁ దుష్టిపుష్టి ధర్మము తపముల్॥

చ॥ ఇదియె త్రిలింగపీఠము, కవీంద్రులు వీరె, సమస్తదేవతా
స్పదమిదె, సత్కళల్ చెలఁగుపట్టిదె, ధీరుల కూతకట్టయి
య్యదె, సకలాంధ్రభూమికిదె యోగదగుండియ, పండితాళి సం
పదయిదె, కర్మభూమికి శుభంబిదె, యియ్యదె ధర్మబీజముల్॥

శా॥ కర్మజ్యేష్ఠుఁడు రామకృష్ణ బుధుఁ డిక్కాలంబునన్ ధీరుఁడై
ధర్మారంభ మెనర్చి శాంకరము తత్త్వంబుల్ విమర్శించు దు
ష్కర్మల్ దుష్టమతప్రచారమును పెల్చింజేయ శిష్టాళికిన్
శర్మంబుల్ ఘటియించు నింతటి ప్రతిష్ఠం గాంచిరే యెవ్వరున్॥

సీ॥ ఒక నోటిమీదగా సకలభారతము నాంధ్రమున బల్కఁగజాలు దక్షుఁడొకట
వేదార్థభావంబు విప్పిచెప్పంగ వాచస్పతి యనజాలు చతురుఁడొకట
భాష్యకారుం డక్షపాదుండు పాణిని యనఁనొప్పు మూర్తిత్రయంబు నొకట
శతవధానఖ్యాతి జగమేలు కవిసింహ వేంకటశాస్త్రి కవీంద్రుఁ డొకట

గీ॥ మున్నధిష్ఠించు గురుపీఠముననె బళిర!
నిన్ను బూజించు భాగ్యంబు నేఁడుఁగలిగె
దేవతలఁబోలు సభ్యుల భావమలర
శ్రీ కృపావర్మ జనమంచి శేషశర్మ॥

సీ॥ బ్రహ్మాండమంతయుఁ బాణి పల్లవమందు నమరంగ దెనుఁగున నాడెనెవఁడు
రామాయణంబు కరామలకంబుగా చేకొని యెవఁడు వాల్మీకియయ్యె
భాగవతార్థంబు బల్కఁంగజాలె నెవ్వాఁడు శ్రీ గోవింద పాదభక్తి
లలితాంధ్రభాషలో లలితామహిత్వంబు దీక్షరచించిన ధీరుఁడెవఁడు

గీ॥ బుధుల మెప్పించు శ్రీ కళాపూర్ణుఁడేవఁడు
జగతి జనమంచి శేషాద్రిశర్మ నేడు
నాదు గురునాథు పేర సన్మానమునకు
పాత్రుఁడై వచ్చిగొంట మద్భాగ్యగరిమ॥

క॥ శ్రీ కరముకీర్తి కరము మహాకవి బిరుదంబుఁదగినదని యిచ్చెను సు
శ్లోక త్రిలింగపీఠము నీకో శేషాద్రి శర్మ నిరతముఁ దాల్పన్॥

శా॥ అధ్వంబించుకఁదోఁప కెల్లడనధర్మాంధ్యంబు వ్యాపింపఁ ద
ద్విధ్వంసం బొనరింప బోధములు గాలింపంగ నుద్యుక్తుఁడై
మాధ్వీస్వాదు కవిత్వ తత్వ గరిమన్ ప్రాణంబులన్ గూర్చునీ
మధ్వ శ్రీయుత కృష్ణ సత్కవికి సమ్మానంబిదే యంజలుల్॥

## శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారికి

# 'కవయిత్రీమణి' బిరుదము

మ॥ కవయిత్రీమణివైతి విందుమతి భాగ్యంబిద్ది ఈ గోష్ఠిలో
నవురా యెంతటికీర్తి యిచ్చె బళి, కావ్యంబుల్ సతీధర్మ సం
స్తవనీయంబులు పల్కుచున్ సతులకున్ తత్వంబు రూపింపుమో
కవయిత్రీమణి సర్వ సంపదలుఁగల్గన్ జేయు నీకీశుఁడే॥

## బ్రహ్మశ్రీ పండిత రాజరాజేశ్వర శాస్త్రిగారికి త్రిలింగమహా విద్యాపీఠమున సర్వతంత్ర స్వతంత్ర బిరుదము నొసంగినపుడు సభలో జదివిన శ్లోకములు

శ్లో॥ శ్రీశైలశ్చైవ శైలశ్చ కృష్ణా గోదావరీ శుభా
ఖ్యాతాః పూతాస్త్రిలింగేషు భూతలే చైవశాశ్వతమ్॥

శ్లో॥ కృష్ణ, త్యాగ, జగన్నాథ రాజత్రయ విరాజితః
విద్యారణ్యాగ్ర గణ్యోయం దేశస్త్రైలింగసంజ్ఞకః॥

శ్లో॥ వ్యాఖ్యాతా మల్లినాథశ్చ విద్యానాథ మహాకవిః
అన్నంభట్టా దయోహ్యాంధ్రాః హరిశాస్త్రీ చశాబ్దికః॥

శ్లో॥ రాజేశః విజ్ఞరాజేశ స్సురేశ గురుసన్నిభః
సర్వతంత్ర స్వతంత్రశ్చ రాజరాజేశపూజితః॥

శ్లో॥ సర్వతంత్ర స్వతంత్రాయ ధీరశాంతాయ తేజసే
లక్ష్మణార్య తనూజాయ సర్వజ్ఞాయ నమోనమః॥

శ్లో॥ సాంగంవేదమధీయంతే కాశ్యాంయస్య ముఖాంబుజాత్
సోయం పండిత రాజోత్ర రాజేశః పూజ్యతేఽధునా॥

# అవ్వై అనాధాశ్రమము

## డా॥ ముత్తులక్ష్మీరెడ్డిగారి అకుంఠిత సంఘసేవా ఫలితము

### వార్షికోత్సవమునాటి ప్రముఖుల ప్రసంగములు

అవ్వై అనాధ ఆశ్రమము, పదవ వార్షికోత్సవము జస్టిస్ పి. వెంకటరమణారావుగారి **అధ్యక్షత** క్రింద శనివారం, ఫిబ్రవరి 1-2-1941 తేది సాయంత్రం 4 గంటలకు ఆశ్రమభవనము **అడయారునందు దివ్యముగా** నడుపబడ్డది.

ప్రప్రధమంలో కీర్తిశేషులగు టి. యస్. రంగస్వామిగారి జ్ఞాపకార్థము, ఆయన సహోదరి డా॥ **శ్రీమతి** సౌందరమ్మగారి విరాళము, వెయ్యిరూపాయలకు కట్టబడిన టి. యస్. రంగస్వామిగారి కుటీరము, శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులగు శ్రీ స్వామి శాశ్వతానందాచార్యులవారిచే తెరువబడ్డది.

గౌరవ కార్యదర్శి డా॥ శ్రీమతి ముత్తులక్ష్మమ్మగారు ఆశ్రమముయొక్క రిపోర్టు (1939-40) **విపులముగా** వివరించుచు:

1. "అవ్వై అనాధ ఆశ్రమము" వార్ధా స్కీము ప్రకారం, **Higher Elementary School** ను **నడుపుచున్న**టుల తెల్పిరి.

2. పరిశ్రమశాఖ:—**నూలు** వడకుట, బట్టలు నేయుట, కుట్టుపని, లేసులు **అల్లుట, చాపలు నేత, బుట్టలు నేత,** జరీపని మొదలైనవి.

3. కళ:—సంగీతము, నాట్యము, కుమ్మి, కోలాటము.

4. రెండు మూడు సంవత్సరములలో యీ అనాధ ఆశ్రమమునుండి 16 గురు **బాలికలు దాదులు** గను, యింకనూ 10 మంది దాదులుగను, యిద్దరు (sick nurses) మంత్రసానులుగను, **ట్రెయినింగులో** నున్నారు.

యిద్దరు బాలికలు L. M. P. Course ముగించి, డాక్టర్లుగా ప్రాక్టీసు **చేయుచున్నారు.** 8 గురు **బాలికలు** Secondary Grade Teachers గను, పన్నెండుగురు Higher Elementary Teachers గను చదువుచున్నట్లు చెప్పిరి. ఒకామె Intermediate క్లాసులో కృతార్థురాలైనది. రిపోర్టును **ముగించుచు, విరాళములగూర్చి** కొంచెము విశదీకరించారు.

తదుపరి డా॥ టి. యస్. తిరుమూర్తిగారు, మిస్. విలాసిని షినాయ్‌గారు **శ్రీమతి** స్వర్ణాంబాల్ గారు శ్రీమతి ముత్తులక్ష్మమ్మగారు గావించుచున్న ప్రజాసేవ, అనాధ సంరక్షణకు సంతసించి, **విరాళములు** పెంపొందిన ఆశ్రమము యింకా వృద్ధికాగలదనిరి.

అధ్యక్షులు జస్టిస్ పి. వెంకటరమణరావుగారు, శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారి అనాధసేవగూర్చి **కొనియాడుచు,** ధనవంతులు విరాళములిచ్చి ఆశ్రమమును పోషించవలసినదిగా హెచ్చరించిరి.

తదనంతరం—ఆశ్రమ బాలికల నృత్యప్రదర్శనాలు. ప్రధమంలో, శ్రీమతి శేషమ్మగారిచే నేర్పబడిన నవీన నాట్యాలు, అభినయాలు కావింపబడినవి. యీ వేడుకలతోపాటు విజయముపొందిన **బిడ్డలందరకు బహుమానాలు** ఒసంగబడిన తర్వాత కార్యక్రమం అత్యంత జయప్రదంగా ముగిసినది.

# గ్రంథచౌర్యం

## శ్రీ ముద్దా విశ్వనాథంగారి వ్యాసానికి, శ్రీ డి. సూర్యప్రకాష్‌గారి చోరత్వం

**శ్రీ 'గృహలక్ష్మి' పత్రికాధిపులకు నమస్సులు:**

ఆర్యా,

ఈనాడు 'గ్రంథచౌర్యాన్ని' గురించి అనేక పత్రికలు శ్రద్ధతీసుకుని పనిచేస్తున్నవి. ఇది సంతసింపతగ్గ విషయం.

'గృహలక్ష్మి'లో పదేళ్లనాడు నేను పంపగా తాము ప్రకటించివున్న ఒక వ్యాసం ఈ మధ్యనే 'ఆంధ్రవారపత్రిక'లో కనబడింది. ఆ వ్యాసకర్త శ్రమతో చేసిన స్వల్ప మార్పులను ఎర్ర సిరాతో గురుతు పెట్టాను. సంస్కరింపబడిన వ్యాసంలోని చమత్కార ధోరణి తామే గ్రహింపగలరు. ఇది మీ పత్రికలో పడిన వ్యాసం గనక, దఖలు పుచ్చుకుంటారని నమ్ముతున్నాను.

1930 ఫిబ్రవరి 'గృహలక్ష్మి' సంచికలో ప్రకటితమయిన నా వ్యాసం శీర్షిక—'నవ్యసాంసారిక నిర్వహణము.'

19 జూన్ 1940 తేదిన 'ఆంధ్రవారపత్రిక'లో ప్రకటితమైన శ్రీ డి. సూర్యప్రకాష్‌గారి వ్యాసం పేరు—'నవ్యసాంసారిక నాగరికత.'

ఇట్లు,

ముద్దా విశ్వనాథం.

'గ్రంథచౌర్యం' యీనాడు విరివిగా అమలులోవున్నదంటే అతిశయోక్తి గాదు. గతంలో ప్రకటింపబడిన వ్యాసానికి, కొలది మార్పులుచేర్చో, లేక చేర్చకుండానో వ్యాసకర్త పేరుమాత్రం మార్చేసి తిరిగి దానిని ప్రకటింపచేయడం చౌర్యమేకాదు— అతినీచమూ, ఘోరమూ కూడాను. పత్రికా నిర్వాహకులు వీటినన్నిటిని గుర్తించుకుని వుండడం కేవలము దుర్లభమైన విషయం.

ఈ మధ్య 'ఆంధ్రపత్రిక' యీ సందర్భంలో కొంచెం పనిచేసింది. ఇది సంతోషింపదగిన విషయం. కాని, యీ తరువాతకూడా యీలాటి దుర్మార్గాలు జరగడం చూస్తే రచయితలలో యీ దుర్బుద్ధి ఎందుకు పుడుతోందో అర్థమవటంలేదు.

శ్రీ ముద్దా విశ్వనాథంగారు ఇటువంటి అన్యాయాన్నిపట్టుకొని మాకు తెలియజేసినందుకు మేము వారికి కృతజ్ఞత తెలుపుతున్నాము. ఇలాగే రచయితలు ఎవరికివారే యీ విషయంలో కొంచెం శ్రద్ధ పుచ్చుకుంటే ఇది కొంతలో కొంత తగ్గవచ్చును. ఇందుకు రచయితలు శ్రద్ధబూనుతారని ఆశిస్తాము.

'గృహలక్ష్మి' సంపాదకుడు.

# ★ నక్షత్ర ఫలితాలు

కవికలహంసి
శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

## ● పాల్గున మాసము ●

**అశ్విని**
ధనప్రాప్తి ; శరీరసౌఖ్యము ; సౌభాగ్యం

**భరణి**
పశువృద్ధి ; కృషిలాభం ; లోహవ్యాపారముచేలాభం

**కృత్తిక**
వస్త్రలాభం ; స్థానభ్రష్టం ; హృదయసంకటం

**రోహిణి**
గర్భశూల ; ప్రయాణం ; వ్యయం ; చింత

**మృగశిర**
స్వల్ప అధికారం ; యుద్ధభయం ; విరోధం ; విషభీతి

**ఆర్ద్ర**
వ్యాధిబాధ ; పాపకార్యాసక్తి ; గృహనిర్మాణం

**పునర్వసు**
రాజభయం ; కార్యవిఘ్నం ; శస్త్రఘాతం

**పుష్యమి**
బంధుసమాగమం ; విద్వత్సహవాసం ; కృషిలాభం

**ఆశ్లేష**
తెల్లవస్తువులలో లాభం ; సౌఖ్యం ; నిర్బంధం

**మఖ**
లాభం ; ఆహ్లాదం ; ప్రభుసందర్శనం ; కీర్తి

**పుబ్బ**
పుష్పమాలాలంకారం ; గోలాభం ; కృషిలాభం

**ఉత్తర**
శిరోవ్యాధి ; ధర్మముల నిర్వహించుట ; మనోరథసిద్ధి

**హస్త**
ప్రయాణమందు చోరభయం ; పరులవలనబాధ ; సంతాపం

**చిత్త**
దుష్టస్త్రీకలహం ; వైరాగ్యం ; ఉద్యోగాధికారం

**స్వాతి**
జంతువులచే భయం ; కోపము ; కార్యభంగం

**విశాఖ**
సంతాపం ; పుత్రులద్వారా ప్రయాసం ; జీవనహాని

**అనూరాధ**
విద్యాగోష్టిచే సుఖము ; పైత్యవాతం ; వ్యాపారం

**జ్యేష్ఠ**
స్వదేశత్యాగం ; అగ్నిభయం ; రాజులచే ఆపద

**మూల**
ధాన్యవృద్ధి ; ద్రవ్యనాశం ; మానహాని ; వాతరోగం

**పూర్వాషాఢ**
భోగవిలాసం ; జయం ; రత్నవ్యాపారలాభం

**ఉత్తరాషాఢ**
ప్రభుదర్శనం ; విపత్తు ; మిత్రభేదం

**శ్రవణం**
సొత్తు కుదువబెట్టుట ; నూత్నకృషి ; హృదయసంకటం

**ధనిష్ఠ**
ఋణబాధ ; బుద్ధివినాశం ; తిరుగుట ; క్లేశం

**శతభిషం**
నీల వస్త్రలాభం ; శునకభయం ; దారిద్ర్యం

**పూర్వాభాద్ర**
ఆయుధభయం ; విచారం ; తాపజ్వరం

**ఉత్తరాభాద్ర**
వివాదం ; మనోవైకల్యం ; వ్యాపారభంగం

**రేవతి**
ఉద్యోగభంగం ; యాచన ; యశస్సు ; మంత్రసిద్ధి

# ★ స్త్రీ సాముద్రిక శాస్త్రము ★

కవికలహంసి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి

(గతసంచిక తరువాయి)



ఉంగరపు వ్రేలి మూడవకనుపుమీద అర్ధచంద్రరేఖ యుండిన నది విచారమును సూచించును.

## చిటికెన వ్రేలు

ఈ వ్రేలున కధిపతి బుధుడు. సాధారణముగా నిది వర్తకులకు ఉపయోగకరము. ఇది దొంగతనము చేయుటను, అబద్ధము చెప్పుటను, నమ్మినవారిని మోసపుచ్చుటను దెలుపును.

ఈ వ్రేలు ఉంగరపువ్రేలుయొక్క మొదటి కణుపును మించియుండని పక్షమున అట్టివారు ఒకరి అధికారమునకు లోబడి యుందురు. దానికి మించియుండిన అతి స్వతంత్రము, అదృష్టము, పలుకుబడి గలిగి ప్రసిద్ధులై యుందురు.

చిటికిన వ్రేలి మొదటి కనుపునకు మకరరాశియనియు, రెండవ కనుపునకు కుంభరాశియనియు, మూడవ కనుపునకు మీనరాశియనియు పేర్లు. ఈ వ్రేలియొక్క మొదటికనుపు చదరముగ నుండెనేని వ్యాపారము నందు యోగ్యతను, మంచి చాకచక్యమును, సామర్థ్యమును తెలుపును. అది మొనదేలి యుండెనేని మంచి వాగ్ధాటిని సూచించును.

ఈ వ్రేలి రెండవకనుపు లేక కుంభరాశి నిడుపైయుండిన వితర్కమును, కష్టించి పాటుపడుటను, వ్యాపారమునందు ప్రవీణతను సూచించును. మూడవకనుపు నిడుపైయుండిన తెలివితేటలుండును గాని వంచకత్వము, అబద్ధము చెప్పుటకూడ నుండును.

మొదటి కనుపు నిడివిగాయుండిన చరిత్రము, తర్కము, సాహిత్యము వీటిలో ప్రవీణులై యుందురు.

ఈ మూడవకనుపు మీద కొన్ని రేఖలు అడ్డముగా సాగియుండిన గౌరవమును, భోగభాగ్యములను, కీర్తిని సూచించును.

ఈ వ్రేలి మొదటికనుపుమీద ఒక చిలువగురుతుండిన వారు వివాహములేక యుందురు. ఈ కనుపు చివరన ఒక నక్షత్రగురుతుండిన వారికి ఏకార్యముచేసినను జయము నిశ్చయము. మూడవకనుపునుంచి ఈ కనుపువరకు ఒక సరళరేఖ సాగియుండిన ఉన్నతస్థితిని, వాగ్ధాటిని, శాస్త్రశోధనమును, గౌరవ మర్యాదలను సూచించును.

మూడవ కనుపునుండి రెండవ కనుపునకు ఒకటి లేక రెండు రేఖలు సాగియుండిన బుద్ధిమంతులు, ధైర్యముగలవారుగా నుందురు.

ఈ రేఖ తిన్నగాలేక వంకరలు తిరిగియుండిన చేతిపనులయందును, శిల్పము, చిత్రలేఖనము, నగిషీ పనులు——వీటిలో మంచి నేర్పుగల్గియుందురు. మరియు స్వీయరక్షణమునందు సమర్థతయు నుండును.

(సశేషము)




### గోధుమలుతో తయారుచేయదగిన వివిధ పదార్థములు—8.

## కొబ్బరి వుప్మా

1 శేరు గోధుమనూక కొంచం వేయించి తీయవలెను. ఒకగ్లాసు నెయ్యి కాగనిచ్చి, మినపపప్పు, శనగపప్పు, జీడిపప్పు, ఆవాలు, మెంతులు, అల్లంముక్కలు పచ్చిమిర్పముక్కలు, కరేపాకు వేయించి 1 శేరు నీళ్లుపోసి తగుమాత్రం వుప్పువేయవలెను. నీరు మరిగినతర్వాత నూకపోసి వుడకనిచ్చి ఒక కొబ్బరికోరు 1 నిమ్మకాయరసం, 1 పంపు నెయ్యివేసి బాగా కలబెట్టి దింపవలెను.

## బాదంపూరి

$\frac{1}{2}$ వీశ గోధుమపిండి ఆళావుపాలు 2 తులముల నెయ్యివేసి కలపవలెను. నానినతర్వాత బిళ్లలు చేసి పూరీలు వత్తి నేతిలో వేయించవలెను. 1 శేరు పంచదార లేతపాకంపట్టి 1 కొబ్బరికాయికోరివేయించి, కొంచెం ఏలకపొడి, వేయించిన పూరీలు వేయవలెను.

## గోధుమపేణీ

$\frac{1}{2}$ శేరు గోధుమపిండిని నీటితో గట్టిగ కలుపవలెను. దానిని నేతితో బాగా మర్దించి చిన్న బిళ్లల వలెవత్తి దానిలో, కొబ్బరికోరు. పంచదార, ఏలకపొడి కలపి పెట్టవలెను. దానిపైన మరియొక బిళ్లవేసి ఒకసారి మాత్రం వత్తినేతిలో వేయించవలెను.

## మదనపేణీలు

$\frac{1}{4}$ వీశ గోధుమపిండి, గ్లాసుపాలు, కొంతనెయ్యి తగునీటితో గట్టిగ కలుపవలెను. నానినతరువాత పూరీవత్తి నెయ్యిరాచి మడచి దళసరిగ బిళ్లవలెవత్తి నేతిలోవేయించితీసి $\frac{1}{2}$ వీశ పంచదార పాకంలో వేయవలెను.

## గోధుమ చపాతీలు

$\frac{1}{2}$ శేరు గోధుమపిండి వుప్పువేసి వేడినీటితో గట్టిగ కలుపవలెను. 4 తులములనెయ్యివేసి పిండి బాగామర్దించి పెద్దపూరీ వత్తవలెను. దానిని మడిచి మరల దళసరిగవత్తి 1 చంచా నెయ్యివేసి పెనము మీద వేయించి తీయవలెను.

## కేసరిభాత్

½ శేరుపాలలో ¼ శేరు సేమియా నేతితో వేయించి పోసి. 15 నిముషములు ఉడకనిచ్చి ¼ శేరు గోధుమరవ నేతితో వేయించివేసి, ¼ శేరు పంచదార, జీడిపప్పు, కిస్‌మిస్, కొంచెం ఏలకపొడి 1¼ శేరు నెయ్యివేసి 10 నిమిషములుంచి తీయవలెను.

## గోధుమ కారపుబూంది

¼ శేరు శనగపిండి ¼ గోధుమపిండి 1 తులం జీలకర్ర కొంతకారం, 1 చిటికసోడావేసి తగినంత నెయ్యి మరగనిచ్చి చట్రంతో బూంది దూయవలెను.

## బటాణి భాత్

2 శేర్లు మంచినీరు సలసల కాగినతరువాత ½ శేరు బటాణీలువేసి, వుడికించి వార్చవలెను. ¼ గోధుమనూకను నేతితో వేయించుకోవలెను. 6 తులముల నెయ్యి కాగిన తర్వాత కొద్ది మెంతులు, మినపపప్పు, కొద్ది ఆవాలు, కొద్ది శనగపప్పు, ఒక్కరవ ఇంగువ 10 తులములు కొబ్బరి కోరువేయించి, కొంచం కర్వేపాకు వేసి పోపువేయించి ఉడికిన బటాణీలు, గోధుమరవ్వవేసి కలియపెట్టవలెను. తగుమాత్రం వుప్పు, కొంచం పసుపు జీడిపప్పు వేసి 4 నిమ్మపళ్ల రసంపిండి దింపవలెను.

## చిట్టిగార్లు

పావుశేరు మినప్పప్పు నాననిచ్చి మెత్తగా రుబ్బవలెను. ¼ గోధుమపిండి ¼ వరిపిండి వుప్పు కొంచం జీలకర్ర చిటికెడు సోడాకలిపి చిన్నవుండలుచేసి తడిగుడ్డమీదవేసి పైన గుడ్డవేసి చెంబుతో కొట్టవలెను. అట్లుచేసిన బిళ్లలు తయారగును. నెయ్యి మరిగించి బిళ్లలు వేయించి తీయవలెను.

## మరాటీకీర్

½వీశ గోధుమపిండి, 2 తులము నెయ్యి ½శేరు పాలుపోసి కలుపవలెను. 1 గంట నాననిచ్చి వుండలు చేసి పూరీలు వత్తి వేయించి పొడికొట్టవలెను. 2 సేర్ల పాలు కాగనిచ్చి, ½వీశ పంచదార కిస్‌మిస్, ఏలకపొడి, జీడిపప్పు నేతితో వేయించి కుంకుమపువ్వు వేసి కొట్టిన పొడివేయవలెను. 10 నిమిషములుంచి దింపవలెను.

—సి. హెచ్. అన్నపూర్ణాబాయి.

## బంగారుపతకం బహుమానం

గోధుమ ధాన్యముతో చేయదగిన పలువిధములైన పదార్థములను, గత సంచికల లోని ఏడు పట్టీలయందు ప్రకటింపబడినవి గాక, ఎక్కువ పదార్థములను వ్రాసి పంపిన వారికి ఒక 'బంగారుపతకము' బహూకరింపబడును. వెనుక గృహలక్ష్మిలో ప్రకటింపబడిన వాటినిగూడ ఎత్తివ్రాయగూడదు.

సంపాదకుడు

## పుష్ప చయము * * *

### ★ ముసోలినీ ఆహ్వానమునకు పండిత నెహ్రూ తిరస్కరణ

పండిత జవహర్లాలు జీవితములో ఒక ధీరమైనఘట్టమును ఎడ్వర్డుథాంప్సన్ గారు "ఈవినింగ్ స్టాండర్డు" అను పత్రికలో ఒక వ్యాసమందు తెలిపినారు. జవహర్లాలుగారు ఐరోపాఖండములో ప్రయాణముచేయుచు రోం నగరమునకు వచ్చినపుడు అక్కడ వారు దిగినచోట ఇటాలీయ ప్రభుత్వ విదేశాంగశాఖకు జెందిన ఒక అధికారి వారిని, ముసోలినిగారిని దర్శించుటకై రావలసినదని, ఆహ్వానించి కొనిపోవుటకు కారుతోకూడ సిద్ధముగానుండెను. కాని జవహర్లాలుగారు రానని నిరాకరించిరి. మ్యూనిషు ఒడంబడికకు కొద్దికాలము ముందు ప్రేగుకును, స్పెయినులో అంతర్యుద్ధ సమయమందు, బార్సిలోనాకును జపానీయులవిమాన దాడుల సమయములో చంగ్ కింగ్ కును పోయి చూచి ఏమి చెప్పినదియు అందరికిని తెలిసినసంగతియే. అట్టి వీరు ఫాసిస్టు క్రౌర్యమును ప్రతిఘటించుచు యుద్ధము చేయుచున్న ప్రభుత్వమునకు ఎదురుతిరుగుట ఆశ్చర్యమని థాంప్సన్ గారు చెప్పినారు. ఇందుకు తప్ప భారతీయ జనుల భావములను గ్రహించలేని భారతప్రభుత్వమువారిదే యని చెప్పుట సులభమని సూచించుచు ఒక వ్యంగ్యచిత్రము థాంప్సనుగారి వ్యాసముపై ముద్రించబడెను—

### ★ హిట్లరుకు కూడా అలాటి జబాబే!

ఈలాటి విముఖత్వ స్వభావమే పండిత నెహ్రూ జర్మనునియంత హిట్లరు విషయంలోకూడా కనబరిచాడు. యీ సంగ్రామానికి ముందు, సోదరి శ్రీమతి విజయలక్ష్మి పండిట్, కుమార్తె శ్రీమతి ఇందిరా నెహ్రూలతో విదేశాలలో సంచారానికి వెళ్లినప్పుడు మ్యూనిచ్ పట్టణంలో బసచేశాడు. "ఇండియన్ స్టూడెంట్సు అసోసియేషన్"వారు పండితుణ్ణి స్టేషనులో కలుసుకొని ఆహ్వానించారు. సుమారు 2 వేల మందివరకు జర్మను విద్యార్థులు స్టేషనులో గుమిగూడి పండితుణ్ణి చూచి ఉప్పొంగిపోయారు. నెహ్రూ పండితుడు తన స్నేహితుడైన ఒక విద్యార్థితో హోటలులో బసచేశాడు. మధ్యాహ్నం, టెలిఫోనులో ఒక పిలుపువచ్చింది; హిట్లరుకు కుడిభుజమైన డా॥ గోయబిల్సు నెహ్రూ పండితుణ్ణి చూడటానికిగాను దర్శన మిప్పించవలసినదని కోరగా నెహ్రూ అందుకు అంగీకరించాడు. మరుక్షణంలో డా॥ గోయబిల్సు తనమామూలు మిలటరీ యూనిఫారంతో నెహ్రూ బసకువచ్చి రాజమర్యాదలోనే పండితుడికి నమస్కరించాడు. పండితుడు హైందవ సాంప్రదాయానుసారంగా ప్రతినమస్కారంచేసి సోఫాలో కూర్చోమన్నాడు. కాని గోయబిల్సు కూర్చోక ఒక ఉత్తరం చేతికందిచ్చాడు. దానిలో 'ప్రముఖ భరతనాయకుడు మాదేశం వచ్చాడు. మా ప్రభుత్వపు అతిథిగా వచ్చి మమ్ము ఆనందింపచేయ గోరుచున్నాము' అని హిట్లరు వ్రాసిన పంక్తులుచూచి, పండితుడు 'తాను జర్మనీ రావడంలో రాజకీయ కారణాలేమీలేదనీ, కేవలం స్వవిషయాలపనిమీదనే వచ్చినానని అందువల్ల ప్రభుత్వ సత్కారాన్ని స్వీకరించడానికి తనకు అభిమతంకాద'ని జవాబిచ్చాడు. గోయబిల్సు రెండు మూడు సార్లు రెట్టించి రమ్మనికోరాడు. కాని పండితుడు నిరాకరించాడు. గోయబిల్సు వెళ్ళిపోయాడు. ఆదర్శాలకు ఉత్తర దక్షిణధ్రువాల కున్నంతదూరం వున్నప్పుడు పండితుడు హిట్లరు, ముసోలినీ నియంతలకు యీలా సమాధానం ఎందుకు చెప్పడు?

# గ్రంథ సమీక్ష

## భక్తియోగము

శ్రీ వివేకానంద ప్రవచనము. అనువాదం: శ్రీ మాధవచైతన్య బ్రహ్మచారి. ప్రకాశకులు: శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మదరాసు. వెల 0-8-0.

ఆధునికయుగంలో పరమేశ్వరానుగ్రహానికి పాత్రులమవడానికిగాను, భగవత్ ప్రార్థనమునకై నియమితమైన ఘడియలు, దినములు గడిచినకొలదీ సంకుచితమైపోతూ వున్నాయి. ఈ అజ్ఞానతమస్సులో యీదులాడుతూవున్న ప్రజానీకానికి జ్ఞానజ్యోతిని చూపించి మానవోద్ధరణకు పాటుపడే సంస్థల్లో రామకృష్ణ మఠాలు ప్రధానస్థానాన్ని అలంకరించివున్నాయి. హిందూమాత కడుపుపండిన బంగారుబిడ్డ శ్రీ వివేకానందుడు, భగవత్ప్రాప్తిని సులువుగా పొందడానికి వీలయ్యే సునిశితమైన భక్తిమార్గాన్ని ప్రబోధించాడు. ఆయన దివ్యవాక్కులు దేశ దేశాలనికూడా అతిక్రమించి ప్రఖ్యాతమైనాయి.

ఈ మహామహుని ప్రవచనాలని సరళమైన భాషలో, మనస్సుకు హత్తుకొనేటట్టు అనువదించారు శ్రీ మాధవచైతన్య బ్రహ్మచారిగారు.

అనువాదకులు సహజముగా భక్తిజ్ఞానపిపాసులు కావడంవల్ల, వీరి అనువాదం కేవలం అనువాదంగానే వుండిపోలేదు. స్వామివారి భావాలు, అవసరమని తోచినచోట్ల టిప్పణాలు, మరికొన్ని ఆధునిక విషయాలుకూడ చేర్చబడివుండటంవల్ల ఒక చక్కని గ్రంథంగా యిది రూపొందింది. పరమేశ్వరోపాసకులే కాక, సర్వులు యిది చదవవలసిన గ్రంథము.

మానవకళ్యాణానికి ఇటువంటి సద్గ్రంథాలను రచించి, చక్కని కాగితాలపై ముద్రించి, తక్కువ వెలలకే ప్రకటిస్తూవున్న శ్రీ రామకృష్ణ మఠమువారు అభినందనీయులు.

## మహాభక్త విజయం

కర్త: శ్రీమాన్ పరవస్తు జియ్యరు సూరిగారు వెల రు 3 0 0 లు తపాలా ఖర్చులు 14 అణాలు. చిరునామా ఎంబార్ భాష్యాచార్యులుగారు శ్రీ నిధిప్రెస్ నెం 74 సెపింగ్సురోడ్డు, బెంగుళూరు దండు.

భారతభూమి మహాభక్తులకు కన్నతల్లి. ఆయమ ఆధ్యాత్మికవిభూతి యెనలేనిది. ఋషిప్రోక్త గ్రంథముల కాలమునుండి మహిమోపేతులైన పలువురు మహాభక్తులు పుట్టి పరమాత్ముని వివిధరీతుల సేవించి, సద్ధర్మముల ప్రజలలో ప్రతిష్ఠింపజేసి, దేశదేశములవారికి ఆదర్శులైనారు.

# యుద్ధరంగము

● టర్కీ బల్గేరియాల ఒడంబడిక ● దూరప్రాచ్యమున జపాన్ విషమస్థితి
● ఆఫ్రికాలో ముసోలినీ పరాజయములు ● సోవియట్ రష్యా జపాన్ ఒడంబడిక

— అరుంధతి —

యుద్ధము ప్రారంభమైన నాడిగ గత రెండేండ్లలోను తలవని తలంపుగ అనేక సంఘటనలు కలిగినవి. ప్రప్రథమమున సంగ్రామ ప్రారంభములో జర్మనీ - రష్యాల నిరాక్రమణ యొడంబడిక, తిర్గి యీ మాసములో అట్టివి కాకపోయినను అంతటి ప్రాముఖ్యతగలవి రెండు ఒడంబడికలు జరిగినవి. టర్కీ - బల్గేరియా యొడంబడిక ఒకటి. రష్యా - జపాన్ ఒడంబడిక రెండు.—నిజముగ రష్యా - జర్మనీ ఒడంబడికవలన గత రెండు సంవత్సరములుగ జరిగిన యుద్ధపోకడలు, ఫలితములకు దీటువచ్చు ఫలితములు, పర్యవసానములు యీ మాసమున జరిగిన యీ రెండు ఒడంబడికలవలన గలుగుననుటకు సందియము లేదు.—

## ● టర్కీ బల్గేరియాల ఒడంబడిక

ఇంగ్లండును జయించవలె.—దీనికి ఐరోపాఖండ భూభాగమందు తనకు శత్రువులుండరాదు. తన యాధిపత్యము నిర్విఘ్నముగ కొనసాగవలె. హిట్లరునకు ఇది ప్రథమ కర్తవ్యము. ఇందుకు స్వతంత్ర ఫ్రాన్సు నాయకుడు పెటియను సేనాని లోబడక కొరకురాని కొయ్యయైనాడు. లావల్ తతంగముతో, ఫ్రాంకో సేనాని మధ్యవర్తిత్వముతో పెటియను లోబడినాడు. హిట్లరుకు ఇక్కడి భారము కొంత తగ్గినది.

ఇక బాల్కను రంగములో గ్రీసును జయించినగాని లాభములేదు. ఇందుకు రష్యా మధ్యవర్తిత్వముతో టర్కీ - బల్గేరియాల ఒడంబడికను చేయించినాడు. టర్కీ తన యాధిపత్యమున నుండుటకును, తదితర రాజ్యములు జర్మనీ యాధిపత్యమున నుండుటకును జర్మనీ రష్యాలు నిశ్చయించుకొన్నవి. ఫలితముగ టర్కీ - బల్గేరియాల నిరాక్రమణ యొడంబడిక గతవారములో టర్కీ రాజధాని నగరమగు అంకారాలో జరిగినది. యీ యొడంబడిక ఫలితముగ ఉభయరాజ్యముల నడుమ నిరాక్రమణ, స్నేహభావములు వర్ధిల్లునటుల అంగీకరింపబడినది. బల్గేరియా, గత యుద్ధానంతరము గోల్పోబడిన రాజ్యభాగములు—యుగోస్లేవియానుండి, రుమేనియానుండి తిరిగి పొందవలెనని తెలియజేయుచున్నది.

గ్రీసుమీదికి దండెత్తివెడలుటలో తన సైన్యములను బల్గేరియానుండియు, రుమేనియానుండియు, యుగోస్లేవియానుండియు జర్మనీ నడిపించవలసివచ్చుచున్నది. అప్పుడు గ్రీసు తరఫున, బ్రిటను తరఫున టర్కీ ఆ యుద్ధములో పాల్గొనక తప్పదు. టర్కీ కలుగజేసుకొనిననాడు ముందుగ టర్కీపై జర్మనీ దాడి సాగించవచ్చును. అట్టి పరిస్థితులలో టర్కీ సరిహద్దులనుండి మధ్యధరా ప్రాంతములకు పోవు తన రహదారీ మొదలైన విషయములలో రష్యాకు మిక్కిలి ఆటంకమేర్పడును. అందులకై రష్యా టర్కీని తన చేతికిందకు తీసికొని, బల్గేరియాతో స్నేహభావము కల్పించి తనకు నష్టము వాటిల్లకుండ చేసుకొనినది.

ఇప్పుడు జర్మనీ గ్రీసుపై దాడివెడలుటకు తన శతఘ్నులతోను, కాల్బలములతోను రుమేనియా, బల్గేరియా సరిహద్దులలో ప్రవేశించుచున్నది.—

గ్రీసును జయించి, మధ్యధరా, సూయిజు మార్గములను బంధించవలెనని జర్మనీ త్వరితముగ ప్రయత్నించుచున్నది.—ఇది ఓడిపోవుచున్న ముసోలినీకి సహాయమగుటయే గాక మధ్యధరాను జయించు నాశతో

హిట్లరు వేసిన ఎత్తు యిది. అందువలననే గతవారము మాట్లాడుచు, హిట్లరు - ముసోలినీల స్నేహమును విచ్ఛిన్నముచేయుట ఎవరితరముగాదని తెల్పియున్నాడు హిట్లరు.—

## ఆఫ్రికాలో ముసోలినీ పరాజయములు

ఇక ఆఫ్రికారంగమున ముసోలినీకి పూర్తిగ పరాజయమే ప్రాప్తించినది. ఇటాలియను సామ్రాజ్యము సగమునకు పైగా ఇంగ్లండు సైనికులు ఆక్రమించి విశేషసైన్యమును, ఆయుధపరికరములను ఆక్రమించుకొన్నారు. అబిసీనియానుండి ఇటలీ సైన్యములు తిరుగుమొహము పట్టవలసివచ్చినది.—

జర్మనీయొక్క సూయిజు మధ్యధరా దాడిని ఎదుర్కొనుటకు ఆఫ్రికారంగమున విజేతలైన బ్రిటిషు సైన్యమును వెంటనే గ్రీసు రంగమునకు బ్రిటను మరలింపవచ్చునని అనుకొనుచున్నారు. గ్రీసునందలి బ్రిటిషు విమానదళము బలవంతమొనర్పబడుచున్నది. సిసిలీ ఈజిప్టు ప్రాంతములందు బ్రిటిషు సైనికులు నిర్భయముగ శతఘ్నులతో గుండ్లను వర్షించి ఎదిరించుచున్నారు. బ్రిటిషు సైన్యము ఇటలీయందే ప్రవేశించి ఎదిరించవచ్చునని గూడ అనుకొనుచున్నారు.

ఇటు సూయిజు దాడిని ఎదుర్కొనుటకు బ్రిటిషు విదేశాంగమంత్రి ఈడెన్, సైనికాధికారి సర్ జాన్ డిల్లు - ఇరువురును కలసి ఈజిప్టు వెళ్లి సైనికాధికారులతో సంప్రదించి సర్వసన్నాహములను గావించుచున్నారు. గ్రీసును జయించి, గ్రీసు ద్వీపములమీదుగా సిరియా ప్రాంతమునకు సైనికుల దింపి సూయిజుపై దాడి సాగించవలెనని జర్మనీ ఆతురపడుచున్నది. మధ్యధరా రంగమున ఇంతవరకులేని నౌకా, విమాన పోరాటమును త్వరలో సంభవించెడి పరిస్థితులు విషమించుచున్నవి.

ఒకవైపున ఐరోపా రంగములలో తాను దాడిచేయు సమయములయందే దూరప్రాచ్యమునగూడ చిచ్చుముట్టించి బ్రిటిషు బలములను రెండు రంగములయందు విభజింపజేసి, అమెరికా సహాయమురాకుండ జేయవలెనని హిట్లరు సంకల్పించుకొనినాడు. అందులకు జపాన్‌ను డచ్‌వారి తూర్పు ఇండియా దీవులను, హైనానును ఆక్రమించమని ప్రోత్సహించినాడు. ఈ డచ్ తూర్పు ఇండియా దీవులనుండి నూటికి 90 వంతులు తుత్తినాగము, రబ్బరు అమెరికాకు సప్లైయగుచున్నది. ఇక్కడ పెట్రోలు గనులుగూడ పుష్కలముగ నున్నవి. ఇవి జపాన్ స్వాధీనముకాకుండ ఎదిరించవలసిన బాధ్యత అమెరికా, ఇంగ్లండులమీద పడినది.

## దూరప్రాచ్యమున జపాన్ విషమస్థితి

తూర్పు ఇండియా దీవులను, హైనానును జయించి, తదుపరి సింగపూరుపై బడుటకు జపాను తన సైన్యములను అచ్చట కేంద్రీకరించుచున్నవి. వీటినెదుర్కొనుటకు ఆస్ట్రేలియానుండియు, ఇండియానుండియు, తదితర కేంద్రములనుండియు తన బలములను బ్రిటనుకు ఆయత్తపరచుచున్నది. హవాయినుండి బ్రహ్మాండమైన తన బలములను పంపుటకు అమెరికా సిద్ధముగ నున్నది.

ఆంగ్లో - అమెరికను సైన్యములు యీ విధముగ సమీకరింపబడుట జూచి జపాను కొంచెము వెనుకడుగిడుట నిజము.

అదియునుగాక రష్యాతో తనకు ఏదో యొకవిధమైన యొడంబడిక కుదిరిననే గాని జపాన్ ఎట్టి చర్చకు దిగుటకుగాని సిద్ధపడదు.—రష్యాతో ఏ సమయమున యుద్ధము సంభవించునో యని తన సైన్యములను చాలవరకు రష్యా సరిహద్దులల్లో కేంద్రీకరించియున్నదింతవరకు జపాన్. ఇప్పుడు దక్షిణమున యీ యుద్ధమున దిగవలెనని ఆ సైన్యములను దక్షిణమునకు గొనిరావలసియున్నది. ఇందుకు రష్యా - జపాన్‌లకు సంధి కుదిరిన గాని ప్రయోజనముండదు.—

## ● సోవియట్ రష్యా జపాన్ ఒడంబడిక

జర్మనీ యీ విషయమున ఇంతకాలమునుండియు రష్యాతో తన పలుకుబడినంతను వినియోగించుచున్నది. ఇట్టి ఒడంబడిక కుదురుటకు ఎట్టి షరతులకైన అంగీకరించుటకు జపాన్ సిద్ధముగనే యున్నది. దీనికి ఉపోద్ఘాతముగ రష్యాకును - జపాన్‌కును మాస్కోలో ఒక ఆర్థిక యొడంబడిక జరిగినది. ఫలితముగ జపాన్‌కు రష్యా భయము కొంతవరకు తగ్గినది.

ఇవి యిటులుండ జపాన్ విదేశాంగమంత్రి మట్సుఓకా గతవారము ఐరోపా మహాసంగ్రామమున మధ్యవర్తిత్వము వహించి ఉభయపక్షములకు రాజీ కుదిర్చెదనని బ్రిటనుకు, అమెరికాకు సందేశ మంపియున్నాడు. ప్రస్తుత పరిస్థితులలో ఇంగ్లండుగాని అమెరికాగాని యిట్టి సమాధానములకు దిగరు. ఆ పరిస్థితి దాటిపోయియున్నది. ఇది కేవలము బ్రిటను, అమెరికాలను నెపపెట్టుటకేగాని వేరుగాదు.

జర్మనీ—జపాన్‌లు యీ విధముగ సమరసన్నాహముల నతి శీఘ్రముగ నాయత్తపరచుచుండ, బ్రిటనుకు సహాయముజేయుటకై యునైటెడ్ స్టేట్సు సెన్‌టులో రూజువెల్టు సభాపతిచే కొనితేబడిన "అరువు కవులు చట్టము" అతి త్వరితముగ అంగీకరింపబడనున్నది. గత వారమురోజులుగ జరుగుచున్న చర్చల ఫలితముగ అసలు చట్టమునకు ఎట్టిమార్పులు జరుగకయే చాలభాగ మంగీకరింపబడినది. దీనితో జపానుపై ఆర్థిక బహిష్కారములు జరుపుటకువలయు సన్నాహములుగూడ జరుగనున్నవి. ప్రజాభిప్రాయముగూడ చట్టమునకు చాలవరకు అనుకూలముగనున్నది.

పరిస్థితులు నానాటికి చాల విషమించుచు యుద్ధమేఘములు పూర్వ పశ్చిమార్ధగోళములను ఆవరించుచు, చాల క్లిష్టపరిస్థితులు సంభవించవచ్చునని మాత్రము చెప్పగలము. (27-2-41)



# సంపాదకీయములు

★ నమస్తే—

గృహలక్ష్మికి విజయవంతమైన మరొక్క సంవత్సరము గడచినది. పదమూడేండ్లు నిండి, పదునాలుగవ సంవత్సరమున ప్రవేశించినది.

పదునాలుగవ జన్మదినోత్సవమును జరుపుకొని, నాడు తన సంఘసేవా కార్యక్రమమున తనకు నీడుదోడై సహచరించిన తన సోదరీమణులను యథోచితిగ సత్కరించి, 14 వ దిగ్విజయ యాత్రకై బయల్వెడలినది.

రజతోత్సవములు, సువర్ణోత్సవములు జరుపుకొని దినదిన ప్రవర్ధమానమై దేదీప్యమానముగ వెల్గుచున్న పత్రికామతల్లులు భారతదేశమున ఎన్నియోయున్న యీ తరుణమున 13 సంవత్సరముల విజయమును సగర్వమైన విషయముగ జెప్పికొనుట కేవలము హాస్యాస్పదముగనే యుండును—

కాని మన యాంధ్రదేశమున యిది పూర్తిగ సగర్వముగ జెప్పుకొనదగిన విషయమే! సస్యశ్యామల భరితమై యొప్పు మన త్రివేణీ ఖండము పత్రిక లతలకు ధారకము నొసంగ జంకుచున్నది. నీరు కరవైన యీ నేలసారు పెరిగి మనుటయనిన మాటలా?

ఎన్ని పత్రికలు పుట్టుటలేదు-ఎన్ని మరుక్షణముననే గిట్టుటలేదు? 13 సంవత్సరములు నిండినప్పటికిని గృహలక్ష్మి స్వయంపోషకము గాలేదనిన ఎవరి దీలోటు? స్వయంపోషణమున కొరవడిన ఇట్టి పత్రికకు 13 ఏండ్లుగాదు గదా 13 మాసములు మాత్రము బ్రహ్మయజ్ఞముగాదా? ఇట్టితరి బాలారిష్టములు దాటి షోడశవర్షప్రాయమున కాలిడుచున్నదన్న గృహలక్ష్మికి గర్వముగాక మరేమి?

ఈ విజయము మాదిగాదు—ఆదినుండియు గృహలక్ష్మికి అత్యంతమైన సహకారము నిచ్చుచు, చేదోడువాదోడై నిలచిన ఆంధ్ర సోదరసోదరీమణులది-వారికీ తరుణమున మా హృదయపూర్వక నమస్సులు.

స్త్రీజన ఔన్నత్యము, బాలపాపల భాగ్యోదయము, సముజ్వలమైన సంఘనిర్మాణము—తన పరమాశయములుగను, నిత్యకృత్యములుగను దీక్షవహించి గత జీవితములో వీరవిహారమొనర్చి ప్రజాహిత జీవితములో నొక విశిష్టస్థానమును నిర్మింపజేసుకొనిన దీసరికి గృహలక్ష్మి. ఈ పవిత్ర ధర్మమును ఇంతవరకు విస్మరించి ఎరుగదు—విస్మరింపబోదు.

తాత్కాలిక భావోద్రేకములకు తావిచ్చి, తాత్కాలిక ప్రయోజనములకై ప్రాకులాడి, వ్యక్తిగత వైమనస్యములతోగాని, వ్యక్తిపర వ్యాపారదృష్టితోగాని గృహలక్ష్మి సాగింపబడలేదు. మహోజ్వలమైన సంఘ నిర్మాణమునకు సునిశ్చితమైన కార్యకలాపము గలిగిన శాశ్వత నిర్మాణభావ సముదాయముతే

గృహలక్ష్మి పరమాశయములు. ఇందులకు గృహలక్ష్మి గత జీవిత కథనమే తార్కాణము. ఇదియే ఆంధ్ర ప్రజానీకమునకు గృహలక్ష్మి కేల్మోడ్పుతో సమర్పించు ప్రబల నిదర్శనము.

కాని గృహలక్ష్మి బాధ్యతఇంతటితో తీరలేదు—

క్షణక్షణము మారిపోవుచు ప్రపంచ చరిత్రమే హింసాహింసల నడుమ త్రిశంకు స్వర్గనివాసము చేయుచున్న నేటి పరిస్థితులలో సుస్థిరత్వ మనుమాటయే నీటిలోని మాటయైనది.

సంఘనిర్మాణమునకు తన జీవితమును అంకిత మొనర్చిన గృహలక్ష్మి యొక్క స్థిరత్వము సంఘము యొక్క సుస్థిరత్వము. అందున కనువగు పరిపూర్ణ సహకారములు ముఖ్యముగ గావలసియున్నవి.

నవనవోన్మేషములైన కాంతులను రాష్ట్రములోని అన్ని వర్గములపైనను ప్రసరించుచు, సౌష్టవమును, సౌకుమార్యమును, సంపూర్ణత్వమును పొదుకొల్పు అభివృద్ధి సూచనలకై గృహలక్ష్మి తన సోదరసోదరీమణులను యీ నూత్న సంవత్సర విజయ యాత్రారంభమున వినమ్రమై అర్థించుచున్నది—

ఆదరణ జూపుట ఆంధ్ర సోదరసోదరీమణుల కనీస ధర్మము, విధి.

♦ ♦ ♦ ♦

## ★ శరీర, మానసిక వ్యాయామములు

"ప్రాచీన భారత చరిత్రలో రసపుత్ర మహారాష్ట్ర వీరవనితల కార్యపరాక్రమాలంటే ఇప్పుడు నాకు నమ్మకం ఏర్పడ్డది. ఛత్రపతి శివాజీతల్లి ఎంతటి వీరవనిత గాకపోతే, అంతటి వీరుడా తల్లిగర్భాన జన్మించేవాడు?......గుజరాతు దేశంలోని స్త్రీలు పురుషులకంటె బలశాలురు, ధైర్యశాలురు."అని ప్రస్థుతించినారు సర్ ఆల్లాడి కృష్ణస్వామయ్యగారు, గత మాసమున మద్రాసునందు జరిగిన ఆర్యకన్యా విద్యాలయ బాలికల వ్యాయామ ప్రదర్శనములను వీక్షించి.

వీరేగాక, నాటి ప్రదర్శనముల కేతెంచిన పెద్దలందరును ఇట్టి ప్రశంసలనే వెల్లడించిరి. నిజముగ నాటి ప్రదర్శనముల గాంచినవారిని, అవి ఒడలు పులకింపజేయుటయేగాక, నూత్నానందోత్తేజముల ముంచి తేల్చినవి.

సుకుమారిణులైన బాలికలు ఇట్టి వీర పురుషోచితములైన సాముగరిడీలను నేర్చుకొనిన, స్త్రీ జన సహజ ప్రత్యేకమైన సౌకుమార్యము నశించి మొరటుదనము వ్యాప్తినందునను భావము కొందరికి గల్గవచ్చును. స్త్రీలకిట్టి వ్యాయామము—అసలు ఏ విధమైన వ్యాయామముగూడ నవసరములేదను పురుషమ్మన్యులు బయలుదేరిన యీ కాలమున యిట్టి వ్యాయామమునకు మొదలే స్థానముండదేమో!

కాని ఆర్యకన్యా విద్యాలయపు బాలికల నొకసారి వీక్షించిన, మనవారీ విషయమున ఎంత పొరపడుచున్నారో విశదము కాగలదు. సాము గరిడీలతోబాటు సారస్వతము, సంగీతము, నృత్యము వీరికి గఱపబడుచున్నవి. శరీర వ్యాయామముతోబాటు మానసిక వ్యాయామముగూడ నొసంగబడుచున్నది. ఇట్టి తరిఫీదునొందియున్న బాలికలకు నవనవోజ్వలమైన దేహ నిర్మాణము సమకూడుటలో ఆశ్చర్యములేదు.

అసలు మన స్త్రీలకు వ్యాయామమనునదే గగనకుసుమము. ఇక పాఠశాలలో—అసలు స్త్రీలకు పాఠశాలలే తగినన్ని లేవు ఇక ఉన్నవాటిలో—వ్యాయామమనునది తెలుగు తరగతియందువలెనే—అధ్యాపకులకే కాక విద్యార్థినులనుగూడ అలక్ష్యము—నిరసనము.

ఇక, వికృతములగు నిట్టి మానసిక ప్రవృత్తులలో ప్రసాదింపబడిన అస్వల్ప మాత్రపు వ్యాయామము అధికమైన వ్యయప్రయాసములతో కూడికొనియున్నది. ఫలితముగ అధికవ్యయము—అత్యల్ప ప్రయోజనము మనకు లభించుచున్నది.

అందును ఆంగ్ల విద్యాభ్యాసముచేయు బాలికల విషయము ఇంకను అధోగతిగనున్నది. నేటి మన విద్యావిధానమున మానసికబలము, దేహబలముకూడ కరవుగనున్నది. ఉన్నబలముగూడ "ఆల్జిబ్రా-జామెట్రీ" వ్యాయామమున నశించుచున్నది. బానిసభావములను పెంపొందించునదిగనే యున్నదీ విద్యావిధానముగాని మరెందుకును కొఱగాకున్నది.

దైహిక, మానసికశక్తులు రెండును—సమముగ, సౌష్టవముగ, సమృద్ధిగ వృద్ధినందినప్పుడే గాని నేటి బాలికలు తమకుగాని, సంఘమునకుగాని, దేశమునకుగాని ఎందుకును ఉపకరించరు. అచ్చముగు యీ పద్ధతులపై గాకపోయినను, ఇంచుమించుగ వీటికి సరివచ్చు ఆదర్శములపై నడుపబడు సంస్థ—విద్యాలయమను నామకరణము లేకపోయినను—మద్రాసునందుగూడ నొకటి యున్నది. అదియే శ్రీమతి దుర్గాబాయమ్మగారి ఆధ్వర్యమున దివ్యశోభల వెదజల్లుచు పెంపొందుచున్నది—చెన్నపురి ఆంధ్రమహాసభ - స్త్రీలశాఖ. బుద్ధికి, ఒంటికి పనిచెప్పి, మహోన్నతాదర్శములపై దృష్టినిల్పి కట్టుబాటులలో నడపబడినవిద్య జాతికి జీవమును, దేశమునకు చేవను ప్రసాదింపగలదు.

ఈ రెండు శక్తులను విరివిగ ప్రసాదించు యీ ఆర్యకన్య విద్యాలయమువారి పద్ధతులను విరివిగ నెలకొల్పవలసి యున్నది.

వీరి నాదర్శముగ నిడుకొని మన విద్యాలయాధికారులు వెంటనే యీ పద్ధతులను అమలునందుంచ ఏల ప్రయత్నింపరు ?

♦ ♦ ♦ ♦

## ★ అవ్వై అనాథాశ్రమము

ప్రభుత్వాదరణ కొఱవడిన దేశములందు ప్రజాహితైక సంఘములే సమాజాభివృద్ధికి పట్టుగొమ్మలు. మద్రాసునందు ఇట్టి సంస్థలుకొన్ని పనిచేయుచున్నవి. నిజముగ అనాథబాలికలకు పూర్తిగ సహాయముజేయు సంస్థ ఏదనిన శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారిచే స్థాపింపబడి నడుపబడుచున్న "అవ్వై అనాథాశ్రమము" ప్రథమస్థాన మాక్రమింపగలదు. ఇక్కడచేరి చదువుకొన్న బాలికలలో ఇద్దరు వైద్యపరీక్షకును, 10 మంది మిడ్ వైఫరీ పరీక్షకును 13 గురు బాలికలు సెకండరీగ్రేడు ట్రైనింగు పరీక్షకును, 12 గురు బాలికలు హయ్యరు ఎలిమెంటరీ టీచర్లుగను వెళ్లి, కృతార్థులై వారి జీవితములను వారు పోషించుకొనుచుండిరని గతమాసాంతమున జరిగిన వార్షికోత్సవమునాడు వార్షిక నివేదికలో శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు తెల్పియున్నారు. ఇది ఎంతయు సంతోషింపదగిన విషయము.

ఇట్టి చక్కని ఫలితములనిచ్చుచున్న యీ సంస్థకు విరాళములు అత్యల్పముగ లభించుచున్నవనియు ప్రజలు విరివిగ ధనసహాయము చేయవలసినదనియు శ్రీమతీ ముత్తులక్ష్మిరెడ్డిగారు కోరియున్నారు.

బాలికలకు—అందును అనాథలకు—జాతిమత విపక్షతలేక మంచినడత, మంచివిద్య ప్రసాదించుచు, వారిసేవకై నిరంతరము పాటుపడుచున్న శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారికి, విరివిగ విరాళములిచ్చి శ్రీమంతులు తోడ్పడుట ధర్మము. ధన సహాయమున్నయెడల నీ యాశ్రమము ఇంకను సేవజేయగలదనుటలో అతిశయోక్తి లేదు. ఇందుకు ధనవంతులు తోడ్పడుదురని ఆశించుచున్నాము.

Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.